శ్రీః

ఓం నమశ్శివాయ

శ్రీ పుష్పదన్తకృత

# శ్రీ శివమహిమ్న స్తోత్రమ్

విభూతీవ్యాఖ్య

(ప్రతిపదార్థ-తాత్పర్య-అనువాద పద్య-వివరణములు)

దోర్బల విశ్వనాథశర్మ

ప్రకాశకులు

**శ్రీ విశ్వేశ్వరాశ్రమము**

రామాయంపేట - 502 101, మెదక్ జిల్లా



వెల : రూ. 15-00



శ్రీ పుష్పదన్తకృత

**శ్రీ శివమహిమ్న స్తోత్రమ్**

విభూతీవ్యాఖ్య

(ప్రతిపదార్థ-తాత్పర్య-అనువాద పద్య-వివరణములు)

దోర్బల విశ్వనాథశర్మ

ప్రథమ ముద్రణ:- 14-06-2003 - స్వభాను - ఏరువాక పూర్ణిమ

ప్రతులు : 1000

పేజీలు : 144

వెల రూ. : 15-00

**బ్రహ్మశ్రీ గడియారం కృష్ణంభట్టు, లక్ష్మమ్మ దంపతుల స్మృత్యర్థం**



DTP by
Vikram Graphics
Opp. M.R.O. Office
CHIRALA - 523 155
Ph.: 08594 - 237658

Printed at
Vijayalakshmi Offset
Naaz Complex,
CHIRALA - 523 155
Ph.: 08594 - 233057

# శివమహిమావలోకనము

హృదయములోని భావోద్రేకముల వ్యక్తీకరణము భాషారూపమును ధరించును, ఆశ్చర్యమో, కోపమో, భయమో, ఆనందమో, కృతజ్ఞతయో, ఉద్రిక్తమై భాషా రూపమున బహిర్గత మగును. సుకృత దుష్కృతముల ననుసరించి భగవంతుడు జీవులకు సుఖదుఃఖముల ననుభవింపజేయుట ముఖ్యమైన మత సిద్ధాంతము. సుఖానుభవకాలమున నుద్రేకించిన సత్త్వగుణాతిశయముచే 'సుఖము స్వకృతసకృత సంపాదిత' మయి రాజసతామసాహంకారమణిగి సుఖ ప్రదాయతయెడ భక్తులైనజీవుల హృదయమున కృతజ్ఞతాభావము విజృంభించుట యే స్తోత్ర వాఙ్మయావిర్భావమునకు హేతువు. ఈ హేతువుచేతనే అనాదికాలము నుండి అన్ని భాషలలో స్తోత్రవాఙ్మయము కనుపించుచున్నది. ఇతర భాషలతో పోల్చినపుడు సంస్కృత భాష యితర వాఙ్మయ శాఖలలో సంతరించుకొన్న సమృద్ధికన్న స్తోత్రవాఙ్మయమునందు సంపాదించుకొన్న సమృద్ధి అధికము అతివిశిష్టమునై యున్నది. ప్రథమ వేదము ఋగ్వేద మంతయు స్తోత్ర రూపమే 'వేదానాం సామవేదోఽస్మి' అని భగవద్విభూతిగా ప్రసిద్ధినందిన సామవేదము కూడ స్తుతి గీతమయమే. ఇతర వేదములలో కూడ అర్థము ననుసరించి స్తోత్రములని చెప్పుటకు వీలు కాని మంత్రములు సైతము భగవత్పూజాత్మకము లయిన యజ్ఞాది కర్మలలో వినియోగింపఁబడుట స్తోత్రగౌరవమునే పొందు చున్నవి. వేదపారాయణము బ్రహ్మ యజ్ఞరూపమున వాచిక పూజాత్మక స్తోత్ర పాఠమే యగుచున్నది. వేదోపబృంహకమయిన శాస్త్రపురాణేతిహాసాది లౌకిక సంస్కృత వాఙ్మయము కూడ స్తోత్రపావిత్ర్యమును సంపాదించుకొనియేయున్నది. ఈ విషయమును ప్రతిపాదించుచు 'వేదాది సమస్త వాఙ్మయములందుఁ బ్రశంసితుఁడైనవాఁడు' అని చెప్పిన నన్నయ సమస్త శబ్దప్రయోగముచే సంస్కృత వాఙ్మయమేకాక సమస్త వాఙ్మయము కూడ స్తోత్రరూపమేయని సూచించినాడు. అర్థతాత్పర్యానుసంధానమున సమస్త శబ్దరాశి యొక్క స్తోత్రరూపత వ్యక్త మొనర్చినాఁడు. అర్థతాత్పర్యానుసంధానము లేకున్నను **'కావ్యాలాపాశ్చ యే కేచిత్ గీతికాన్యఖిలానిచ శబ్దమూర్తి ధరస్యైతే విష్ణోరంశామహాత్మనః'** అని సమస్త శబ్దరాశి భగవన్మూర్తియని విష్ణుపురాణము చెప్పినది. ఇట్లు అర్థతాత్పర్యాను సంధానమున్నను లేకున్నను పరంపరా సంబంధమున సమస్త వాఙ్మయము స్తోత్రరూపమేయైనను సాక్షాత్తుగా భగవంతుని ప్రతిపాదించు స్తోత్రవాఙ్మయము



సంస్కృతభాష యందు ఇతర భాషా వాఙ్మయశాఖా వైలక్షణ్యమును వైశిష్ట్యమును సంపాదించుకొనియున్నది.

భగవదనుగ్రహ సంపాదకములైన కర్మలలో అర్చన మానసిక కాయిక వాచిక రూపమున త్రివిధమై త్రికరణశోధక మగుచున్నది. భావనాత్మకమైన మానసిక పూజవలె పరిచర్యాత్మకమైన కాయిక పూజవలె స్తోత్రపాఠాత్మకమయిన వాచిక పూజయు కల్యాణ హేతువనుటలో సంశయము లేదు. ఉపచారములలో మంత్ర పుష్ప పఠనమును ఉపచార పూజకు ముందుగాని, వెనుకగాని పారాయణము లను సంప్రదాయజ్ఞులు విధించుట స్తోత్రపాఠ వైశిష్ట్యమును నిరూపించు చున్నది. స్తోత్రవాఙ్మయ స్రష్టలలో దూర్వాసుఁడు మొదలగు ఋషులు రావణాది రాక్షసులు ఇంద్రాది దేవతలు పుష్పదంతాది గంధర్వులు కాళిదాసమయూర బిల్హణ మల్హణ వేదాంతదేశిక జగన్నాథాప్పయదీక్షితాది విద్వత్కవులు ఆళ్వారులు నాయర్లును మొదలగు వారెందఱో కలరు. స్తోత్రములలో శివానందలహరి సౌందర్యలహరి ముకుందమాల పాదుకాసహస్రము లక్ష్మీసహస్రము శివవిష్ణు లలితాసహస్రనామస్తోత్రములు మహిమ్నః స్తోత్రములు మొ॥వి ప్రసిద్ధములు.

వీనిలో శివమహిమ్నఃస్తోత్రము అతి ప్రసిద్ధ స్తోత్రము. ఇది భాషా సౌష్ఠవమునకు భావగాంభీర్యమునకును నిలయము. హృదయ కుహరములలోని అజ్ఞానాంధకారమును దూరముచేయు నీ స్తోత్రమణికాంతులను స్తోత్రకర్తలలో పెక్కురు మూటఁగట్టుకొనుటకుఁ బ్రయత్నింపకుండనుండలేకపోయిరి. ఈ శివమహిమ్నః స్తోత్రము ననుసరించి విష్ణుగణేశ పరశంభు దేవీ మహిమ్నః స్తోత్రములు పుట్టినవి. వీనిలో దూర్వాసోమహర్షి రచితములైన పరశంభుదేవీ మహిమ్నః స్తోత్రములు తంత్రశాస్త్ర జటిలములు. గణేశ మహిమ్నఃస్తోత్రమును కూడ పుష్పదంతుడే రచించినాఁడని స్తోత్రగ్రంథములలో ముద్రింపఁబడినది కాని ఆ పుష్పదన్తుడు శివమహిమ్నఃస్తోత్ర కర్తయైన పుష్పదన్తుడు కాడని పఠితలకు స్పష్టమగును. పరమహంస బ్రహ్మానందస్వామి రచితమైన విష్ణు మహిమ్నము పుష్పదంతరచితమైన శివమహిమ్నమును శబ్దతః అర్థతః అనుకరించినను లలితముగా నున్నది. గీతలు పెక్కులున్నను గీత యనగానే శ్రీకృష్ణ భగవద్గీతయే స్ఫురించినట్లు సహస్ర నామ స్తోత్రములు పెక్కులున్నను సహస్ర నామస్తోత్ర మనగానే విష్ణు సహస్ర నామస్తోత్రమే స్ఫురించునట్లు మహిమ్నఃస్తోత్రమనగానే పుష్పదంతరచిత శివమహిమ్నః స్తోత్రమే స్ఫురించును. ఇట్లు స్ఫురించుట శివ మహిమ్నఃస్తోత్ర ప్రచారాధిక్యమును సూచించును.

ఈ శివమహిమ్నః స్తోత్రమును చదివించుకొనుచు శివున కభిషేకము చేయుట నేటికిని దేశమునందు వాడుకయైయున్నది. ఇతర మహిమ్నః స్తోత్రములకు వ్యాఖ్యానములు రాలేదేమో కాని శివమహిమ్నః సోత్రమునకు మాత్రము పెక్కు వ్యాఖ్యానములు పెక్కు భాషలలో వచ్చినవి. వానిలో మధు సూదనసరస్వతి నిర్మించిన వ్యాఖ్యానము గొప్పది. అందు పుష్పదంతుఁడీ స్తోత్రమును రచించుటకు హేతువుగా ఈ క్రింది యైతిహ్యము ప్రచారములో నున్నట్లు చెప్పఁబడినది. పూర్వము శివభక్తుఁడైన యొక రాజుండెను. ఆతడు దినాచార ప్రకార మొకనాటి యుదయమున శివపూజా పుష్పములఁదెచ్చుటకై సేవకుల నుద్యానవనమునకు పంపెను. సేవకులు పోయి చూడగా నందొక పుష్పమైనను కనఁబడలేదు. సేవకులు పూవు లేమైన వని ఉద్యానపాలకు నదలించిరి. ఉద్యానపాలకుఁడు భయాశ్చర్యముల నొంది దొంగలెవరైన గతరాత్రమున పుష్పాపహరణ మొనర్చి యుందురనెను. నాటినుండి రాత్రింబవళ్ళు నిర్నిద్రులైన వీరభటులనేకులు కాపుంచబడిరి. కాని ప్రతిదినమును పుష్పాపహారము జరుగుచునే యుండెను. అంతట శివభక్తుడైన యా రాజు 'ఎవడో శివభక్తుఁడు తిరస్కరిణీ గర్వితుఁడు పరుల కంటఁబడకుండ పుష్పముల నపహరించు చున్నాడని నిశ్చయించి ఆ తోట యందంతట శివనిర్మాల్యమును జల్లించెను. శివనిర్మాల్యమును ద్రొక్కుటచే తిరస్కరిణీ శక్తి నశించి దొంగపట్టువఁడునని యా రాజుద్దేశించెను. గంధర్వ రాజైన పుష్పదంతుఁడెప్పటివలెనే తిరస్కరిణీ ప్రభావమున నితరుల కంటబడ కుండ పుష్పముల గోయుచు శివనిర్మాల్యమును ద్రొక్కెను. తత్కారణమున నాతనికి తిరస్కరిణీ శక్తియు నాకాశగమన శక్తియు నశించెను. పుష్పదంతుఁడు శివాపచారమున తన దివ్యశక్తులు నశించినవనియు తెల్లవాఱిన రాజభటులు తన్ను బంధించెద రనియు తెలిసికొని దయామయుఁడు సంకట నాశకుఁడునైన యాశివునే స్తుతించి యాతని యనుగ్రహమున తన దివ్యశక్తులను పొంది వెడలిపోయెను. ఆతడు చేసిన శివమహిమ స్తుతియే మహిమ్నః సోత్రముగ ప్రసిద్ధినందినది.

పై కథ ననుసరించియు చదివిన వెంటనే కలుగు అర్థస్ఫూర్తి ననుసరించియు నీ స్తోత్రము శివపరమని స్పష్టమైనను మధుసూదన సరస్వతి యీ స్తోత్రమును శివపరముగను విష్ణుపరముగను వ్యాఖ్యానించినాఁడు. ఒక్కొక్క శ్లోకము నందన్వయ భేదముతో నర్థభేదమును ప్రదర్శించినాఁడు. స్పష్టముగా శివవాచకములైన శబ్దములకు వ్యుత్పత్తి భేదమున విష్ణుప్రతిపాదకత కల్పించినాఁ



డు. గ్రంథగ్రంథులను విప్పి శ్లోక భావములను సుగమమొనర్చినాఁడు. ఈ స్తోత్రమందలి మొదటి పద్యము 'మహిమ్నః' అను పదముతో మొదలగుటవలన దీనికి మహిమ్నః స్తోత్రమని పేరు వచ్చినది. ఈ మొదటి పద్యమునకు 'హర తే మహిమ్నః పరమ్ పారమ్ అవిదుషః మమ స్తుతిః యది అసదృశీ తత్ బ్రహ్మాదీనామపి గిరః త్వయి అవసన్నాః అథ స్వమతి పరిణామావధిగృణన్ సర్వః అవాచ్యః మమాపి స్తోత్రే ఏష పరికరః నిరపవాదః' అని యొక యన్వయము చేయఁబడినది. హరా! నీ మహిమ యొక్క పరమైన పారము నెఱుగని నాస్తుతి అనురూపమైనది కానిచో బ్రహ్మాదుల స్తుతులును అనురూపములు కావు. ఒకవేళ బుద్ధికొలది స్తుతించు నెవ్వఁడైనను అనింద్యుఁడే యగుచో యీ స్తోత్రమందలి నా యీ ప్రయత్నమును నిరాక్షేపణీయమే. ఈ పద్యమందు 'స్తోత్రేహర' పదములను 'స్తోత్రేఅహర' అని అకార ప్రశ్లేషచేసి విభజించి హరుడు(సంహరించువాఁడు) కానివాడా! అనగా పరిపాలించువాడా అని 'విష్ణుపరముగ పై తాత్పర్యము సమన్వయింపఁబడినది. ఈ పద్యమునకే పదవిభజనాన్వయ భేదముతో నీ క్రింది విధముగ మఱొక యర్థము చెప్పఁబడినది. పరమ బ్రహ్మాదీనాం గిరః పారం విదుషః తే మహిమ్నః స్తుతిః యది తత్ అవసన్నా అసదృశీ అపి అస్తు అథ స్వమ్ అతిపరిణామావధి గృణన్ సర్వః, ఆవాచ్యః, స్తోత్రే ఏషః పరికరః, అహః అనిరపవాదః (పరమా! బ్రహ్మాదులవాక్కు యొక్క అవధిని గ్రహించు నీ స్తుతి అల్పము అయోగ్యమును అగుచో అగుగాక స్వాత్మరూపుఁడవైన నిన్ను శక్తివంచన లేక స్తుతించునందఱును నీ చేత సంభాషింపదగినవారే కావున స్తోత్రము చేయువాని కొఱకు నాయీ నమస్కారాది క్రియాకలాపము పూర్తిగ దోషరహితమే (ఇట్లుండ నిన్ను స్తుతించుట సుయోగ్యమని వేఱుగా చెప్పనక్కఱలేదు.) ఈ అన్వయమున పరమ అనుపదమునకు 'పరామాయస్యః' (గొప్ప లక్ష్మియెవనికో వాఁడు) అనువ్యుత్పత్తి భేదమున విష్ణూ అని లేక గొప్పవాఁడా అని హరిహర పరముగ అర్థములు చెప్పఁబడినవి.

ఉపనిషత్తులు భగవంతుని బృహత్ బ్రహ్మమహత్ భూతమ్ భూమా ఇత్యాది పదములతో వ్యవహరించినవి భగవంతుడు మహత్తు ఆయనెక్కడ ప్రతిష్ఠితుఁడైయున్నాడు? అన్న ప్రశ్నకు స్వేమహిమ్ని అని సమాధానము చెప్పఁబడినది. తన స్వరూపమునందే అనుటకు బదులుగ తన మహిమయందే అని చెప్పఁబడినది. మహత్తు యొక్క స్వరూపము మహిమకాక మఱేమి? ఆ మహిమ సగుణము నిర్గుణమునని రెండు విధములుగ నున్నది. అనంత గుణపూర్ణమగుట

వలన సగుణమహిమధర్మరహితమగుటవలన నిర్గుణమహిమయు మనోవాక్కుల కందదు. అట్టి సగుణమహిమనుగాని నిర్గుణ మహిమనుగాని వేదమే సభయముగా స్తుతించుచుండగా దాని నెవడు ధ్యానించగలడు లేక స్తుతించ గలడు?కాని ఆ మహిమ భక్తానుగ్రహార్థము (పరిమితగుణ యుక్తమైన) యాకృతిని ధరించినప్పుడు మాత్రమందఱి మనోవాక్కులును దానినందుకొనుటకు యత్నింప కుండవను అర్థము రెండవ శ్లోకమునకుఁ జెప్పఁబడినది. ఈ శ్లోకమున 'పదే త్వర్వాచీనే' అనుచోట గ్రంథగ్రంథి కలదు అర్వాచీన పదమనగా కొత్తపదమని (పరిమితగుణ)సాకార మహిమయను నర్థము మధుసూదనసరస్వతి వ్యాఖ్యానము చూచిననే తెలిసి గ్రంథి వీడిపోవును. ఇట్లు భగవంతుని మహిమ స్తుతింపఁ దగినదని తెలినను ఈ స్తుతిచేత భగవంతుడు సంతోషించునా? సంతోషించనిచో స్తుతివ్యర్థముకాదా? అన్న ప్రశ్నల కీ క్రింది విధముగ మూడవ శ్లోకమున సమాధానము చెప్పఁబడినది. పురమథనా! పరబ్రహ్మమూర్తీ! మధువును చిల్కరించు వేదవాక్కులను అమృతము వంటి తదర్థమును వెల్లడించిన నీకు బ్రహ్మదేవుని వాక్కు గూడ వింత కాదు కాని నీ గుణముల గానము చేయుట వలన గలుగు పుణ్యము చేత నా వాక్కును పవిత్రము చేసికొనవలెనని నిన్ను స్తుతించగలిగినానే కాని నిన్ను మెప్పింపగలనను గర్వమున నేనీ స్తోత్రమును రచింపఁబూనలేదు. ఈ శ్లోకమున పురమథన శబ్దము త్రిపురముల సంహరించిన శివుని బోధించును. ఈ శబ్దమునకు విష్ణుపరముగా నర్థము చెప్పిన మధుసూదన సరస్వతి ప్రతిభ మిక్కిలి యాశ్చర్యమును కలిగించును. గోకులమందు పెరుగు మథింపఁబడినది పాలసముద్రము అమృతము కొఱకు మథింపఁబడినది కావున గోకులముగాని పాలసముద్రముగాని మథన మనఁ బడును. మథనము పురముగా కలవాడు అనగా వైకుంఠమో గోకులమో నివాసముగా కలవాడు పురమథనుఁడట! చతుర్ముఖ బ్రహ్మను బోధించు సురగురు పదమును భగవత్పరముగ చేసి మఱొక విధముగ తాత్పర్యము చెప్పబడినది. పురమథనా! పరబ్రహ్మమూర్తీ సమస్తవేదముయొక్క సారామృతము నంతనుఁ బూర్తిగా గ్రహించిన, హిరణ్యగర్భాదిసురలకు గురుఁడవైన నీకు కటుత్వమేమాత్రమును లేని మాధుర్య పూర్ణయైన వాగ్దేవికూడ నీకు తృప్తి కలిగింపఁజాలనపుడు నా అల్పమైన వాక్కును గూర్చి చెప్పనక్కఱయేలేదు అయినను 'నా గుణముల స్తుతించు పుణ్యముచేత నీ స్తోత్రకర్త యొక్క మమతాది దోషకలుషమైన వాక్కును నిష్కలుషముగఁజేయుదు' నను నీ బుద్ధి స్తోత్రము



చేయుటకు నన్నుఁబ్రేరేపించినది. కావున నేనెట్లు స్తుతించినను నీకు సంతోషమే కలుగును. ఇట్లీ మొదటిమూడు శ్లోకములలో స్తోత్రరచనా ప్రయత్నము సమర్థింపఁబడినది. వీనిని సంగ్రహించి పరమహంస బ్రహ్మానందస్వామి విష్ణు మహిమ్నఃస్తోత్ర ప్రథమశ్లోకమును రచించినాఁడు. వీని యర్థమే పరశంభు మహిమ్నఃస్తోత్రమందలి మొదటి రెండు శ్లోకములుఁజెప్పినవి. వివేకానందునకు ప్రియమైన శివమహిమ్నః స్తోత్రములోని యేడవ శ్లోకమున బహు మార్గగాముల గమ్యైక్యము ప్రతిపాదింపఁబడగా విష్ణుమహిమ్నః స్తోత్రమందలి రెండవ శ్లోకము మతిభేదపురస్కృత నామభేదమే కాని తత్త్వభేదము లేదని ప్రతిపాదించినది. పై శ్లోకార్థమునే గణేశమహిమ్నః స్తోత్రములోని ద్వితీయ తృతీయ చతుర్థ శ్లోకములు వివరించినవి.

పుష్పదంతుఁడు సర్వతంత్ర స్వతంత్రుడు. వివిధశాస్త్ర సంప్రదాయముల నెఱుగ కుండినచో శివమహిమ్నఃస్తోత్ర మర్థముకాదు. ఆయా శాస్త్రవిషయము లను గంభీరమైన ప్రౌఢమైన ధారావాహకమైన శైలిలో పుష్పదంతుడు గ్రుమ్మరించెను. శివమహిమ్నఃస్తోత్రమందలి 9వ శ్లోకమున కార్యకారణాత్మక మయిన యీ సర్వజగత్తు నిత్యమని అనిత్యమని నిత్యానిత్యమని నిత్యానిత్యతలు వ్యస్తవిషయములనియు వివిధశాస్త్ర వాదములు పేర్కొనబఁడినవి. ఇరువదవ శ్లోకమున జడమైన కర్మ ఫలమీయఁజాలదని ఈశ్వరార్చన లేనికర్మ ఫలించనే ఫలించదని కర్మఫలదాత ఈశ్వరుడే యనియు కర్మఫలమీమాంస చేయఁబడినది. ఇరువది యొకటవ శ్లోకమున శ్రద్ధలేమి దక్షుఁడొనరించిన యజ్ఞమభిచారమై యజమాన వినాశమయ్యెనని అందు శివుఁడు నిమిత్తమాత్రుఁడే యనియు ప్రతిపాదింపబడినది. దక్షయజ్ఞ ధ్వంసకుఁడగుచటే శివుని పారమ్యమును వేద మంగీకరించ జాలదను వీర వైష్ణవవాదము నిరాకరణీయమని వ్యంజింపఁ బడినది. పదవ శ్లోకమున జ్యోతిర్లింగము యొక్క ఆద్యంతములను బ్రహ్మ విష్ణువు లెఱుగ లేకపోవుట వారు భక్తితో శివుని స్తుతించుటయు ప్రతిపాదింపఁ బడినవి. ఈ శ్లోకమున 'శక్తులు కాలేదు' అను నర్థమున అనలమ్ అని ప్రయోగించుట 'తాభ్యాంతస్థే' అని భావ ప్రయోగము చేయుటయు శబ్దశాస్త్రజ్ఞ హృదయంగమములై యున్నవి. పంద్రెండవ పద్యమున శివుని నివాసమైన కైలాసమునే పెకలింపఁబూని రావణుడు పరాభూతుఁడగుట వర్ణింపఁబడినది.

శివునిదివ్యలీలలలో త్రిపురసంహార మొకటి. అది మిక్కిలి యాశ్చర్యకరము. శివునకు రథము లేదు, భూమి రథమయ్యెను. దానికి చక్రములు లేవు,

సూర్యచంద్రులు చక్రములైరి. సారథి లేదు, బ్రహ్మ సారథియయ్యెను. బాణమే లేదు, విష్ణువు బాణమయ్యెను. ధనుస్సు కలదా? అదియు లేదు, మేరువు ధనుస్సయ్యెను. ఇట్లు యుద్ధమునకు సిద్ధుఁడై జైత్రయాత్ర సాగించిన శివుడు త్రిపురాసురుల సమీపించి యుద్ధము చేసెనా? చేయలేదు. ఏమి చేసెను. మూడవ కన్ను దెఱచి దానిలోని అగ్నితో వారిని గాల్చివేసెను. మూడవ కంటితో త్రిపురదాహము చేయదలచినవాఁడు భూమ్యాదులను రథాదులనుగా నేల కూర్చు కొనెను? కూర్చుకొనినవాడు యుద్ధముచేసి వారినేల చంపలేదు? ఈ ప్రశ్నలకు సమాధానము పదునెనిమిదవ శ్లోకమున గలదు. 'శివునకును పారతంత్ర్యము తప్పలేదు మా సాయమునగదా శివుడు త్రిపురాసురుల సంహరింప నున్నాఁడను భూమ్యాదుల గర్వముతోఁబాటు త్రిపురాసురుల గాల్చెను. ఇది కేవలము త్రిపురాసుర సంహారలీల మాత్రమే కాదు. స్వభక్త గర్వ భంగలీల కూడ. తన భక్తులకు గర్వము కలిగించుటయేల? దానిని భంగము చేయుటయేల? ఇది ప్రభువు యొక్క లీల. శంభుని యీ యుద్ధసంసిద్ధతా చిత్రమును పరశంభు మహిమ్న స్తోత్రమందలి డెబ్బది మూడవ శ్లోకము కూడ ధ్యేయమొనర్చినది. అందు కమఠపతి రథకీల బంధముగా దిగ్గజములు స్తంభములుగా శేషుడు రజ్జువుగా రథమందలి పై భాగము పితృభూమిగా శివుడు రథిగా చెప్పఁబడుట ధ్యేయతను మఱింత విశదము చేయుచున్నది.

పదునేడవ శ్లోకమున మహిమోన్నతమైన గంగాధర రూపము పదునాఱవ శ్లోకమునందలి యద్భుతమైన శివతాండవమును పుష్పదంతుని భావనాబలమునకు నిదర్శనములుగా నిలచును. వాయువును బంధించి మనస్సును ఆత్మలో లీనమొనర్చి సమాధిలో నమృత హ్రదములో మునిగినట్లు యోగు లనుభవించెడి యానందరూపమైన శివ స్వరూపము ఇరువదియైదవ శ్లోకమున చిత్రింపఁబడినది. ఇట్టి యోగులను వారి యోగానుభవములను స్వానుభవబలమున బాగుగా నెఱిగినను విష్ణుమహిమ్న స్తోత్రకర్తయగు పరమ హంస బ్రహ్మానంద స్వామి తనకు మాత్రము శ్రీ సమాశ్లిష్టమైన స్వామిరూపమే నయనవిషయము గావలెనని కోరుచున్నాడు, ఇట్టి కోరిక కృష్ణకర్ణామృతములోని **'ఉపాసతా మాత్మవిదః పురాణాః పరం పుమాంసం నిహితం గుహాయాం। వయం యశోదా శిశు బాలలీలా కథా సుధాసింధుషు లోలయామః'** (2-55) అను లీలాశుకుని తౌల్యమును స్మరింపఁజేయుచున్నది. **'యతో వా ఇమాని భూతాని జాయంతే యేన జాతాని జీవంతి యత్ప్రయంత్యభిసంవిశంతి'** (తై.ఉ.3.1) అను నుపనిష



న్మంత్రార్థము భగవంతుని తటస్థలక్షణమును బోధించును. **'జన్మాద్యస్యయతః'** అను బ్రహ్మ సూత్రము కూడ యీ లక్షణమునే ప్రతిపాదించును. సృష్టిస్థితి లయము లెవ్వని వలన గలుగునో యాతడు భగవంతుడనుటయే యాలక్షణము. సృష్టించునపుడు బ్రహ్మయని పాలించునపుడు విష్ణువని సంహరించునపుడు రుద్రుడని భగవంతుని పేర్కొనుట పురాణముల పద్ధతి. వైష్ణవాగమములు బ్రహ్మ విష్ణురుద్రశబ్దములకు బదులుగ అనిరుద్ధ ప్రద్యుమ్న సంకర్షణ శబ్దముల నుపయోగింపగా శైవాగమములు భవమృడహర శబ్దముల నుపయోగించును. శివమహిమ్నః స్తోత్రమందలి ముప్పది రెండవ శ్లోకమున పై శబ్దములతోడనే భగవంతుడు పెక్కుమార్లు నమస్కరింపఁబడినాఁడు. 'సతాంవర్త్మ' అను శ్లోకమున అవైదిక చ్ఛాయ గనఁబడుటచేతను పెక్కు ప్రతులలో లేకుండుచేతను, 'వపుః ప్రాదుర్భావా' దను శ్లోకము కూడ పెక్కు ప్రతులలో లేకుండుట చేతను 'మహేశాన్నా పరోదేవో' అను శ్లోకము అఘోరవిద్యాగురు ప్రశంస యధికముగా గల పరశంభు మహిమ్న స్తోత్రమున గనఁబడుటచేతను ప్రక్షిప్తములనఁదగినవి. శివమహిమ్నః స్తోత్ర మందలి అపరాధక్షమాపణ పద్ధతి శివప్రీతికరముగ నున్నది.

> యత్కృత్యం తన్న కృతమ్! యదకృత్యం కృత్యవత్తదా చరితం।
> ఉభయోః ప్రాయశ్చిత్తం శివతవ నామాక్షర ద్వయోచ్చరితమ్॥

శివమహిమ్నఃస్తోత్ర వ్యాఖ్యానానికి శుద్ధమైన ప్రతిని సిద్ధము చేసిన చిరంజీవిని నా ఐదవ కోడలు శ్రీమతి **హిరణ్మయి** (హరిహరనాథ శర్మ) కు ఆశీస్సులు.

ఇట్లు
**దోర్బల విశ్వనాథశర్మ**

శ్రీః

పుష్పదన్తకృత

# శ్రీ శివ మహిమ్నస్తోత్రమ్

విభూతీవ్యాఖ్య

**(ప్రతిపదార్థ-తాత్పర్య-అనువాదపద్య-వివరణములు)**

**దోర్బల విశ్వనాథశర్మ**

**అవతారిక:–** పుష్పదంతుడను గంధర్వరాజు శివభక్తుడైన యొక రాజు యొక్క ఉద్యానమునుండి పుష్పములను తిరస్కరిణీ విద్యా ప్రభావమున కావలివారలకు కనబడకుండి అపహరించుచుండెను. ప్రతిదినము శివపూజకు పుష్పములు లభింపక రాజు పుష్పాపహర్తను పట్టుకొనుటకు పుష్పవృక్షముల క్రింద శివనిర్మాల్యమును చల్లించెను. అది తెలియని పుష్పదంతుడు పుష్పముల నపహరించునప్పుడు శివనిర్మాల్యమును త్రొక్కుటచే ఆకాశగమనశక్తిని తిరస్కరిణీ విద్యా ప్రభావమును కోల్పోయెను. రాజ భటులకు చిక్కకుండుటకై వానిని తిరిగి సంపాదింపగోరి పుష్పదన్తుడు శివుని మహిమను స్తుతించుట కారంభించుచున్నాడు.

శ్లో॥ *మహిమ్నః పారం తే పరమవిదుషో యద్యసదృశీ*
*స్తుతిర్బ్రహ్మాదీనామపి తదవసన్నాస్త్వయి గిరః।*
*అథావాచ్యః సర్వస్స్వమతిపరిణామావధి గృణన్*
*మమాప్యేష స్తోత్రే హర! నిరపవాదః పరికరః॥* **1**

మహిమ్నః–పారం–తే–పరం–అవిదుషః–యది–అసదృశీ–స్తుతిః–బ్రహ్మ–ఆదీనాం–అపి–తదవసన్నాః–త్వయి–గిరః–అథ–అవాచ్యః–సర్వః–స్వమతి పరిణామావధి– గృణన్–మమ–అపి–ఏషః–స్తోత్రే–హర–నిరపవాదః–పరికరః

**ప్రతిపదార్థము:–** హర=ఓ హరుడా!, తే=నీ యొక్క, మహిమ్నః=మహిమ యొక్క, పరమ్=అవతలి, పారమ్=ఒడ్డును, అవిదుషః=ఎఱుగని, మమ=



నాయొక్క, స్తుతి= స్తోత్రము, అసదృశీ యది తత్=తగినదికానిచో, త్వయి= నీయందు, బ్రహ్మాదీనామ్=బ్రహ్మాదుల యొక్క, గిరః అపి=వాక్కులు కూడ, అవసన్నాః=అల్పములు (భవంతి=అగుచున్నవి), అథ=ఒకవేళ, స్వమతి పరిణామావధి=తన బుద్ధికి అందినంత వఱకు, గృణన్=స్తుతించుచు, సర్వః =ప్రతివాడును, అవాచ్యః=నిందింపదగినవాడు కానిచో, మమ అపి=నా యొక్కయు, స్తోత్రే=స్తోత్రమునందలి, ఏషః=ఈ, పరికరః=యత్నము(ఆరంభము), నిరపవాదః=దోషరహితము.

**తాత్పర్యము:–** ఓ హరా!, నీ మహిమ యొక్క అవతలి ఒడ్డు ఎఱుగని నేనొనరించు స్తుతి తగినది కాదేని బ్రహ్మాదులును నీ మహిమ యొక్క అవతలి ఒడ్డు నెఱుగనివారే కావున వారు చేసిన స్తోత్రములును తగినవి కావనే చెప్పవలెను. ఒకవేళ తన బుద్ధి కొలది స్తోత్రము చేసినవాడు నింద్యుడు కాడేని నా బుద్ధికొలది స్తుతించు నా యీ ఆరమ్భమును దోషము కాదు.

**అనువాదము:–**

పరతరమైన నీ మహిమ పారమెఱుంగని యట్టి నా స్తవ
మ్మరుచిరమే నజాది నుతి యట్టి దవాక్కులు స్రుక్కె నీయెడన్
స్వరుచి యథామతిన్ బొగడువాడెవడైన ననింద్యుడేని యో
హర నిను గూర్చి యీ వినుతి యత్నము గూడ ననింద్యమే యగున్.

**వివరణము:–** (1) తమకు శివుని మహిమ పూర్తిగా తెలియదని యెఱిగిన బ్రహ్మాదులు శివుని స్తుతించుట మానలేదు. వారి బుద్ధి గొప్పది కావున దానికి తగినట్లు వారు స్తుతించిరి. వారి అడుగుజాడలలో స్తుతించుట దోషము కాదని నేనీ శివస్తుతికి పూనుకున్నాను. శివుని మహిమ పూర్తిగా తెలియనిదే తత్స్తుతి చేయుట తప్పుగదా! అని ఎవరైన అన్నచో బ్రహ్మాదులు నా వలెనే శివమహిమను పూర్తిగా ఎఱుగనివారే అయినను వారు తత్ స్తోత్రము చేసిరి. దానినెవరును తప్పు పట్టలేదు. ఆ ధైర్యముతో వారి అడుగుజాడలలో నేనును స్తుతించబూను కున్నానే కాని వారి వంటి సమర్థుడనని పూనుకొనలేదు. కావున నాది తప్పు కాదేమో అని కూడా సమాధానము చెప్పు అవకాశమున్నది. ప్రథమార్థము స్తుతి సాధ్యము కానంత గొప్పవాడను శివుని స్తుతి చెప్పబడినది. ఉత్తరార్థమున స్తుతిని

సమర్థించుట ద్వారా శివుని స్తుత్యత చెప్పబడినది. ఈ శ్లోకమున పుష్పదంతుడు గడుసుగా తన స్తుతిని సమర్థించుచు ఎవరైన తప్పుపట్ట యత్నించినచో తప్పుపట్టుట నాయ్యము కాదు, నాది దోషము కాదు అని బదులు పల్కెదను అని చెప్పుచున్నాడు. స్తోత్రే అహర అని విభజించి ఓ విష్ణూ! అని సంబోధించి ఈ శ్లోకము విష్ణుపరముగా సమన్వయింప వచ్చును.

(2) అయి!=ఓయి!, పరమ =శ్రేష్ఠుడా, బ్రహ్మాదీనామ్=బ్రహ్మాదులయొక్క, గిరః=వాక్కు యొక్క, పారమ్= (అవతలి) ఒడ్డును, విదుషః=ఎఱిగిన, తే= నీయొక్క, మహిమ్నః=మహిమయొక్క, స్తుతిః=స్తోత్రము, యది తత్=అనునది, అవసన్నా=అల్పము, అసదృశీ= అయోగ్యమును, అస్తు=అగుగాక! అథ= అయినను, స్వమ్=తనను (నా ఆత్మవైన నిన్ను), అతిపరిణామావధి=(బుద్ధి యొక్క) పరిణామసీమనతిక్రమించియు, గృణన్=స్తుతించుచు (నున్నవాడు), సర్వః=ప్రతియొక్కడు, ఆవాచ్యః=ఆదరమున పలుకరింపదగిన వాడగును, తత్=అందువలన, స్తోత్రే=(అట్టి) స్తోత్రము చేయువాని కొఱకు, మమ అపి= నాయొక్కయు, ఏషః=ఈ, పరికరః=నమస్కారాదికము, అహ(రహ)ః=మాటి మాటికి, అనిరపవాదః=ఎక్కువదోషము అని చెప్పరానిది. "స్తోత్రేహర నిరపవాదః అనుచోట స్తోత్రే అహః అనిరపవాదః అను పదవిభాగము చేయబడినది. ఈ అన్వయమందును పరమ అను పదమును పరామా (ఉత్కృష్ట లక్ష్మి ఎవనిదో వాడు) అని అర్థము చెప్పి శ్లోకమును విష్ణుపరముగా వ్యాఖ్యానింపవచ్చును.

**తాత్పర్యము:–** బ్రహ్మాదులవాక్కు యొక్క పారము అనగా చివరి హద్దు నీవెరిగిన వాడవు. అట్టి నీ మహిమను వారు స్తుతించుట అల్పము అయోగ్యము అనియే చెప్పవలెను. అట్లు స్తుతించు (బ్రహ్మాదులలోని) వానికెవనికైనను నావంటివారు వారికి నమస్కరించుటకు యత్నించవలసినదే. ఏలన అట్టివానితో నీవే మాట్లడి ఆదరించియుంటివి. నిన్ను స్తుతించువాడే అస్మదాదుల నమస్కారార్హుడగుచుండగా నిన్ను నేనే స్తుతించినయెడల తప్పెట్లగును. నిన్ను స్తుతించువాడు నమస్కార్యు డైనచో నీవు నమస్కార్యతరుడవగుదువు గదా!.

(3) మొదటి అన్వయమున బ్రహ్మాదులు శివమహిమ నెఱుగరనుట, రెండవ అన్వయమున బ్రహ్మాదుల వాక్కుల పస యెట్టిదో శివుడెరుగుననుట అను



అర్థవిశేషములు గమనింపదగినవి. మొదటి అన్వయమున అందఱు శివస్తుతి కర్హులే అనుట, రెండవ అన్వయమున శివుని స్తుతించిన వాడే నమస్కార్యు డగుటచే నేనును స్తుతించి నమస్కార్యతను పొందెదనను అర్థ విశేషములు గమనింపదగినవి. మొదటి అన్వయమున హర అను పదము శివుని లయ కృత్యమును బోధించును. రెండవ అన్వయమున అహర అను పదము లయించు వాడు కాదు అనగా పరిపాలించువాడు విష్ణువు అను అర్థమును బోధించును. (4) పారమ్, అవిదుషః అను శబ్దములు భగవంతుని మహిమ సముద్రము వంటిది, సముద్రమునకే ఇవతల, అవతల ఒడ్డు ఉండును కాని ఇవతలి ఒడ్డుననున్నవాడు సముద్రములో దిగుటకు భయపడుచుండును. సాహసించి సముద్రమున దిగినను ఆవలిఒడ్డు చేరుట దుస్సాధ్యము అను అంశములను వ్యంజించును. మహిమ యొక్క ఈవలి ఒడ్డున నున్నవాడు అమ్మో! ఈ సముద్రము దుస్తరము అని భయపడి స్తుతించు యత్నమునే చేయడు. ఆవలి ఒడ్డు ఎంత దూరమో ఎఱుగకపోవుటచే కొంత స్తుతించి చతికిలపడి ఆ మహిమ సముద్రమున మునిగి ఆవలి ఒడ్డును చేరక ముందే తన జన్మమును చాలించువాడగును అని మహిమ స్తుతిలోని క్లేశమును వ్యంగ్యమగును. (5) "పరమ; విదుషః" అను విభాగమున భగవంతునకు మన యోగ్యత ఎంతయో ముందే తెలియును కావున స్తోత యొక్క స్తుతిని వినక పోవుటయో, ఒకవేళ విన్నను వాని స్తుతి శక్తత తనచేతనే ఈయబడినందున పెద్దగా హర్షించు నవకాశముండదు. (6) అస్తు+అయి అను విభాగమున అయము అనగా మంగళము కలవాడు అని అయి పదము బోధించును. దూరముననున్నాడను కొని ఓయి అని పిలువగా తన హృదయముననే అందఱకన్న మిక్కిలి దగ్గఱగా నుండుటచే అయి అని పిలిచిన చాలును. ఓయి అని పిలువనక్కరలేదోయి అని మిత్రుని వలె పలుకుచున్నట్లుండు అయిహర అనిగాని అయిఅహర అనిగాని శివునో విష్ణువునో మిత్రునివలె సంబోధించుటను తెలుపుటచే ఈ శ్లోకమున సఖ్యభక్తియు వ్యంగ్యమగును. (7) మొదటిపాదము లోని హల్లులును అచ్చులును 'ఓం నమః శివాయ' అను షడక్షర (పంచాక్షర) మహామంత్రమును, మిగిలిన పాదములలోని హల్లులును అచ్చులును "నమో నారాయణాయ" అను మంత్రము నుద్ధరించుకొనుటకు వీలు కలిగించునట్లున్నవి. "మహిమ్నః" అనుపదమున

ఆద్యంతాక్షరముల వ్యత్యస్తము చేసిన నమః అను పదమును, 'హి'లోని ఇమ్, విదు'షో' అనుదానిలోని 'వ్', ఓ, బ్రహ్మాదీనామ్, అవసన్నాతు అనుపదములలోని రెండు నకారములు, పరిణామావధిలోని 'ణా' కారము, వాచ్యః లోని 'వా' కారము, యద్యసదృశీ లోని రెండు 'య'కారములు, ఒక శకారములతో పై మంత్రములలోని అక్షరములను ఊహించుకొనుట ఏమంత కష్టము కాదని ఊహించెదను. (8) ఈ శ్లోకమున 'మపరదతవహస' అను వర్ణముల ఆవృత్తిచే వృత్త్యను ప్రాసాలంకారమేర్పడియున్నది. ప్రతిపాదమున 'యమనసభలగ' అను గణములుండుటచే నీ శ్లోకము శిఖరిణీ వృత్తనిబన్ధము. శిఖరివాసుడైన శివుని శిఖరిణీ వృత్తమున స్తుతించుట కవి యొక్క వృత్తౌచిత్య జ్ఞానమును సూచించును. (9) మొత్తము మీద ఈ శ్లోకము అయోగ్య స్తుతియే ఫలదాయకము కాగా యోగ్యస్తుతి ఫలదాయకమని వేఱుగా చెప్పనక్కరలేదని శివ (విష్ణు)స్తుతి సర్వదా ఫలదాయకమని వ్యంజించును.

**అవతారిక:–** పై శ్లోకమున భగవంతుని స్తుతించుటలో బ్రహ్మాదులకు, తనకును శివుని మహిమను పూర్తిగా తెలిసికొనలేకపోవుట అను సమానధర్మ హేతుకమైన సమానమైన అయోగ్యత చెప్పబడినది. ఈ శ్లోకమున అసలు శివుని మహిమలోని అస్తుత్యతయు స్తుత్యశక్తతకు కారణమని చెప్పుచు చివఱకవతారధారణముతో ఆతని యథాశక్తి స్తుత్యత చెప్పబడుచున్నది.

శ్లో॥ ***అతీతః పన్థానం తవ చ మహిమా వాఙ్మనసయో***
***రతద్వ్యావృత్త్యా యం చకితమభిదత్తే శ్రుతిరపి।***
***స కస్య స్తోతవ్యః కతివిధగుణః కస్య విషయః***
***పదే త్వర్వాచీనే పతతి న మనః కస్య న వచః॥*** **2**

అతీతః–పంథానం–తవ–చ–మహిమా–వాఙ్మనసయోః–అతద్వ్యావృత్త్యా–యం–చకితం–అభిధత్తే–శ్రుతిః–అపి–సః–కస్య–స్తోతవ్యః–కతివిధగుణః–కస్య–విషయః–పదే–తు–అర్వాచీనే–పతతి–న–మనః–కస్య–న–వచః.

**ప్రతిపదార్థము:–** తవ=నీ యొక్క, మహిమా చ=మహిమయు, వాఙ్మనసయోః =మనోవాక్కుల యొక్క, పన్థానమ్=మార్గమును, అతీతః=దాటినది, అతద్వ్యావృత్త్యా=తద్వ్యావృత్తిలేమిచే లేక అతత్తు యొక్క వ్యావృత్తిచే, చకితమ్=



సభయముగా, శ్రుతిః అపి=వేదము కూడ, అభిధత్తే=చెప్పుచున్నది, సః=అది (వాడు), కస్య=ఎవనికి, స్తోతవ్యః=స్తుతింపదగినవాడు, కతివిధగుణః=ఎన్ని విధములు గుణములు గలవాడు, కస్య=దేనికి, విషయః=గోచరుడు, అర్వాచీనే= నూతనమైన, పదే తు=పదమునందు మాత్రము, కస్య=ఎవనియొక్క, మనః= మనస్సు, వచః=వాక్కు, న పతతి=ప్రవేశించదు.

**తాత్పర్యము:–** నీ మహిమ వాక్కునకు, మనస్సునకు అందదు. వేదము కూడా అతద్వ్యావృత్తితో సభయముగనే నిన్ను గూర్చి చెప్పును. అట్టి నీ మహిమను స్తుతించువాడెవ్వడు? దాని గుణము లెన్నివిధములు? అవి ఎన్ని? అది ఏ సాధనమున తెలిసికొనదగును? నూతన పదమునందు మాత్రము అనగా నీవవతరించినప్పుడు మాత్రము ఏ స్తోతయైనను, ఏ సాధనమునైనను అనగా మనస్సుతో గాని వాక్కుతోగాని నీ మహిమను స్తుతించకుండ ఉండలేదు.

**అనువాదము:–**

నీ మహిమమ్ము వాక్కులకునేని మనమ్మునకేని యంద దా
ప్రామినుకున్ ద్వదన్య వినివారణ రూపమునన్ వచింపగా
నా మహిమమ్మునన్ గుణములన్నియు నెన్నగ నెన్నిరీతులో
నేమెయి నెవ్వడారసి నుతించెడు నాకృతి దాల్చకున్నచో.

**వివరణము:–** (1) వాక్కు (శబ్దము) జాతి గుణ క్రియా సంజ్ఞలలో నేదేని యొక ప్రవృత్తి నిమిత్తమునననుసరించి అవియున్న వస్తువు అనగా నేదో యొక ధర్మముగల వస్తువునే బోధించగలదు. అట్లు ప్రవృత్తి నిమిత్తమైన ఏ ధర్మములేని నిర్గుణ పరమేశ్వరుని బోధింపజాలదు. మనస్సును అట్టి పరమేశ్వరుని చింతింప జాలదు. కావున ఆ పరమేశ్వరుని స్వరూపము అనగా వాఙ్మనసులకందనట్టిదే యగును. ఒకవేళ పరమేశ్వరుడు సగుణుడని అంగీకరించినను ఆ గుణములు ఎన్ని? ఎన్ని విధములు? అను ప్రశ్నలకు ఆతని గుణములు అనంత విధము లనియే చెప్పవలెను. అనంతములైన గుణములు గల ఆతని సగుణ మహిమను వాక్కు ఎట్లు చెప్పగలదు? ఎంతకాలము చెప్పుటకు పట్టును? ఒక్కొక్క గుణమును చింతించుటకు మనస్సునకు ఎంతకాలము పట్టును? ఇవన్నియు సమాధనము లేని ప్రశ్నలు. కావున సగుణ మహిమను కూడా వాఙ్మనస్సులు చెప్పలేకపోవుటకు

గుణముల ఆనంత్యము హేతువని చెప్పుకొనవలెను. ఈ అర్థమంతయు ప్రథమ పాదములో అవధారణార్థక చకారము చేత వ్యంగ్య మగను. (2) సగుణపక్షమున తద్వ్యావృత్తి అనగా తద్భేదము అనగా పరమేశ్వర భేదము, అతద్వ్యావృత్తి అనగా పరమేశ్వరాభేదము. నిర్గుణపక్షమున ఇంద్రియ మాత్మ కాదు. మనస్సు ఆత్మ కాదు. బుద్ధి ఆత్మ కాదు. అహంకారము ఆత్మ కాదు. నిషేధముఖమున చెప్పవలసినదే. పరమేశ్వరుని మరొక విధముగా నిర్వచించుట ఎట్లు? ఒక వస్తువును పేర్కొనుట యనగా అది ఇతర వస్తు భిన్నమన్నట్లే చెప్పవలెను. లేనిచో చెప్పుటయే వ్యర్థము కదా. అట్లు పరమేశ్వరుని చెప్పుటకు వీలుకాదు. సగుణపక్షమున తద్వ్యావృత్తి లేకపోవుటయే చెప్పలేక పోవుటకు కారణము. నిర్గుణపక్షమున పరమేశ్వరుడననేమో చెప్పక ఏది పరమేశ్వరుని వలె సర్వభేదములేని మిథ్యా ప్రపంచములోని వస్తువో తద్వ్యా వృత్తిని మాత్రమే చేయుచు శ్రుతి పరమేశ్వరుని సభయముగా చెప్పినది. సగుణ పక్షమున సర్వం ఖల్విదమ్ బ్రహ్మ అని చెప్పుట అతద్వ్యావృత్తితో పరమేశ్వరుని చెప్పుటయే – ఇందులోని భయమేమనగా సత్యమని నిర్దేశింపబడినది మిథ్యా ప్రపంచము లోనిది కావున దానిని పరమేశ్వరుడని చెప్పుటలో ఆయనకు మిథ్యాత్వము కలుగునేమోయని భయము. మిథ్యావస్తువు సత్యవస్తువున కనన్యము అనగా భిన్నము కాదు కావున అట్లు చెప్పుట కూడ సమంజసమే యగునని తృప్తిపడుచు భయపడుచు శ్రుతి పరమేశ్వరుని చకితముగా చెప్పుచున్నది. ఇంద్రియాదుల నిర్గుణాత్మత్వనిషేధమునను దానికి సత్యత్వ ప్రసక్తి కలుగునేమోయని సభయము గానే అనగా చకితముగానే చెప్పుచున్నది.

నిర్గుణపక్షమున అతత్తు యొక్క వ్యావృత్తి అతద్వ్యావృత్తి అను విగ్రహము నాశ్రయింపవలెను. అతత్తనగా పరమేశ్వరుడు కానిది (మాయ లేక అవిద్య). అట్టిది లేదనుట అతద్వ్యావృత్తియగును. శ్రుతి యిట్లు అతద్వ్యావృత్తి ద్వారముననే పరమేశ్వరుని సభయముగా (చకితముగా) చెప్పును. నిర్గుణ పరమాత్మని ఎట్లు చకితముగా వేదము చెప్పును. ఇక సగుణ మహిమను చెప్పవలెనన్న దాని గుణముల వైవిధ్యము కాని సంఖ్య కాని అనంతము కావున అట్లు చెప్పుటకు కూడా అనంతకాలము పట్టునని వేఱుగా చెప్పనక్కఱ లేదు. అంతముగల వాఙ్మనస్సులు గుణానంత్యమును చెప్పలేకపోవుట కారణముగా



సగుణ మహిమ కూడా వాఙ్మనస్సులుకందనిదే యగుచున్నది. (3) పరమేశ్వరుడు గుణముల ఆనంత్యమును విడచి పరిమిత గుణాకారములను మన కొఱకై అర్వాచీన పదమును అనగా అవతారమును స్వీకరించగా శక్తికొలది భక్తుడైన ప్రతివ్యక్తి మనస్సును వాక్కుని వర్ణించుటకు లేక భావించుటకు చింతించుటకు ఉబలాటపడుచుండుట సంభవించినది. అట్టి అవకాశము భక్తులకు కలిగించుట ఆయన అనుగ్రహ (గుణ) మే అనక తప్పదు. (4) మరొక విధముగా చకిత శబ్దమును పరమేశ్వరునకు విశేషణముగా చేసి ఈ జీవుడు నా కార్యమైన ప్రపంచమును నాకు భిన్నమునుగా చూడకుండుగాక అని భయపడుచున్న పరమేశ్వరుని వేదము స్తుతించుచున్నది అని రెండవ పాదమున అన్వయభేదము ద్వారా చెప్పవచ్చును. (5) కస్య విషయః అను పదములు పరమాత్మ మహిమ ప్రమాణవేద్యము కాదని అద్వితీయ నిర్గుణమని చెప్పును. కతివిధ గుణః అనుపదము పరమేశ్వర గుణముల ఆనంత్యమును అనగా సగుణత్వమును చెప్పును. అర్వాచీనే పదే అను పదములు పరిమిత గుణ సాకార పరమాత్మ మహిమను చెప్పును. (6) ఈ రెండు విధములైన అన్వయములును హరిహర పక్షములు రెండింటికి సమానముగా కుదురును. అవతార స్వీకార పక్షమున శివునకు పార్వతీపతిత్వ వృషభవాహనత్వ త్రిశూలడమర్వాది ధారణాదులు విష్ణువునకు కమల కమ్బుకౌమోదకీ సుదర్శన ధారణ లక్ష్మీపతిత్వ గరుడవాహన త్వాదులు చెప్పవలెనని వేరుగా చెప్పనక్కఱలేదు. శివవిష్ణువులే యవతారముల ధరించినను భక్తుల మనస్సులు అన్యవిషయములనుండి సంకుచితములై తమ అభీష్టదేవతారూపగుణములందు ప్రవర్తించును. అర్వాచీనే పతతి అనుపదముల మధ్య అకారమును ప్రశ్లేషించినచో అపతతి అను పదమేర్పడి తతిని విడచినది అనగా సంకోచించినది అను అర్థమేర్పడును. అట్లు సంకోచించుటచేతనే శివ విష్ణు భక్తులన్యచింతన లేని ఏకాగ్రతతో తమ ఇష్టదేవతాగుణవర్తన చింతనము లతో వారి వాఙ్మనస్సులు నిమగ్నములగు అవకాశమేర్పడుటయే ఈ ప్రశ్లేషము ప్రయోజనము అని గ్రహింపవలసియున్నది.

పూర్వార్ధమున ప్రథమ ద్వితీయ పాదములలో దాక్షిణాత్యమైన ఆది (తకార) ప్రాసమున్నది. దానితో కలసి తకారావృత్తి కూడ ఈ శ్లోకమున వృత్త్యను ప్రాసశోభను కలిగించుచున్నది.

**అవ:-** పై శ్లోకమున పరమేశ్వరుని స్తుత్యత నిరూపింపబడినది. ఈ శ్లోకమున స్తుతి యొక్క సఫలత శంకింపబడి శంకానివారణము చేయబడుచున్నది.

**శ్లో॥** *మధుస్ఫీతా వాచః పరమమమృతం నిర్మితవత*
*స్తవ బ్రహ్మన్ కిం వాగపి సురగురోర్విస్మయపదమ్।*
*మమ త్వేతాం వాణీం గుణకథనపుణ్యేన భవతః*
*పునామీత్యర్థేఽస్మిన్ పురమథన! బుద్ధిర్వ్యవసితా॥* **3**

మధుస్ఫీతా-వాచః-పరమం-అమృతం-నిర్మితవతః-తవ-బ్రహ్మన్-కిం-వాక్-అపి-సురగురోః-విస్మయపదం-మమ-తు-ఏతాం-వాణీం-గుణకథన పుణ్యేన- భవతః-పునామి-ఇతి-అర్థే-అస్మిన్-పురమథన-బుద్ధిః-వ్యవసితా.

**ప్రతిపదార్థము:-** మధుస్ఫీతా=తేనె వలె చిక్కనైన, వాచః=వాక్కులను, పరమమ్=గొప్పదైన, అమృతమ్=అమృతమును, నిర్మితవతః=నిర్మించిన, తవ=నీకు, సురగురోః=బ్రహ్మయొక్క, వాక్ అపి=వాక్కులుకూడా, విస్మయపదమ్ న=ఆశ్చర్యావహము కాదు, పురమథన=పురములను (త్రిపురములను) మథించినవాడా శివా!, లేక పాల సముద్రమో గోకులమో పురముగా గలవాడా విష్ణూ!, ఏతామ్=ఈ, మమ=నా యొక్క, వాణీమ్=వాక్కును, భవతః=నీ యొక్క, గుణకథన పుణ్యేన=గుణములను చెప్పుట అను పుణ్యము చేత, పునామి ఇతి=పవిత్రముగా చేయుదును అని, అస్మిన్=ఈ, అర్థే=అర్థమునందు, బుద్ధిః=బుద్ధి, వ్యవసితా=పూనుకొన్నది.

**తాత్పర్యము:-** తేనెవంటి వాక్కులను గొప్ప అమృతమును నిర్మించిన నీకు బ్రహ్మ యొక్క వాక్కే ఆశ్యర్యమును కలిగించదు. నా బుద్ధి మాత్రము నీ గుణముల చెప్పు పుణ్యమున వాక్కును పవిత్రీకరించుకొనవలెననియే నిన్ను స్తుతించుట అను అర్థమున అనగా కర్మయందు పూనుకొన్నది.

**అనువాదము:-**

మధుమయ వాక్కులన్ బరమమంజులమౌ నమృతమ్ము జిమ్ము నీ
కధికము వింత గొల్పునె యజాస్య వినిర్గత వాణియేని నీ
యధిక గుణ ప్రకాశన మహా సుకృతమ్మున నాదు వాణి న
త్యధిక పునీతగా వినుతి నాదృతి గూర్పగ నెంచితిన్ బ్రభూ!



**వివరణము:-** (1) వినుటకింపుగానున్న మాటలు మధురములని వ్యవహరింపబడును. మాధుర్యము జిహ్వాగ్రాహ్యములైన రుచులలోనొకటి. చెవి మాధుర్యమును గ్రహింపలేదు. కాని ఈ వాక్కు మధురముగా నున్నది. ఈ వాక్కు కటువుగా ఉన్నది అను వ్యవహారములు జిహ్వాగ్రాహ్యములైన మాధుర్యకటుత్వాదాలను వాగ్గతములుగా వ్యవహరించుట లోకమున ప్రసిద్ధముగానుండటచే మధుస్ఫీతా వాచః అని వాక్కులలో తేనెకున్న మాధుర్యము వంటి మాధుర్యమును వ్యంజింప చేయు ప్రయోగమీ శ్లోకము యొక్క ఆరంభమున చేయబడినది. అట్లే శ్రవణమున తెలియబడు అర్థములైన వాచ్య లక్ష్య వ్యంగ్యములలోను మాధుర్యమున్నట్లు వ్యవహరించుట లోక ప్రసిద్ధము. పరమమమృతమ్ అను శబ్దములిట అట్టి అర్థగత మాధుర్యమును తెలుపుటకును ప్రయోగింపబడినవి. ద్రాక్షా శబ్దము రూక్షముగా శ్రవణములకు వినబడినను ద్రాక్షాఫలముల రుచి జ్ఞప్తికి వచ్చి శబ్దగత రూక్షత చెవికి కఠోరముగా నుండకపోవుట సంభవించును. గుడ్లెఱ్ఱచేసి తండ్రి కూతురితో ఆ వెంకటేశం గాడితోనే పెండ్లి చేస్తానే అని పెద్ద గొంతుతో చెప్పినను ఆ వెంకటేశంను ప్రేమించిన ఆ కూతురు చెవిలో మాధుర్యమునే నింపును గదా! కొన్ని శబ్దములట్లు అర్థపర్యాలోచన చేయుటకు ముందే మధురముగా వినబడును. ముఖ్యముగా పిల్లల వాక్కులు, పురుషులకు స్త్రీల వాక్కులు అట్లు మధురముగా వినబడును. అర్థపర్యాలోచన చేసిన పిమ్మట ఆ మాటలు కఠోరములుగా మారుట సంభవించును. బాగుగా విచారించగా శబ్దగత మాధుర్యమునకన్న అర్థగత మాధుర్యమేమిన్న అని చెప్పక తప్పదు. శబ్దములు చెవులలో సంగీతమువలె ఆపాత మధురములుగా వినబడిన వినబడుగాక! అర్థ పర్యాలోచనానంతరము ఆ అర్థము సత్య హితత్వములను బట్టి ఆ వాక్కుల విలువయు నిశ్చయింపబడుటయు లోక సాధారణమే. ప్రాచీన అలంకార శాస్త్రవేత్తలు శ్లేషాదిగుణములను శబ్దగుణములను అర్థగుణములను వేఱు వేఱుగా లక్షణోదాహరణములతో వివరించియున్నారు. నవీనాలంకారశాస్త్రవేత్తలు మాధుర్యౌజః ప్రసాదములను మూడుఅర్థగుణములకు ప్రాధాన్యము నొసగినారు. ఇవి తాత్పర్యార్థమైన ప్రధానమైన కావ్యాత్మకు అంతరంగములై కావ్యసామగ్రిలో అత్యావశ్యకములుగా నిర్ణయించినారు. అప్రస్తుత ప్రసంగమునాపి ప్రకృతమును విచారింతుము. ప్రకృతమున వాచః అను పదము వేదవాక్కులను బోధించుటకు

ద్దిష్టము. వేదవాక్కులలోను కావ్యవాక్కులలోవలె అక్కడక్కడ శబ్దగుణములున్నవి. కావున ఆ వాక్కులు మధుస్ఫీతములు అని చెప్పబడినవి. మాధుర్యవాచియైన మధు శబ్దమిచట ఆవశ్యకతననుసరించి ఓజః ప్రసాదగుణములును వేదమున కున్నవనియే లక్షించును. మధు శబ్దము మాధుర్యవాచి. ఓజః ప్రసాదములకు పలక్షకమని పై వివరణము యొక్క ఫలితము. ఇట్టి శబ్దగత మాధుర్యమునకన్న వేదము యొక్క తాత్పర్యార్థములైన కర్మ బ్రహ్మలు తాత్కాలిక శబ్ద శ్రవణా నందమునకన్న ఎన్నోరెట్లు గొప్పవైన స్వర్గాపవర్గానందములను కలిగించున వగుటచే ఆ వేదార్థము పరమామృతమని పరమమ్ అమృతమ్ అను శబ్దములు తెలుపును. (2) పరమేశ్వరుడు వేదనిర్మాతయని నైయాయిక వైశేషికాది దార్శనికు లంగీకరించెదరు. పూర్వకల్పీయ వేదార్థమును స్మరించి తదర్థక వాఙ్నిర్మాణము ప్రస్తుత కల్పమున భగవానునిచే చేయబడుట ఒక పక్షము కాగా పూర్వకల్పీయ వేద శబ్దార్థముల స్మరించి వాని పునః ప్రకటనము ఆ భగవానుడాచరించుట మరొక పక్షము. పూర్వకల్పమును సంపూర్ణ సాంగవేదాధ్యయనమాచరించి పౌండరీకాంత యజ్ఞములనొనర్చిన జీవుడే ప్రస్తుత కల్పమున బ్రహ్మత్వమును పొందియుండుటచే పుణ్యవిశేషమున తనచే పూర్వకల్పీయజన్మమున గురు ముఖముగా అధీతములైన  వేదములను ఆనుపూర్వీయుతముగా ఋషులకు బోధింపగా పరంపరగా ఈనాటి వరకు వేదము ఉత్సన్నము కాకుండా కాపాడ బడినదనుట పూర్వ మీమాంసకులలో పెక్కురంగీకరించిన పక్షము. ఈ రెండు పక్షములలో(వేద)నిర్మాణము స్మరణ రూపము మాత్రమే. నిర్మితవతః అనుటలో యస్య నిశ్వసితం వేదాః అనుసూక్తిననుసరించి ఊపిరివిడచునంత అనాయాసము గానే భగవానుడు వేదములను నిర్మించినాడని చెప్పికొన్నచో భగవానుని అనితర సాధారణ సామర్థ్యము వ్యంగ్యమగును. ఇంత అనాయాసముగా శబ్దార్థముల మహా మాధుర్యవ్రద్రచనము భగవానునిదనుట పుష్పదంతుని ఉద్దిష్టార్థమని నా అభిప్రాయము. (3) చతుర్ముఖ వాక్కు కూడా ఇంత సామర్థ్యముగల భగవాను నకాశ్చర్యము కలిగించలేనపుడు నేనెట్లు నిన్ను అల్పార్థ వాక్కులతో సంతసింప చేయగలను? చేయలేనని నాకు తెలిసినను నా జిహ్వను పునీతమును చేయుట కొఱకే ఈ స్తుతి రచనకుపక్రమించినానే కానీ నిన్ను మెప్పించగలమని ఉప క్రమించుట లేదు. (4) దేవతలందరుకలసి క్షీరసముద్రమును నీ సాయమున మథించి అమరత్వమునందిరి. కాని ఆ అమృతత్వము కల్పాంతస్థాయియే కాని నిత్యము కాదు. నీ వొక్కడవే పరమామృత స్థానమును వేదక్షీర సముద్రమునే నిర్మించుటచే భగవానుని సామర్థ్యము ఇతర దేవతాసాధారణము కాదని స్పష్టమగును. పాలెంత తీయనివైనను మధువున కున్నంత మాధుర్యము వానికిలేదు. కాని భగవానుడు నిర్మించిన క్షీరోద వేదములలో వేద (క్షీరోద) మే అధిక మాధుర్యము కలదియని మధు శబ్దము వ్యంజించును. ఇక దేవతలు సాధించిన అమృతము పరమామృతము కాదు. వేదక్షీరోదము నుండి నీవు నిర్మించి లోకమున కొసగినది పరమామృతము స్వర్గానందమును మించిన ఆనందము ననుభవింపజేయునట్టిది అని పరమ శబ్దము వ్యంజింపజేయును. శబ్దార్థముల నిత్య భేదములను పురస్కరించుకొని మధుస్ఫీతవాక్కులే పరమామృతము అని వ్యస్తరూపకము అను అర్థాలంకారము చెప్పుటకిట అవకాశమున్నది. ప్రథమ పాదమున చకారము లేకపోవుట ఈ అవకాశమును కల్పించును. అప్పుడు వేదవాక్కే అమృతము అను అర్థము వచ్చును. మధు శబ్దమును సమాసాంతర్భాగముగా గాక వ్యస్తముగా గ్రహించిన వాక్కులు మధువో లేక అమృతమో అన్నంత మాధుర్యమును కలిగియున్నవను అర్థము వ్యంగ్యమగును. ఇంతేగాక ఆ మధువు కూడ పరమమే ఆ అమృతము కూడ పరమమే అను అర్థము కూడ లభించును. ఈ పక్షమున స్ఫీతత్వము వాగ్గుణము అగును. పరమ మధ్వమృతములతో అభేదాధ్యవసాయము అర్థాభిన్నవాక్కునకు లభించును. లోకమున అర్థమును మొదట ఆలోచించుకొని తదనుగుణ శబ్ద ప్రయోగము జరుగును. అనాయాసముగా నిశ్వాసము వలె భగవానుదేక కాలముననే వేద శబ్దార్థ మధ్వమృతముల నిర్మించినాడను విశేషముస్ఫురించును. **'ఋషీణాం పునరాద్యానాం వాచమర్థోనుధావతి'** అను భవభూతి సూక్తి ఆద్యర్షియైన భగవానుని వాక్కునకు ప్రథమ స్థానము అని చెప్పనవలెను. వేదము శబ్ద ప్రధానము గదా! పైగా అర్థమున నైమత్యము ఆచార్యులలో కాననగును. ఆ భిన్నార్థములలో ఏదో ఒకటి పరమామృతము కావచ్చును కాని తదితరము కాజాలదు. అమృత శబ్దమును మధువునకు విశేషముగా చేసి వాఙ్మధువుల అభేదాధ్యవసాయము గ్రహింపవచ్చును. లౌకిక మధువు అమృతము కాదు పరమమును కాదు. కాని వేద వాక్కు (అర్థ భేదము కలిగి) పరమము

అమృతము. కాన బ్రహ్మ మధువునకు వాచకము కాకపోయినను లక్షకమగును. మథింపబడునది మథనము. గోకులమో క్షీరోదమో మథనమున బడును. అచట మథించుట జరిగినది కదా! అట్టి మథనము పురముగా (నివాసముగా) గలవాడు పురమథనుడు. ఇట్లు పురమథన అను సంబోధనము ఈశ్లోకార్థము నంతయు విష్ణుపరముగా అన్వయించుటకు వీలు నొసగును. (6) బ్రహ్మన్=ఓ బ్రహ్మ!, పురమథన=పురమథనా! వాచః=వాక్కునకు (అంతటికి), పరమమ్=గొప్పవైన, అమృతమ్=గొప్పసారమును నిర్మితవతః=నిశ్చయముగాఅనుభవించిన, సురగురోః=దేవతలకందఱకు (హిరణ్యగర్భాది దేవతలకందఱకు) గురుడవైన, తవ=నీకు మధుస్ఫీతా=మాధుర్యముతో నిండిన (కొంచెము గూడ కటుత్వము లేని), వాక్ అపి=సరస్వతి (దేవి) కూడ, విస్మయపదమ్ కిమ్= ఆశ్చర్యస్థానమా?, భవతః=నీ యొక్క, గుణకథన పుణ్యేన=గుణ కథన పుణ్యము చేత, మమత్వే=మమకారమునందు, తామ్=ఆ, వాణీమ్=వాణిని, పునామి ఇతి=పవిత్రీకరించెద నని, అస్మిన్ అర్థే=అర్థమందు, పురమథన=ఓ పురమథనా!, భవతః=నీ యొక్క బుద్ధిః=బుద్ధి, వ్యవసితా=నిశ్చయించినది. పైన అన్వయము ననుసరించి సురగురుడు శివుడే లేక విష్ణువే, చతుర్ముఖ (బ్రహ్మ) వాక్కునకంతటికి గొప్ప సారము ఆత్మానందమే. దానిని నిశ్చయముగా అనుభవించిన వాడతడే. జీవుల ఆత్మానుభవానందమున సందేహముండవచ్చునేమోకాని భగవానుని ఆత్మానుభవా నందమున సందేహము ఆస్తికులెవఱకును ఉండదు. సంసిద్ధాత్మానందుడు జీవుడే యగును. దేవతలలో హిరణ్యగర్భుడు (చతుర్ముఖబ్రహ్మ) మొదటివాడు. బ్రహ్మదేవతలకందఱకును గురుడు. సరస్వతి వీణాధ్వనియే మధురము. ఆమె వాక్కు మధురాతి మధురము. కటుత్వ మేమాత్రము లేని వాక్కు సరస్వతిదే. అదియే భగవానునికి విస్మయావహము కాదు. ఇక మిగిలిన వారి వాక్కులు ఆభగవానునికి విస్మయావహములు కావని వేఱుగా చెప్పనక్కఱలేదు. అట్టి భగవానుని గుణకథనముచేత పూర్వము మమత్వ యుక్తమైన సంసార విషయములతో కలుషితమైన నా వాణిని పునీతమొనరించు టకే భగవానుని బుద్ధి నిశ్చయించుకున్నది అను తాత్పర్యము స్ఫురించును. దీనిననుసరించి భగవానుడే ఈ స్తుతిని నాతో చేయించినాడని, నేను చేయుటలేదు, చేయలేను కూడ, ఆయన చేయించదలచినప్పుడు కాదనుట నాకు సాధ్యము కానందుననే



ఈ స్తోత్రరచనము సంభవించినదని అహంకార నిరసనము ముఖ్యముగా వ్యంగ్యమగును. (7) వకారావృత్తిచే వృత్త్యనుప్రాసమేర్పడినది. నిర్మితవతస్తవ అనుచోట యమకమున్నది.

**అవతారిక:–** పూర్వ శ్లోకత్రయమున భగవానుని స్తుత్యత, స్తోత్రారమ్భమును సమర్థింపబడినవి. ఈ శ్లోకమున ఈశ్వరుడే లేడను వాదమును నిరాకరించుటతో పాటు ఆయన ఐశ్వర్యము స్తుతింపబడుచున్నది.

*శ్లో॥ తవైశ్వర్యం యత్తజ్జగదుదయరక్షా ప్రళయకృత్*
*త్రయీవస్తు వ్యస్తం తిసృషు గుణభిన్నాసు తనుషు।*
*అభవ్యానామస్మిన్ వరద! రమణీయామరమణీం*
*విహన్తుం వ్యాక్రోశీం విదధత ఇహైకే జడధియః॥* **4**

తవ–ఐశ్వర్యం–యత్–తత్–జగదుదయరక్షాప్రళయకృత్–త్రయీవస్తు –వ్యస్తం–తిసృషు–గుణభిన్నాసు–తనుషు–అభవ్యానాం–అస్మిన్–వరద–రమణీయాం –అరమణీం–విహంతుం–వి–ఆక్రోశీం–విదధతే–ఇహ–ఏకే– జడధియః.

**ప్రతిపదార్థము:–** వరద=ఓ వరములనొసగువాడా!, తవ=నీ యొక్క, ఐశ్వర్యమ్ యత్ తత్=ఐశ్వర్యమేదో అది (ఐశ్వర్యము అనునది), జగదుదయ రక్షాప్రళయ కృత్=జగత్తు యొక్క సృష్టి స్థితి నాశముల నొనర్చునది, త్రయీ వస్తు=మూడు వేదముల సమూహముచే ప్రతిపాదింపబడినది, గుణభిన్నాసు=గుణములచే వేఱు వేఱైన, తిసృషు=మూడు, తనుషు=శరీరములందు, వ్యస్తమ్=విభజింపబడి యున్నది, అస్మిన్=దీనియందు, అభవ్యానామ్=భవ్యులుకానివారికి, రమణీయామ్ =మనోహరమైన, అరమణీమ్=(వాస్తవమునకు)మనోహరముకానట్టి, వ్యాక్రోశీమ్ =నిందను, ఇహ=ఈ లోకమున, ఏకే=కొందఱు, జడధియః=మందబుద్ధులు, విదధతే=చేయుచున్నారు.

**తాత్పర్యము:–** ఓ వరదా! నీ యైశ్వర్యము జగత్సృష్టి స్థితి నాశముల నొనర్చు నట్టిది. మూడు వేదములందు ప్రతిపాదింపబడినది. గుణభిన్నములైన మూడు మూర్తులలో విభజింపబడినట్టిది. అట్టి నీ ఐశ్వర్యమును కొందఱు మందబుద్ధులు చెడ్డవారికి బాగనిపించు, మంచివారికి బాగనిపించని నిందను చేయుదురు.

**అనువాదము:-**

జగదుదయ స్థితి ప్రళయ సత్కృతి దక్షగుణ త్రిధాకృతి
ప్రగణితమున్ ద్రయీ ప్రథిత వస్తువు నీదగు వైభవమ్మునే
తెగడుచునుందు రల్ప జడ ధీయుతులౌ నొక కొందఱాత్మహుల్
జగతినభవ్య రమ్యమగు శస్తము గానటువంటి పద్ధతిన్.

**వివరణము:-** మనకు జగము కొంత కనబడుచున్నది. కనపడని భాగమెంతో యున్నది. ఎవరైన మనకు తెలియని జగద్భాగమును గూర్చి చెప్పినచో సాధారణముగా నిరాకరింపము. ఆతడసత్యమునెందుకు అనవసరముగా చెప్పును? దానివలన ఆతనికి ప్రయోజనము లేదు అని భావించి మనము నమ్ముదుము కూడ. అట్లే నేనున్నానా లేదా అని ఎవడును సందేహింపడు. ఉన్నాననియే నిశ్చయించుకొనియుండును. తనవలె తనకు కనపడక దూరదేశము లందును ఉన్న జీవులను గురించి విన్నప్పుడును నమ్మును. తాను పుట్టక ముందును ఈ జగమున్నదని అందనేక జీవులున్నారనియు నమ్మును. తాను చనిపోయిన పిదప తన పుత్రాదులు, ఇల్లు మొదలగునవి కొంతకాలముండు ననుటలోనను సందేహింపక నమ్మును. తాను సంపూర్ణ స్వతంత్రుడను కాననియు తన శక్తులకు పరిమితులున్నవనియు అట్లే ఇతరులకు కొన్ని శక్తులున్న వనియు వారును తనవలె పరిమితశక్తులుగలవారనియు సందేహింపక నమ్మును. ఈ జగమున ప్రాణులు అప్రాణులు పుట్టినవనియు (ఏర్పడినవనియు) కొంతకాల ముండిన పిదప నశించుననియు నమ్మును. కాని పుట్టించి కొంత కాలము రక్షించి నశింపజేయువాడొకడున్నాడని భవ్యులు మాత్రమే నమ్మెదరు, అభవ్యులు నమ్మరు. నమ్మినవారికి భవ్యము అనగా భద్రము కలుగును. నమ్మనివారికదిలేదు కావున వారభవ్యులు. ఈ అభవ్యులు తమవలె కాక జగత్తు యొక్క సృష్టిస్థితి లయముల నొనర్చు నీశ్వరుని నమ్మువారి నవహేళనము చేయుదురు. ఇది ఒకరిని చూచి మరొకరు వారిని చూచి మరొకరు చేయుదురు. నమ్మిన వారి నజ్ఞులని నిందించెదరు. అట్టి వారు జడబుద్ధులే. కంటికి కనబడు వస్తువు ఉనికిని అంగీకరించకపోవుట జడబుద్ధికి నిదర్శనము. అట్లు కంటికి కనబడు దాని నాధారముగా చేసికొని దానితో నిత్యసంబంధము (అవినాభావము) లేక వ్యాప్తి గల వస్తువు లేదనుట కూడ జడబుద్ధికి నిదర్శనమే. అట్లే ఆప్తులు చెప్పినదానిని



అంగీకరింపకపోవుట కూడ జడబుద్ధికి నిదర్శనమే. కనబడు జగమును కాదనుట మాత్రమే జడబుద్ధి కాదు. కనబడు జగమును చూసిన తరువాత కూడ తత్కర్త లేడనుటయు జడ బుద్ధియే. దేవుడున్నాడని చెప్పు వేదవాక్కును నమ్మకపోవుట కూడా జడబుద్ధియే. (2)దేవుడు కనబడుచున్నాడు తన త్రిగుణరూపములు ఆయన రూపములే జగమంతయు దేవుని రూపమే. పురాణములలోని శూలపాణిత్వ చక్రపాణిత్వ రూపములు లోకమున కనపడక పోయినను ఆకాశాది భూమ్యంత పంచ భూతములు నిండిన జగము అందులో వానితో నిండియున్న ప్రాణులు అందఱు దేవుని రూపములే. కావున దేవుడు ప్రత్యక్ష ప్రమాణ వేద్యుడే. కుండ కనబడు చున్నప్పుడు దానికి ఉపాదానకారణ మైన మట్టి కూడ కనబడుచునే యుండును. అట్లే జగమును చూచుచున్నామనగా తదుపాదాన కారణమైన దేవుని చూచుచున్నామనుటయే. కార్యరూపమున చూచుచున్నాముగాని కారణరూపమున చూచుట లేదు గదా అన్నచో కుండను చూచి దానికి కర్తయైన కుమ్మరిని చూడకున్నను అంగీకరించుచున్నాముగదా!. అట్లే జగమును చూచి జగత్కర్తయైన ఈశ్వరుని అంగీకరింపవలెను. పొగను నిప్పును అంగీకరించినట్లే పుట్టిన కుండకు కర్త (కుమ్మరి) ఉన్నట్లు పుట్టిన జగమునకు కర్త (ఈశ్వరుడు) ఉన్నాడని అంగీకరింపవలసినదే కదా! ఇట్లు కార్యమును చూచి కారణము నంగీకరించుట అనుమాన ప్రమాణము అనబడును. దీనికి వ్యాప్తి ముఖ్యము. అది వంట యిల్లు మొదలగు చోట్ల చూచిన పొగకు అగ్నికి గల అవినాభావము. నిత్యసంబంధము లేక వ్యాప్తి తెలియబడును కాని వంట యింట విసనకఱ్ఱ ఉన్నను ఇతర స్థలములలో అది ఉండదు కనుక విసనకఱ్ఱకు నిప్పునకు వ్యాప్తి ఉండదు. అట్లే శరీరము ఆధారము సాధనములును కర్తృభేదమున భిన్నములు వానికి కర్తృత్వమునకు వ్యాప్తి ఉండదు కావున అవి లేవని ఈశ్వరుడు కర్త కాదని అనుట ఉచితము కాదు. (3) వేదము సత్యవచనుడు (ఆప్తుడు) అయిన దేవుని వాక్కు. కావున ఆ వేదము దేవుడున్నాడని చెప్పగా దానిని నమ్ముట ఆగమ (శబ్ద) ప్రమాణము నంగీకరించుట. జగమును చూచి దానికి భిన్ననిమిత్తోపాదాన రూపుడైన దేవుని అంగీకరించుట అనుమాన ప్రమాణమునంగీకరించుట. అట్లే కంటితో జగమును చూచి తదభిన్నపరమాత్మను అంగీకరించుట ప్రత్యక్ష ప్రమాణమునంగీకరించుట. ఇట్లు భగవంతుడున్నాడని చెప్పు ప్రత్యక్షానుమాన

ఆగమ ప్రమాణముల నంగీకరింపకపోవుటయు జడబుద్ధియేయగును. ప్రథమ పాదమున చరాచర జగత్తులో సృష్టి స్థితి కర్మలు కనబడుచుండగా వానికి హేతువైన భగవంతుడు కనబడకపోయినను అంగీకరించుట ఆవశ్యకమని చెప్పబడినది. త్రయీ వస్తు అని ఈశ్వరుని ఆగమ ప్రమాణవేద్యత చెప్పబడినది. అట్లే గుణభిన్న తనువులు ఈశ్వరుడు కలిగియున్నాడనుటలో ఈశ్వరుని ప్రత్యక్ష ప్రమాణవేద్యత చెప్పబడినది. ఎవరి శరీరము కనబడినను వారు కనబడినట్లే గదా! (4) చార్వాక బౌద్ధులు తప్ప దాదాపుగా మిగిలిన దార్శనికులందఱు ప్రత్యక్షానుమానాగమ ప్రమాణత్రయము నంగీకరించినవారే. ప్రత్యక్ష ప్రమాణము నొక్కదానినే నంగీకరించిన చార్వాకులు బ్రహ్మాండరూప భగవానుని తనువు కనబడుచుండగా భగవానునంగీకరించకపోవుట వారి జడబుద్ధిని సూచించును. అట్లే అనుమాన ప్రమాణమున నంగీకరించిన బౌద్ధులు పరమేశ్వరోపాదాన కారణ కార్యమైన జగమును చూచి ఈశ్వరుని అంగీకరింపకపోవుట వారి జడబుద్ధినే సూచించును. ఆగమ (శబ్ద) ప్రమాణ్యమునంగీకరించు జైనులు వేద ప్రతిపాదిత భగవాను నంగీకరించకపోవుట వారి జడబుద్ధినే సూచించును. ఒకరిని చూచి ఒకరు చార్వాకుని చూచి బౌద్ధుడు, వానిని చూచి జైనుడు భగవానుని విషయమున లేడనుచు ఆక్రోశించుట ఎందులకు? వ్యాక్రోశిని చేయుట ఎందులకు? తమ జడబుద్ధిని ప్రకటించుకొనుటకే పరమేశ్వరునియందు అనాదరమునో ద్వేషమునో ప్రకటించుటకే. ఇట్లు వ్యాక్రోశి నొనరించు వీరి వ్యాక్రోశిని చంపుటకు అనగా నిరాకరించుటకు కొందఱు ఆస్తిక దార్శనికులు ముఖ్యముగా నైయాయికులు వైశేషికులు యోగులు రమణీయమైన వ్యాక్రోశిని చేయుచున్నారను భావమును ఈ శ్లోకము ఉత్తరార్ధమున, తవ=నీ యొక్క, అస్మిన్=ఈ దీని (ఐశ్వర్యము) యందు, అభవ్యానామ్=అభవ్యుల యొక్క, జడధియః=జడబుద్ధి యొక్క, అరమణీమ్=రమణీయము కాని, వ్యాక్రోశీమ్=వ్యాక్రోశిని, విహంతుమ్=చంపుటకు, రమణీమ్=అందమైన, వ్యాక్రోశీమ్=వ్యాక్రోశిని, ఏకే=(దార్శనికులలో) ముఖ్యులైన నైయాయిక వైశేషిక యోగులు, విదధతే=చేయుచున్నారు. అని అన్వయించి చెప్పవచ్చును. ఇందు జడధీ శబ్దగత ఏకవచనము అభవ్యరమణీయమైన, భవ్యారమణీయమైన వ్యాక్రోశిని చేయువాని అల్పతను, ఏకే శబ్దగత బహువచనము ఈశ్వరాస్తిత్వ వాదుల గొప్పతనమును



వ్యంజించును. (5) త్రయీ వస్తు వ్యస్తం తిసృషు గుణభిన్నాసు తనుషు అను రెండవ పాదమందును, వరద రమణీయామ రమణీమ్ అను పదబన్ధము నను వృత్త్యను ప్రాసాలంకారయమకములున్నవి.

**అవతారిక:-** పూర్వ శ్లోకమున ఆత్మ ప్రత్యక్షతనే అంగీకరించని బౌద్ధ, చార్వాకుల యొక్క, వేదార్థము నన్యథా వ్యాఖ్యానించు జైనుల యొక్క జడధీత్వము చెప్పబడినది. ఈ శ్లోకమున వారి మతమనుమాన ప్రమాణముచే నిరాకరింప బడుచున్నది.

***శ్లో॥ కిమీహః కిఙ్కాయః స ఖలు కిముపాయస్త్రిభువనం***
***కిమాధారో ధాతా సృజతి కిముపాదాన ఇతి చ।***
***అతర్క్యైశ్వర్యే త్వయ్యనవసరదుస్థో హతధియః***
***కుతర్కోఽయం కాంశ్చిన్ముఖరయతి మోహాయ జగతః॥ 5***

కిమీహః–కిం–కాయః–సః–ఖలు–కిముపాయః–త్రిభువనమ్–కిమాధారః–ధాతా– సృజతి–కిముపాదానః–ఇతి–చ–అతర్క్యైశ్వర్యే–త్వయి–అనవసరదుస్థః–హతధియః–కుతర్కః–అయం–కాంశ్చిత్–ముఖరయతి–మోహాయ–జగతః

**ప్రతిపదార్థము:-** సః=అటువంటి, ధాతా=చతుర్ముఖ బ్రహ్మ, కిమీహః=ఏమి ఇచ్ఛగలవాడు, కింకాయః=ఏమి శరీరము కలవాడు, కిముపాదానః=ఏమి ఉపాదానము కలవాడు, కిముపాయః=ఏమి ఉపాయము గలవాడు, కిమాధారః=ఏమి ఆధారముగలవాడు అగుచు, త్రిభువనమ్=లోకత్రయమును, సృజతి=సృష్టించుచున్నాడు, ఇతి చ=అనియు, అతర్క్యైశ్వర్యే=తర్కాతీతమైన ఐశ్వర్యము గల, త్వయి=నీ విషయమున, అనవసర దుస్థః=ఆవశ్యకత లేని, సందిగ్ధతగల, అయమ్=ఈ, కుతర్కః=తర్కమువలె కనిపించువాదము, జగతామ్=లోకములకు, మోహాయ=అజ్ఞానము కలిగించుటకు, హతధియః=కొట్టబడిన బుద్ధిగల, కాంశ్చిత్=కొందరిని, ముఖరయతి=మాట్లాడించుచున్నది.

**తాత్పర్యము:-** భగవానుని ఐశ్వర్యము తర్కాతీతము. ఆయన జగమును సృజించుట, పాలించుట, చంపుట మొదలగు పనులనొనరించునది ఆయన ఐశ్వర్యము. త్రిభువనము నిర్మించుటలో ఆయనకు కోరిక ఏమి? ఏమి శరీరము? ఏమి ఉపాదనము? ఏమి ఉపాయము? ఏమి ఆధారము? ఇత్యాదిగా

చేయ(బడు) తర్కమునకు ఆవశ్యకత, అవకాశములేకున్నను ఆ తర్కము దుష్టముగా ఉన్నను కొందరు చేయుదురు. వారు ముందే కొట్టబడిన బుద్ధి గలవారు. పైగా జగమును మోసగింపజేయుటకు ఇష్టతర్కము చేయు చుందురు. ఇట్టి కుతర్కము వారి మనస్సులలో మెదలి ఇది ఈశ్వరుని నమ్మువారి (కు) తర్కమును నశింపజేయునని భావించి తా చెడినది కాక ఇతరుల చెడగొట్టుటకై వారిచే మాట్లాడింపజేయును.

**అనువాదము:-**

కారణజాలమిచ్చయును కాయముపాయము నిల్పగల్గు నా
ధారము నెవ్వి ముజ్జగము ధాత యతం డొకడే సృజించెనా?
తీరని సంశయాహతమతిష్ఠ కుతర్కమిదే జగమ్మసా
ధారణ మోహమగ్నముగఁ దా బలికించు నతర్క్య వైభవా.

**వివరణము:-** (1) ఆస్తికులు అనగా ఈశ్వరుని నమ్మువారు. నాస్తికులు అనగా ఈశ్వరుని నమ్మనివారు. ఆస్తికులు పుట్టి చచ్చు కుండకు కర్త (కుమ్మరి) యున్నట్లే పుట్టి చచ్చు జగమునకు కర్త (ఈశ్వరుడు) ఉండవలెనను అనుమానమును ప్రయోగించి ఈశ్వరునినమ్మనివారిచే ఈశ్వరునినమ్మించుటకు ప్రయత్నించెదరు. నాస్తికులీ ప్రయత్నమును సహింపనివారై కుతర్కమును చేయుదురు. కుండను నిర్మించుటకు డబ్బు సంపాదింపవలెనన్న ఈహ (కోరిక) యున్నది. కుండను చేయుటకు తగిన (కాయము) శరీరమున్నది. కుండను చేయుటకుపాయములు (సాధనములు) అయిన కఱ్ఱ మొదలగునవి ఉన్నవి. కుండను భూమి (ఆధారము) యందు నిలఁబడి చక్రము అను మరొక ఆధారము మీద మట్టి ముద్ద (ఉపాదనము) నుంచి చేయును. ఈశ్వరుడు త్రిభువనము దేనినాధారముగాఁ జేసికొని నిర్మించుటకు పూనుకున్నాడు? వానికి తగిన శరీరమేమున్నది? పనిముట్లు (ఉపాయములు) ఏవి యున్నవి? ఏ ఆధారము మీద నిలబడి త్రిభువనమును నిర్మించును? త్రిభువనమున కుపాదనమైన దేది? దానిని ఏ ఆధారముపై పెట్టి నిర్మించును? ఇట్టి కుతర్కమును నాస్తికులు చేయుచు దేవుడు లేడని నిరూపింప యత్నించెదరు. నాస్తికులే కాక ఆస్తికులలోని ఇట్టి తర్కము వంటి తర్కమునే చేయుచు నెట్టి ఆస్తికదర్శనమునైనను ఖండింప పూనుకొందురు. పై ప్రశ్నలన్నియు చార్వాక, బౌద్ధ, జైన నాస్తిక దార్శనికులవి మాత్రమే కావు.



ఆస్తిక దార్శనికులలో ఈశ్వరునంగీకరింపని మీమాంసక సాంఖ్యాదులు సైతమిట్టి తర్కము చేసి వైశేషిక నైయాయికులు మొదలైన ఈశ్వరునంగీకరించు ఆస్తిక దర్శనములను ఖండించునప్పుడు లేవదీయబడినవే. వీని వలన నాస్తిక దార్శనికుల బలము పెరిగి ఈ ప్రశ్నలు తాము లేవదీసినవేయని లోకమును గందరగోళమునకు గురిజేయుటకు తమవంటి మేధావులు లేరని ప్రకటించు కొనుటకును వీరిచే ఉపయోగించుకొనబడినవి. భగవానుని మాయాశక్తి తర్కాతీతమైనప్పుడు తర్కింపకయే వేదము చెప్పినట్లు ఈశ్వరునియందు విశ్వాసము కలిగియున్నచో నెట్లు తర్కింప గలుగుదురు? ఈశ్వరుడున్నాడని నిరూపించు తర్కముచేయువారికి ఈశ్వరుని యందు విశ్వాసము లేకపోవచ్చును. ఈశ్వరుని విశ్వసించువారును తమ పాండిత్య ప్రకర్షమును చూపుటకు ఈశ్వరుడులేడని తర్కింపవచ్చును. అంతమాత్రమున విశ్వసించువారి విశ్వాసము తగ్గకపోవచ్చును. విశ్వసింపనివారిని విశ్వసింపజేయుటయు జరుగకపోవచ్చును. బ్రహ్మసూత్రములలో 'తర్కా ప్రతిష్ఠానాత్' అను సూత్రమున్నది. తర్కము మాత్రమే ఈశ్వరుని సాధింపజాలదు అని దాని యర్థము. మరేమి చేయవలెను? ఈశ్వరుడున్నాడని నిరూపించుట ఎట్లు? వేదమును నమ్మిన చాలును. ఈశ్వరుని యందు విశ్వాసము కలుగును. అప్పుడు తర్కమునకు ప్రతిష్ఠ కలుగును. ఈశ్వరుని నిరూపించు తర్కమును చేయవచ్చును. అకాట్య ప్రమాణ (వేద) సిద్ధమైన ఈశ్వరుని నిరూపించునప్పుడు చేయబడు తర్కమున ఈశ్వరుని నిరూపింపలేకపోయినను నిరూపింపగల్గినను ఇబ్బంది ఉండదు. తర్కము బుద్ధ్యధీనము కావున బుద్ధ్యతిశయము కలిగినవాని ముందర బుద్ధ్యల్పత గలవారి తర్కము నిలువలేకపోవును. కావున తర్కము (అనుమానము) అకాట్య ప్రమాణమని చెప్పుటకు వీలులేదు. (2) అట్లే ప్రత్యక్షము అనగా ఇంద్రియము దోషయుక్తమైనచో ప్రమాణము కాదు. లోతుగా విచారించినచో ఏ ఇంద్రియ మైనను దోషహీనమని చెప్పుటకు వీలుకాదు. దూరమధికమయినప్పుడు పెద్ద వస్తువును చిన్నదానినిగా మాత్రమే చూడగల కన్ను దోషహీన ప్రమాణమెట్లగును. కంటికే జబ్బు లేకపోయినను కన్ను కొంత దూరమున గల వస్తువునే దాని యదార్థ పరిమాణమును తెలిసికొనజాలదు. దూరమునందుండుటచే సూర్య బింబమును చిన్నదానిగానే చూచును. అట్లే సూర్యునికన్న పెద్దవైన చుక్కలను

సూర్యుని కన్న చిన్నవానినిగా చూపు కన్ను నిర్దోషమనుట యెట్లు? సాధారణ ప్రత్యక్షము ప్రమాణము అని ఒప్పుకొన్నను పరమ ప్రమాణము మాత్రము కాదు. యోగి ప్రత్యక్షము పరమ ప్రమాణమైన కావచ్చును కాని అది సంవాది అని చెప్పబడుటకు అవకాశము లేదు. శబ్దము ప్రమాణమే అయినను అయధార్థవక్తల శబ్దము ప్రమాణము కాదు. పరమేశ్వరుని వాక్కు అని లేక అపౌరుషేయమని చెప్పబడు వేదమొక్కటే పరమప్రమాణము. కావున వేద ప్రతిపాదిత పరమేశ్వరుని విషయమున ఇతర ప్రమాణములనుప్రయోగించి అవి పరమేశ్వరుని తెలుపుటలో విఫలములయిన కారణమున పరమేశ్వరుడే లేడనుట సరికాదు. (3) ఈ ప్రత్యక్షానుమాన శబ్ద ప్రమాణములలో నైయాయికులు విశేషికులు అనుమాన ప్రమాణమునధికముగా నాదరించెదరు. కావున ఆ రెండు దర్శనముల వారిని తార్కికులు అనుట శాస్త్రజ్ఞుల వ్యవహారము. వారు తర్క రసికులు. ప్రత్యక్షముగా ఏనుగు కనపడినను అది ఏనుగు అని తెలిసినను ఇది ఏనుగు, తొండమున్నందు వలన అను అనుమానమును ప్రయోగించవలెనని కోరునంతటి అనుమాన ప్రమాణాధారము కలవారు. అనుమాన ప్రమాణమున 'కొండ యందు నిప్పు లేకుండినచో పొగ లేకపోయి యుండెడిది' అను వ్యవహారము నకు తర్కమని పేరు. ఇట్టి తర్కరసికత మంచిదే. కాని కనబడు ఏనుగు దాని యందు తొండము కనిపించుచుండగా దీనికి తొండము లేకయుండినచో ఇది ఏనుగు అయి ఉండెడిది కాదు అను తర్కము తర్కరసికులిష్టపడెదరేమో, వారికి వినోదము కలుగునేమో కాని ఇట్టి తర్కము సర్వామోదకరము అని చెప్పలేము. పైగా వ్యర్థ కాలహరణము. వేద ప్రతిపాదిత పరమేశ్వరుని విషయమున కొందఱు తర్కము చేయకూడదని కొందఱు చేయనక్కరలేదని అందురు. అంత మాత్రమున ఈశ్వరుడున్నాడను విషయమున తర్కమును అనగా అనుమాన ప్రమాణమును బొత్తిగా చేయరాదని చెప్పనక్కరలేదు.

**అవతారిక:–** పై శ్లోకమున ఈశ్వరుని నిరాకరించు తర్కము కుతర్కము అని చెప్పబడినది. ఈ శ్లోకమున ఈశ్వరుని అస్తిత్వము నిరూపించు సత్తర్కము చేయబడుచున్నది.

శ్లో॥ ***అజన్మానో లోకాః కిమవయవవన్తోఽపి జగతా***
***మధిష్ఠాతారం కిమ్ భవవిధిరనాదృత్య భవతి।***



***అనీశో వా కుర్యాద్భువనజననే కః పరికరో***
***యతో మన్దాస్త్వామ్ ప్రత్యమరవర! సంశేరత ఇమే॥ 6***

అజన్మానః–లోకాః–కిం–అవయవవంతః–అపి–జగతాం–అధిష్ఠాతారం –కిం–భవవిధిః–అనాదృత్య–భవతి–అనీశః–వా–కుర్యాత్–భువనజననే–కః –పరికరః– యతః–మందాః–త్వాం–ప్రతి–అమరవర–సంశేరతే–ఇమే.

**ప్రతిపదార్థము:–** అవయవవంతః=అవయవములు కలవైనను, లోకాః= లోకములు, అజన్మానః కిమ్=జన్మరహితములా?, జగతామ్=జగముల యొక్క భవవిధిః=పుట్టు ప్రక్రియ, అధిష్ఠాతారమ్=అధిష్ఠాతను (కర్తను), అనాదృత్య= ఆదరింపక, భవతి=కలుగునా?, వా=లేక, అనీశః=ఈశ్వరుడు కానివాడు, కుర్యాత్ కిమ్=చేయునా?, భువన జననే=భువనములు పుట్టుట యందు, పరికరః=సామగ్రి, కః=ఏది?, యతః=ఎందువలన, ఇమే=వీరు, త్వామ్ ప్రతి= నిన్ను గూర్చి, సంశేరతే=సంశయించుచున్నారో (అతః=అందువలన) మందాః =అల్ప బుద్ధులు.

**తాత్పర్యము:–** అవయవములు కలవైనను లోకములు జన్మ లేనివా? వాని యొక్క పుట్టుట అను ప్రక్రియ అధిష్ఠాత అనగా కర్త లేకయే జరుగునా? ఈశ్వరుడు కానివాడెవడైనను వానిని పుట్టించునా? వీని యొక్క పుట్టుకలో సామగ్రి ఏది (అక్కర లేదు). ఈ విషయములనాలోచింపక ఈశ్వరుని ఉనికి పట్ల సంశయించుచున్న వారెవరైనను మందులే అని చెప్పవలెను.

**అనువాదము:–**

జాతము కానిదా భువన జాతము? సాంశము? కల్గునా? యధి
ష్ఠాత ననాదరించి భవసత్త యనీశుడు సేయునా? జగ
ద్వ్రాతపు సృష్టి నే పరికరమ్మని మందులు నిన్ను గూర్చి సం
శీతుల మున్గుచుందురు విశేషముగా నమరాధినాయకా!

**వివరణము:–** అవయవములు కల వస్తువులో నుండి కొన్ని సూక్ష్మములైన అవయవములు ప్రతిక్షణము బయటికి వెడలిపోవుచుండును. సూక్ష్మములైన అవయవములు దానిలో చేరుచుండును. అవయవములన్నియు పోయి ఆ వస్తువే నశించుటయు జరుగును. ప్రాణులు ఏకకణముగా పుట్టి బహుకణములుగా

పెరిగి చివఱకు కణములన్నియు చచ్చినచో ప్రాణి చనిపోవుట సంభవించును. ఆ ప్రాణి వస్తువులలో కొన్ని అవయవములు తొలగించి కొన్నిటిని చేర్చుట సంభవించును. మనమేమి చేయకపోయినను ప్రాణ్యప్రాణి వస్తువులు శాశ్వతముగా నుండుట అన్నది లోకములోనే లేదు. కావున అవయవములు కల వస్తువులు ప్రాణులైనను, అప్రాణులైనను అవయవములు నశించినచో నశించును అనుట లోక శాస్త్ర సిద్ధ విషయము. అవయవములు గల వస్తువు కొత్త అవయవములు స్వీకరించుట గాని పాత అవయవములు కోలుపోవుట గాని సంభవించును. అవయవములు లేని వస్తువులకీ పరిస్థితి ఉండదు. కావున అవి శాశ్వతముగా నుండవచ్చును. లోకములు అనగా ఆకారము గలవి (కనబడునవి) అన్నియు అవయవములు కలవియే. అవి అన్నియు ఒకప్పుడు పుట్టినవే. పుట్టుక లేక ఎట్లు కనబడుచున్నవి అనుట ప్రథమ పాదార్థము. వీని పుట్టుట పుట్టించువాడు లేక జరుగునా? ఈశ్వరుడు కాక జీవుడెవడైన ముఖ్యముగా జీవులలో అధిక మేధావంతుడైన మనుష్యుడెవడైన లోకముల సృజించునా? లోక సృజనమునందు సామాగ్రి అవసరమా? అను ప్రశ్నలలో మొదటి ప్రశ్నకు అధిష్ఠాత అనగా కర్తలేనిదే లోకముల సృష్టి ఉండదు అను సమాధానము రెండవ పాదమున చెప్పబడినది. ఈశ్వరుడు కాని ఏ జీవుడైనను (మనుష్యుడైనను) ఏవో కొన్ని విషయములు తెలియని వాడే అయి ఉండును. సర్వజ్ఞుడైన జీవుడెవడును ఉండుట అసంభవము. రెండవ ప్రశ్నకు ఈశ్వరుడే లోకముల సృజింపవలెనను, లోకముల సృజించుటకు సామగ్రి అవసరమైనచో అతడే సృజించినాడని ఒప్పుకోవలెను కాని సామగ్రిని మరొకడు సృజించినాడని దాని సాయమున ఈశ్వరుడు లోకముల సృజించినాడని చెప్పకూడదు. లోకసృష్టి కొక యీశ్వరుడు లోకస్రష్టకు సాయపడు మరొక సామగ్రి స్రష్ట మరొకడున్నాడని ఒప్పుకొనుట అవివేకము. అప్పుడు సామగ్రి సృజించిన వానికి కావలసిన సామగ్రిని ఎవరు సృజించెనను ప్రశ్నలేర్పడును. కావున ఇట్లు చెప్పుట అనవస్థా దోషము. దానిని నివారించుటకు సామగ్రి యొక్క సాయము లేకయే ఈశ్వరుడు లోకముల సృజించినాడను సమాధానములు మూడవ పాదమున చెప్పఁబడినవి. (2) తల్లి గర్భము నుండి శిశువు బయటకు వచ్చుట స్థూలముగా పుట్టుట అనబడు చున్నది. కాని తల్లి గర్భములోకి తండ్రి వీర్యము నుండి వచ్చుట కూడ



పుట్టుకగా భావింపవచ్చును. అంతే గాక వివిధ ఆహార పదార్థములనుండి తండ్రి వీర్యము లోనికి తల్లి గర్భములోనికి ప్రవేశింపగల శక్తి గల వీర్యకణము సిద్ధమగుట కూడ పుట్టుకయే అని చెప్పవలెను. ఇట్లు పుట్టిన శిశువు మాతృ గర్భమున ప్రవేశించినప్పుడు మిక్కిలి చిన్నగా ఉన్నను తల్లి గర్భములోని ఆహార పదార్థముల సారములా శిశువు అవయవములుగా మారుచుండును. అట్లు క్రమముగా శిరో హస్త పాదాద్యవయ వములన్ని ఏర్పడిన పిమ్మట తల్లి ఆ శిశువును ప్రసవించును. అప్పటికా శిశువు గర్భములో ప్రవేశించినప్పటి పరిమాణ మెన్నోరెట్లు పెరుగును. అట్లే శిశువు పుట్టిన తరువాత శిశువు స్వీకరించిన ఆహార పదార్థముల సారములా శిశువు అవయవముల వృద్ధినొందించగా సుమారు ఇరువది సంవత్సరముల కాలము వచ్చుసరికి పరిమాణము పెరుగుట ఆగిపోవును. అప్పటికి సుమారు రెండు గజముల ఎత్తు ఏర్పడును. లావు మాత్రము తరువాత గూడ పెరుగుటయో తరుగుటయో జరుగుచుండును. ఇట్లీ పుట్టుక నియమబద్ధముగా జరుగుచుండుట ఈశ్వరుని నియామక శక్తిని తెలుపుచున్నది. పరిమాణము పెరుగుట తరుగుట మొదలగు జీవ ప్రక్రియలన్నియు ఈశ్వరుడు ఏర్పరచిన ప్రకృతి నియమముల నను సరించియే జరుగును. అట్లే వివిధ కాలములలో వివిధ జీవులు వివిధములైన ఆయుఃప్రమాణములలో జీవించి చివరకు మరణించును. ఇదియంతయు ఈశ్వరుని లోక సృష్టి స్థితి లయ ప్రక్రియగా గమనింపవలెను. జీవునికి సంబంధించిన శరీరగత సృష్టిస్థితిలయములే జీవసృష్టి స్థితి లయములుగా చెప్పబడుచుండును. శరీరమంతయు జడమే, ప్రాణములు కూడ జడములే. (3) జీవుడు వాస్తవమునకు చైతన్య స్వరూపుడు. ఆ జీవునకు సృష్టి స్థితి లయములు లేవు. ఆ చైతన్యమే పరమాత్మ, ఆత్మ, బ్రహ్మ ఇత్యాది పదములతో వ్యవహరింపబడును. జీవులకందఱకు శరీరమున్నట్లే పరమాత్మకీ బ్రహ్మాండ మంతయు శరీరమే. పంచభూతములన్నియు ఆయన శరీరభాగములే. సూర్య చంద్రాది దేవతలందఱు ఆయన చక్షురాదీంద్రియములే. జీవ శరీరము వ్యష్టి అని ఈశ్వర శరీరము సమష్టి అని చెప్పబడును. సమష్టి స్థూల శరీరము సమష్టి సూక్ష్మశరీరమునుండి యేర్పడును. అది ఈశ్వరుని సమష్టి కారణ శరీరము నుండి యేర్పడును. సూక్ష్మ స్థూల సమష్టి శరీరాభిమానులైన హిరణ్యగర్భ,

వైశ్వానరులకు జీవత్వము, ఈశ్వరత్వము రెండును ఉండును. తదభిమానులైన హిరణ్యగర్భ వైశ్వానరులను కార్యబ్రహ్మలు అనుట వేదాంతుల వ్యవహారమున నున్నది. వారిలో హిరణ్యగర్భుడు ప్రథమ జీవుడు అని చెప్పబడును. ఆయన స్థూల సమష్టి వ్యష్టి శరీరములను సృజించును. వీనికి (వీరికి) కారణభూతుడైన అవ్యాకృతుడు ఈశ్వరుడు అని వ్యవహరింపబడును. ప్రళయకాలమున సమష్టి వ్యష్టి పాంచభౌతిక శరీరములన్నియు ఈశ్వరుని కారణదేహమగు అవ్యాకృతము (మూలప్రకృతి) లేక మాయ యందు లీనమగును. సృష్టి ఆరంభమున అవ్యాకృతేశ్వరుని నుండి హిరణ్యగర్భుడు పుట్టి స్థూల వ్యష్టి సమష్టి పాంచ భౌతిక శరీరములను సృజించును. స్థూల శరీరములే అవయవములు గలవి. అవి ఈశ్వరుని (హిరణ్య గర్భుని) చేతనే సృజించబడును. అవియే ఇంద్రియములకు గోచరములగును. సూక్ష్మ భూతేంద్రియములు యోగి ప్రత్యక్షములు కావచ్చును. సూక్ష్మభూతేంద్రియములు ఈశ్వరుని చేతనే సృజించబడును. సూక్ష్మ భూతేంద్రియములే అవ్యాకృతేశ్వరుని నుండి సృజించబడినవనగా హిరణ్య గర్భ సృష్టి సమస్త స్థూల శరీర సృష్టియు అవ్యాకృతేశ్వరుని చేతనే సృజించబడినట్లే కదా! (4) లోకమున శరీరి శరీరములకు అంతగా భేదము పాటింపబడదు. పరమాత్మ యొక్క కారణశరీరమైన మాయచే చేయబడు సృష్టి స్థితి లయక్రియలే పరమాత్మ (శరీరి) కృత్యములుగా పేర్కొనబడును. జీవుల విషయమున కూడా శరీరకృత్యములే జీవక్రియలుగా చెప్పబడును. ప్రత్యక్షమగు శరీరమును చూచి ప్రత్యక్షము కాని జీవుని చూచుచున్నట్లు లోకమున భావింపబడును. లోకదృష్టితో సమష్టి స్థూల సూక్ష్మకారణ శరీరుడు (బ్రహ్మాండ శరీరుడు) ఐన ఈశ్వరుడు ప్రత్యక్ష ప్రమాణ వేద్యుడు. వెనుక చెప్పబడిన కుండ కుమ్మరి దృష్టాంతము ననుసరించి కనబడు జగము హేతువుగా, కనబడని ఈశ్వరుడు అనుమాన ప్రమాణవేద్యుడగును. ఈ అనుమాన ప్రమాణమున ఎవరైన దోషోద్భావనము చేయుదురు గాక. అయినను ఇది వేద ప్రతిపాద్యుడైన ఈశ్వరుని యందు చేయబడిన తర్కము అనగా వేదానుకూల తర్కము. వేద ప్రతిపాదితమైన ఈశ్వరాస్తిత్వమును దృఢపరచుకొనుటకై చేయబడినది. కావున అనుమానమునకు (తర్కమునకు) ముఖ్య ప్రమాణత్వము లేదు. వేదమే పరమేశ్వరుని విషయమున ముఖ్య ప్రమాణము. ఇట్టి ప్రమాణములచే వేద్యుడయిన ఈశ్వరునంగీకరింపని



వారు ఎంత విద్వాంసులయినను మేధావులైనను మందులేయని యెఱుగవలెను. (5) వకారాధిక్యావృత్తి ఈ శ్లోకమునకు వృత్త్యనుప్రాస శోభను కలిగించుచున్నది.

**అవతారిక:–** పై శ్లోకమున వేదానుకూల తర్కము చెప్పబడినది. ఈ శ్లోకమున వైదికావైదికాది దర్శనములన్నియు పరమాత్మయందే తాత్పర్యము కలవి అని చెప్పబడుచున్నది.

**శ్లో॥** *త్రయీ సాఙ్ఖ్యం యోగః పశుపతిమతం వైష్ణవమితి*
*ప్రభిన్నే ప్రస్థానే పరమిదమదః పథ్యమితి చ।*
*రుచీనాం వైచిత్ర్యాదృజుకుటిలనానాపథజుషాం*
*నృణామేకో గమ్యస్త్వమసి పయసామర్ణవ ఇవ॥* **7**

త్రయీ–సాంఖ్యం–యోగః–పశుపతిమతం–వైష్ణవం–ఇతి–ప్రభిన్నే–ప్రస్థానే–పరం–ఇదం–అదః–పథ్యం–ఇతి–చ–రుచీనాం–వైచిత్ర్యాత్–ఋజు కుటిల నానా పథజుషాం–నృణాం–ఏకః–గమ్యః–త్వం–అసి–పయసాం–అర్ణవ–ఇవ.

**ప్రతిపదార్థము:–**త్రయీ=ఋగ్యజుస్సామ వేదత్రయము, సాంఖ్యమ్=సాంఖ్యము యోగః=యోగము, పశుపతిమతమ్=పాశుపతము, వైష్ణవమ్=వైష్ణవము, ఇతి =అని, ప్రభిన్నే=మిక్కిలి భేదముగల, ప్రస్థానే=మార్గమున, ఇదమ్=ఇది, పరమ్= ఉత్కృష్టము, అదః=అది, పథ్యమ్=హితమైనది, ఇతిచ=అనియు, రుచీనామ్= రుచుల యొక్క, వైచిత్ర్యాత్=వింత(భేదము)వలన, ఋజుకుటిలనానాపథజషామ్ =చక్కని, వంకర, వేరు వేరు మార్గములను పొందిన, నృణామ్=మనుష్యులకు, పయసామ్=జలములకు, అర్ణవ ఇవ=సముద్రమువలె, త్వమ్=నీవు, ఏకః=ఒక, గమ్యః=గమ్యుడవు, అసి=అయియున్నావు.

**తాత్పర్యము:–** ఋగ్యజుస్సామ వేదత్రయము, సాంఖ్యము, యోగము పాశుపతము, వైష్ణవము అని మిక్కిలి భిన్నములైన మార్గములలో ఇది ఉత్కృష్ట మైనది. ఇది హితమైనది అని రుచుల వింత భేదము వలన కొందఱు చక్కని మార్గమును కొందరు వంకర మార్గములను అనుసరించుచున్నను ఆ మనుష్యుల కందఱకు జలములకు సముద్రమువలె నీ వొక్కడవే చేరదగినవాడవై యున్నావు.

**అనువాదము:-**

పాశపతమ్ము వైష్ణవము వైదికమార్గము సాంఖ్య యోగ త
త్త్వాశయమంచు నిద్ది పరమిద్ది హితమ్మనుచున్ వచింపగా
నీశుడొకండె గమ్యము యథేష్టముగా ఋజువక్రముఖ్య నా
నాశయ మార్గగాములకు నప్పులకబ్ధియె గమ్యమైనటుల్.

**వివరణము:-** (1) ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము అను మూడు వేదములకు త్రయీ అను పేరు కలదు. ఛందోబద్ధములగు దేవతాస్తోత్రరూపము లైన మంత్రములకు ఋక్కులను పేరుగలదు. ఛందస్సులేని కర్మకలాపముల బోధించు వాక్య (మంత్ర) ములకు యజుస్సులని పేరు. ఛందోబద్ధ గాన యోగ్యములైన మంత్రములకు సామములని పేరు. ఈ మూడు వేదములలోని కొన్ని మంత్రములు ఈ మూడు వేదములలో చేర్చబడని అనగా పఠనపాఠన క్రమములలో కొంతకాలము కొన్ని ప్రాంతములలో కనబడక ఇతర ప్రాంతము లలో పఠనపాఠన క్రమముననున్న గాంధర్వాయుర్జ్యోతిషౌషధాది సమాజోప యోగి విరక్తోపయోగి బ్రహ్మబోధక, శత్రుమారణాది కర్మోయోగి, ఇష్టాపూర్తాది కర్మోపయోగి మంత్రములనన్నింటిని కూర్చి ఏర్పఱుపబడిన వేదము అథర్వ వేదము. ఇట్టి మంత్రములు పై మూడు వేదములలో కొన్ని యున్నను వాని సంఖ్య యధికముగా గలదీ అథర్వవేదము. త్రయి అను పేరేర్పడుటకు ఇట్టి మంత్రముల మాత్రమే ఆదరించు ఋషుల శాఖ యొకటి ఉన్నట్లు తరువాతి కాలమునకు తెలియబడినందున, దీనికి చతుర్థత్వము కలిగినందున అంతకు ముందున్న ఋగ్యజుస్సామములకు త్రయి అను వ్యవహారము రూఢమైనది. ప్రస్తుత కాలమున అథర్వవేదముతో సహా ఋగ్యజుస్సామములన్నిటిని కలిపియే త్రయి అనగా వేదము అని రూఢమైనది. వేదశబ్దమునకు త్రయీశబ్దమునకు అర్థభేదము అంతగా పాటింపబడుట లేదు. త్రయి(వేదము)అన్ని మార్గములలో మొదటిది. వేదమంత ప్రాచీనమైన మోక్షమార్గము మరియొకటి లేకుండుటచే నీ మార్గము మొదటి శ్లోకమున చెప్పబడినది. భారతదేశమున ఇప్పటికిని త్రయీ మార్గానుయాయులే అధికముగా నుండుటచే అదియే ముందు పేర్కొనఁబడినది. పఠన సంప్రదాయమున భేదము లేర్పడిన కారణమున ఒక్కొక్క వేదమున కెన్నియో శాఖలేర్పడినవి. సుమారు పన్నెండువందల శాఖలేర్పడియున్నట్లు



తెలియవచ్చుచున్నది. ఒక్కొక్క వేదశాఖకు సంహిత, బ్రాహ్మణము, ఆరణ్యకము, ఉపనిషత్తు అను నాలుగు భాగములేర్పఱుపబడియుండినవి. కాని నేడు ఉపనిషత్తులు మాత్రమే ఎక్కువ సంఖ్యలో అనగా సుమారు నూట ఇరువది ఉన్నవి. సుమారు నూటపది ఉపనిషత్తులు ముద్రింపబడియున్నవి. సంహితలు గాని, బ్రాహ్మణములు గాని, ఆరణ్యకములు గాని పది పన్నెండు సంఖ్యకు మించకున్నవి. మిగిలిన సహస్రాధిక సంహితాదులు పఠన సంప్రదాయము నుండి లుప్తములై అంతరించి పోయినవి. (2) ఉపనిషత్తులలో సాంఖ్య యోగ శబ్దములు కనవచ్చుటచే ఆ రెండు మార్గములు వేల సంవత్సరముల క్రిందనే ప్రచురములైనట్లు నిశ్చయించుకొనవచ్చును. ఉపనిషత్తులలో నిరూపింపబడిన బ్రహ్మముతో నైక్యము పొందించు జ్ఞానమార్గమునకివి సహకారులయి ఉండుటచే ఉపనిషత్తులలో నీ శబ్దములు ప్రయోగింపబడుటకు అవకాశమేర్పడియుండ వచ్చును. ఉపనిషత్సారమైన శ్రీమద్భగవద్గీతయందు అద్వితీయబ్రహ్మముతో ఐక్యమును పొందగోరు సాధకులలో సాంఖ్యులు యోగులు అను ద్వివిధముల వారే పేర్కొనబడియున్నారు. శ్రీ మద్భాగవతమున కపిలమహర్షి తన తల్లికి సాంఖ్యమును బోధించినాడు. శ్రీమద్భాగవత భగవద్గీతలలో చెప్పబడిన సాంఖ్యమునకు నేడు ప్రచారములో నున్న సాంఖ్యమునకు భేదమున్నది. దీనికి కపిలమహర్షియే ప్రధాన ప్రవర్తకుడుగా సాంఖ్యగ్రంథములలో పేర్కొనబడినాడు. కాని నేటి సాంఖ్యదర్శనమున కపిలసూత్ర సాంఖ్యకారికాది గ్రంథములలో ఆత్మబహుత్వము ప్రకృతి నిత్యత్వము అను అంశములు శ్రీమద్భాగవత ప్రతిపాదిత సాంఖ్యమున కానరావు. శ్రీమద్భగవద్గీతలో ప్రబోధింపబడిన సాంఖ్యబుద్ధిలో ఆత్మైకత్వమే ప్రధానమైయున్నది. దీనిని బట్టి వేద (ఉపనిషత్) ప్రతిపాదిత సాంఖ్యమునకు నేడు ప్రచారములో నున్న సాంఖ్యదర్శనమునకు భేదము స్పష్టముగానున్నది. అయినను ఉపనిషత్ప్రతిపాదిత బ్రహ్మైకత్వప్రాప్తికి ఉపకరించు ఆత్మానాత్మ విచారము నేటి సాంఖ్యదర్శనమునను ప్రముఖము గానే ఉన్నది. ఆత్మకు బన్ధమోక్షములు లేవనుట, మొదలగు అంశములు మోక్ష హేతువైన ఆత్మ విచారమున మిక్కిలి ఉపయుక్తములు. ప్రకృతి పరిణామ రూపమే పాంచభౌతిక జగము అను పరిణామవాదము కూడ ఉపనిషత్సిద్ధాంతమున వ్యావహారికముగా అంగీకరింపబడినది. ప్రధానముగా ఉపనిషత్సిద్ధాంతమున

ప్రకృతి సత్యము కాకపోయినను మాయారూపముగా మిథ్యగా అంగీకరింపబడి నందున మిగిలిన అన్ని దర్శనములకన్నను ఉపనిషత్సిద్ధాంతమైన బ్రహ్మైకత్వము ను ప్రతిపాదించు శంకరాద్వైత దర్శనమున సాంఖ్య దర్శనమునకు సముచిత గౌరవమీయ బడినది. అట్లే చిత్తైకాగ్ర్యరూపమైన సాంగమైన యోగము కూడ శంకరాద్వైతదర్శనమున ఆదరింపబడినది. పతఞ్జలి మహర్షి యోగదర్శన ప్రవర్తకుడు. ఆయన అన్ని విషయములలో సాంఖ్యదర్శన సిద్ధాంతములనే అనుసరించినను సాంఖ్యులంగీకరించని ఈశ్వరు నంగీకరించుటచే పాతఞ్జల యోగదర్శనమునకు సేశ్వరసాంఖ్యమని పేరు. అందునను సాంఖ్య యోగములు రెండును ఏకములే అన్నంత సన్నిహిత సంబంధము కలిగియుండుటచే సాంఖ్యయోగముల రెండింటి నొకటిగా చూచువాడే జ్ఞాని అని శ్రీమద్భగవద్గీత పేర్కొనుచున్నది. అయినను కించిద్భేదము లేకపోలేదు. సాంఖ్యమున ఆత్మ జ్ఞాననిష్ఠ ప్రధానము. యోగమున చిత్తైకాగ్ర్యము ప్రధానము. వేదోక్తకర్మలను పరిత్యజించి, పరిత్యజించినానను భావమును గూడ విడచి, శారీరక కర్మల నాచరించుచున్నను ఆచరించుచున్నానను భావమును విడచి, అన్ని కర్మలు గుణాధీనముగానే యగుచున్నవి. ఆత్మ అకర్తయను అకర్త్రాత్మ జ్ఞాననిష్ఠగలవారు సాంఖ్యులు. అన్ని వైదిక నిత్య కర్మల నాచరించుచున్నను కర్తృత్వభావమును కర్మఫలమును పరిత్యజించి ధ్యాననిష్ఠ కలిగియున్నవారు యోగులు అని శ్రీమద్భగవద్గీత చెప్పును. శ్రీమద్భాగవత భగవద్గీతా బోధిత సాంఖ్యము అద్వైతాత్మజ్ఞాన రూపము. ప్రస్తుతము సాంఖ్యమని పిలువబడు దర్శనము ఆత్మ నానాత్వము నంగీకరించుటచే అద్వైతాత్మజ్ఞాన ప్రతిపాదకము కాదు. వైదిక (వ్యావహారిక)పరిణామవాదము నంగీకరించుటచే సాంఖ్యయోగములు వైదికము లని వ్యవహరింపబడుచున్నవి కాని ఆత్మ నానాత్వము, ఆత్మ భిన్నముగా ప్రకృతి నంగీకరించుటచే పూర్తిగా నీ దర్శనములను వైదికములనుట సరిగాదు. అర్ధ వైదికములనుట ఉచితమేమో! వైదికములు అని చెప్పుటకు వీలులేక పోవుటచే త్రయీ మార్గ భిన్నమార్గములుగానే శ్లోకమున త్రయితో పాటు తద్భిన్నములని తెలుపుటకే సాంఖ్య యోగములు విడిగా పేర్కొనబడినవి. ఒకవేళ ఇవి పూర్తిగా వైదికములే అయినచో వైదిక మార్గ బోధకము అగు త్రయీ శబ్దము తోడనే ఇవి గతార్థములై విడిగా పేర్కొనబడకపోయి ఉండెడివి అని గమనింపదగును.



కపిల పతఞ్జల మహర్షులు తత్త్వజ్ఞులే అయ్యును అల్పాధికారులకద్వైత శాస్త్ర ప్రవేశము దుష్కరమని భావించి కించిదవైదికమైనను ఆత్మ విచారైకాగ్రతల పట్ల ముందుగా అభిరుచి కలిగింపదలచి ఆత్మ నాశత్వము నంగీకరించినారని ప్రచారములోనున్న సాంఖ్యయోగ దర్శనములు కపిల పతఞ్జలి కృతములే అని భావించువారి దృష్టిలో నీ దర్శన రచనము సమర్థించునవకాశము లేకపోలేదు. అట్లే వైష్ణవ పాశుపతాది ప్రవక్తలైన నారదాది మహర్షుల విషయములోనను సమర్థింపవచ్చును. (3) పశుపతిమతమని వైష్ణవమని పేర్కొనబడిన రెండు మతములు నేటి శైవ వైష్ణవములకు దగ్గరివే. పశుపతి శబ్దము పశువులు వాని పతి భిన్నములని అంగీకరించు మతమని స్పష్టముగానే జీవేశ్వర భేదమును ప్రతిపాదించుచున్నది. ఇందు పశువుల పాశములతో బంధించుట విడచి పెట్టుట అనునవి రెండు సృష్టి స్థితి లయములను మూడు కృత్యములతో పాటు ఈశ్వరకృత్యము లైదు అంగీకరింపబడును. ఈ మతమున షట్త్రింశత్తత్త్వములు అంగీకరింపబడుటచే పరిణామవాదాంగీకారమున్నను అవైదికముగానే భావింప బడుచున్నది. పశుపతిస్థానమున విష్ణు శబ్ద ప్రతిపాద్యతను ఈశ్వరునికి చెప్పు పరిణామవాదమునే అంగీకరించు మతము వైష్ణవమని చెప్పబడును. దీనికి నారద పాంచరాత్రమని మరొక పేరు గలదు. నేటి అన్ని విధములైన శైవ వైష్ణవములకు ఈ శ్లోకమున చెప్పబడిన ప్రాచీన పాశుపత వైష్ణవములు మూలములు. శైవమున త్రికశైవము, ప్రత్యభిజ్ఞాశైవము, ఆరాధ్యశైవము, వీర శైవము మొదలగునవెన్నియో భేదములేర్పడియున్నవి. అట్లే వైష్ణవమున భాగవతము (వాసుదేవ పారమ్యము గలది), శ్రీ వైష్ణవము (నారాయణ పారమ్యము గలది), గౌడీయ వైష్ణవము (కృష్ణపారమ్యము గలది), మాధ్వము (నారాయణ పారమ్యము గలది) మొదలగునవెన్నియో ఏర్పడియున్నవి. ద్వైతాద్వైతము, శుద్ధాద్వైతము, అఖండాద్వైతము, విశిష్టాద్వైతము మొదలగు పేర్లున్నమతములన్నియు ఆత్మభేదమో, జీవేశ్వరభేదమో, జగత్సత్యమో అంగీకరింపఁబడుటచే ద్వైతములని చెప్పదగినవి. సాధారణముగా వీనన్నిట విష్ణువు లేక తదవతారములకు పారమ్యముండును. పాంచరాత్రమను పేరుగల ప్రాచీన వైష్ణవమున వాసుదేవుడు పరమేశ్వరుడు, సంకర్షణుడు జీవుడు, ప్రద్యుమ్నుడు మనస్సు, అనిరుద్ధుడు అంతరంగము అను నాలుగు పదార్థములు

(వ్యూహములు) అంగీకరింపబడినవి. జీవేశ్వరాభేదము నంగీకరించు అద్వైతమున సర్వదేవతాద్వైతము ప్రధానముగా హరిహరాద్వైతము శివ విష్ణు గణేశ సూర్యశక్తులలో నొక దేవతకు పారమ్యము వ్యావహారికముగా అంగీకరింపబడును. **'ఓం నమఃశివాయ'** అను శివమంత్రములోని 'మ' అను అక్షరమును **'ఓం నమో నారాయణాయ'** అను విష్ణు మంత్రములోని 'రా' అను అక్షరము కలియగా ఏర్పడినది రామ శబ్దమని అంగీకరించి రాముని యొక్క పారమ్యము నంగీకరించు మతము ఒక విధముగా హరిహరాద్వైతము యొక్క వ్యావహారిక రూపము అని చెప్పదగును. (4) ఇట్లున్న భిన్న ప్రస్థానములలో ఎవరికి వారు తమమతమే ఉత్కృష్టమైనది, తమ మతమే పథ్యమని చెప్ప వచ్చును గాక, అన్ని మతములు సమానములు కావు. వీనిలో కొన్ని ఋజు మార్గములు పుణ్యాధిక్యముచే ఆశ్రితములగును. మరికొన్ని మతములు మంత్రములు మద్యమాంసాది నిషిద్ధ పదార్థ నివేదనాదులు తప్త ముద్రా ధారణాదులు లింగధారణాదులు సాధారణ గృహస్థుడైనను మృతుని ఖననము మొదలగు వేద విరుద్ధాచారములు గలవి కలవు. అవి వక్రములు. అట్లే భారత దేశమునకు చెందిన అవైదికములు జైన బౌద్ధములు వక్రతరములు విదేశము లకు చెందిన మహమ్మదీయ క్రైస్తవ మతములు ఎన్నియో వక్రతమములు నున్నవి. వక్ర, వక్రతర, వక్రతమములు సాధనములు. కొండలపై వర్షము కురిసి నప్పుడేర్పడు ప్రవాహములు కొన్ని గంగానర్మదాదుల వలె ఋజు మార్గమున, మరికొన్ని యమునా సరస్వత్యాదులు వక్రమార్గమున గంగానదీ ప్రవేశద్వారమున సముద్రము నొక్కదానినే చేరుకొనుటు తప్ప వానికి వేఱు గతి లేనట్లు అన్ని మతములకును ఓ పరమేశ్వరా నీవే గతివై ఉన్నావు. వక్రమార్గమున తొలుత ప్రవేశించినవాడును సాధనాబలమున ఋజుమార్గమున తరువాత ప్రవేశించును. మత భేదముల రాగద్వేషముల విడచి పరమేశ్వరుని సేవించుట పరమమైన ఋజుమార్గము.

ఇందు సముద్రముతో పరమేశ్వరుని త్రయ్యాది మతములు జలములతో పోల్చబడియున్నందున ఈ శ్లోకమున ఉపమాలంకార మేర్పడి యున్నది. దకార వకార పకారాద్యావృత్తిచే వృత్త్యనుప్రాసాలంకార మేర్పడియున్నది. ద్వితీయ పాదమున దాక్షిణాత్య వర్ణమైత్రి ఉన్నది. *



## వైదిక విజ్ఞాన సర్వస్వ సంగ్రహ పరిచయము

**మధుసూదన సరస్వతి రచనకు అనువాదము**

**దోర్బల విశ్వనాథశర్మ**

వేద శబ్దము విద్ ధాతువునుండి యేర్పడినది. వేదమనగా జ్ఞానమును బోధించు అపౌరుషేయ శబ్దరాశి. ప్రత్యక్షాది జ్ఞానమున ఇంద్రియాది దోషము వలన, దోషమేర్పడుటవలన అది వ్యావహారిక విషయమున కొంతవఱకు ప్రమాణమని పేర్కొనఁబడినను వేదము వలె సంపూర్ణముగ ప్రమాణమనఁబడుట కవకాశము లేదు. వ్యావహారిక విషయములలో వేదము నాశ్రయించకుండ జీవనము గడుపుకొన వచ్చునేమో కాని పరమార్థ విషయమున వేద ప్రమాణము తప్ప మఱొకటేదియును నిర్దోష ప్రమాణము కానేరదు. అపౌరుషేయ శబ్దరాశి యందు పురుష సాధారణ భ్రమ ప్రమాదాది దోషములుండుటకవకాశము లేదు. కావుననే అది ప్రమాణ మూర్ధన్యము. ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము త్రయియని పేర్కొనఁబడును. అథర్వణ వేదముతో కూడి వేదములు నాలుగు; శిక్ష, కల్పము, వ్యాకరణము, నిరుక్తము, ఛందము, జ్యోతిషము అను వేదాంగములు ఆరు; పురాణము, న్యాయము, మీమాంస, ధర్మశాస్త్రము అను ఉపాంగములు నాలుగు; ఇవి చతుర్ధశ విద్యలు. వైశేషికదర్శనము న్యాయమున; వేదాంతదర్శనము మీమాంస యందు; సాంఖ్య పాతం జల (యోగ) దర్శనములు పాశుపతాది శైవాగమములు పాంచరాత్రాది వైష్ణవాగమములు ధర్మశాస్త్రమందే అంతర్భవించును. పై చతుర్దశ విద్యలకు ఆయుర్వేదము ధనుర్వేదము గాంధర్వవేదము అర్థశాస్త్రము అను ఉపవేదములు కలిపిన మొత్తము విద్యలు పదునెనిమి దగును. ఇది యంతయు వైదిక వాఙ్మయము, అంతయు ఆస్తిక వాఙ్మయమనియు పేర్కొనఁబడును. ఏవియైన పేర్కొనఁబడని చిన్న చిన్న వాఙ్మయములున్నను అవి దీని యందే ఏక దేశ భావమునందును. అవి చిన్నవై యేక దేశీయములగుటచే సార్వదేశిక వైదిక వాఙ్మయాంతర్భూతములగుట సముచితమే. కాని మాధ్యమికుల విజ్ఞానాతిరిక్త శూన్యవాదము, ఉత్తానుల క్షణిక విజ్ఞానవాదము (యోగాచారులది), జ్ఞానాకారక్షణిక విజ్ఞాన వాదము (సౌత్రాంతికులది), ప్రత్యక్ష స్వలక్షణ క్షణిక బాహ్యార్థ వాదము (వైభాషికులది), గంభీరుల విజ్ఞాన శూన్యవాదము (ఇవియన్నియు బౌద్ధములు), చార్వాకుల దేహాత్మ వాదము (దీనియందే ప్రాణాత్మ–ఇంద్రియాత్మాది వాదములు అంతర్భవించును), దేహాతిరిక్త దేహ పరిమాణాత్మ వాదము (దిగంబర జైనులది) మొదలగు నాస్తిక దర్శనములు మ్లేచ్ఛాది

దర్శనములు పురుషార్థమైన నిత్య సుఖ దుఃఖ నివృత్త్యనుకూలములు కాకపోవుటచే వైదిక వాఙ్మయమునఁజేర్చబడుట లేదు.

ధర్మ బ్రహ్మ ప్రతిపాదకమై అపౌరుషేయమై ప్రమాణమై యొప్పు వాక్యము వేదము. అది **మంత్రము, బ్రాహ్మణము** అని రెండు విధములుగా నున్నది. అనుష్ఠాన కారణములైన ద్రవ్యదేవతలఁబ్రకాశింపఁజేయునవి మంత్రములు. అవి ఋగ్యజుస్సామ రూపమున త్రివిధములు. (1) పాదబద్ధ గాయత్ర్యాది సప్త ఛ్చందో విశిష్టములు **ఋక్కు** లనఁబడును. (2) ఋక్కులు గాన విశిష్టములై **సామము** లనఁబడును. (3) అగ్నీదగ్నీ న్విహరేత్యాది సంబోధన రూపములు **యజుస్సులు**. నిగద సంజ్ఞ మంత్రములును యజురంతర్భూతములే. బ్రాహ్మణము విధి రూపము. అర్థవాద రూపము, తదుభయ విలక్షణము నని త్రివిధముగా నుండును. (1) విధి, శబ్ద భావనా రూపమని భాట్టులు, నియోగరూపమని ప్రాభాకరులు; ఇష్ట సాధనా రూపమని తార్కికాదులును చెప్పెదురు. ఇది (1) ఉత్పత్తి (2) అధికార (3) వినియోగ (4) ప్రయోగరూపమున నాల్గు విధములై యుండును.

(1) దేవతాకర్మ స్వరూప మాత్ర బోధకమైన దుత్పత్తి విధి. **'ఆగ్నేయోఽష్టాక పాలో భవతి'** ఇత్యాదులుదాహరణములు, (2) ఇది కర్తవ్యతతో కూడిన కరణము లైన యాగాదులకు ఫలసంబంధమును బోధించునది అధికార విధి. **'దర్శ పూర్ణ మాసాభ్యాం స్వర్గకామో యజేత'** ఇత్యాదులుదాహరణములు. (3) అంగ సంబంధబోధకమైనది 'వినియోగ విధి'. వ్రీహిభిర్యజేత 'సమిధోయజతి' ఇత్యాదు లుదాహరణములు. (4) సాంగ ప్రధాన కర్మ ప్రయోగైక్య బోధకము ప్రయోగ విధి. ఇది శ్రౌతమని కొందఱు కాల్ప్యమని కొందఱు పల్కుదురు. ఇది పై మూడు విధములు కలిపికొనియుండును.

కర్మయు గుణకర్మ అర్థకర్మయని రెండు విధములుగానుండును. క్రతు కారకముల నాశ్రయించి విధింపఁబడినది గుణకర్మ. అదియు నాల్గు విధములుగా నుండును. (1) ఉత్పత్తి, (2) ఆప్తి, (3) వికృతి, (4) సంస్కృతి.

(1) **'వసంతే బ్రాహ్మణోఽగ్నీనాదధీత', 'యూపం తక్షతి'** మొదలగు వాక్యము లందు ఆధాన తక్షణాది రూపమున సంస్కార విశిష్టాగ్నియు, పాద్యుత్పత్తి వర్ణింపఁ బడుటచేనిది ఉత్పత్తి కర్మమనఁబడును. (2) **'స్వాధ్యాయోఽధ్యేతవ్యః', 'గాం పయో దోగ్ధి'** ఇత్యాది వాక్యములందు అధ్యయనదోహనాది రూపమున ఉన్నట్టి స్వాధ్యాయ క్షీరాదులకే ప్రాప్తి చెప్పఁబడి నందున నిది ఆప్తి కర్మము. (3) **'సోమమభిషుణోతి'**,



**'వ్రీహీన వహంతి' 'ఆజ్యం విలాపయతి'** ఇత్యాది వాక్యముల అభిషవ, అవఘాత, విలాపన రూపమున సోమాదుల వికారము చెప్పబడుటచే నిది వికార కర్మము. (4) **'వ్రీహీన్ ప్రోక్షతి' 'పత్న్యవేక్షతే'** ఇత్యాది వాక్యముల ప్రోక్షణావేక్షణాది రూపమున వ్రీహ్యాదులు సంస్కరింపఁబడుట చెప్పఁబడుటచే నిది సంస్కార కర్మము. ఈ నాలుగు కర్మలు నంగకర్మలే. అట్లే క్రతుకారకముల నాశ్రయించక విధింపఁబడిన కర్మము అర్థకర్మము. ఇదియు అంగము, ప్రధానము అని రెండు విధములుగానుండును. అంగమనగా అన్యార్థ కర్మము, అన్యార్థము కానిది ప్రధాన కర్మము. అంగ కర్మయు సన్నిపత్యోపకారకమని ఆరాదుపకారకమనియు ద్వివిధముగా నుండును. ప్రధాన స్వరూప నిర్వాహకమైనది సన్నిపత్యోపకారక మైన అంగకర్మము. అవహననప్రోక్షణాది ఫలోపకారి ప్రయాజాది కర్మము ఆరాదుపకారకమైన అంగ కర్మము. ఇట్లు సంపూర్ణాంగ సంయుక్తమగు కర్మము ప్రకృతి కర్మమని, వికలాంగ సంయుక్తమగు కర్మము వికృతి కర్మమని, చెప్పఁబడును. ఈ రెంటికిని విలక్షణమైన కర్మము దర్వీహోమము. ఈ విధముగా (కర్మ) విధి భాగము నిరూపింపఁబడినది. ప్రాశస్త్యమునో నిందనో బోధించుచు విధి శేషమైన వాక్య మర్థవాదమనఁబడును. ఇదియు మూడ విధములుగా నుండును. (1) గుణవాదము, (2) అనువాదము, (3) భూతార్థవాదము.

(1) ప్రమాణాంతర విరుద్ధార్థ బోధకము గుణవాదము. **'ఆదిత్యో యూపః'** ఇత్యాది వాక్యముదాహరణము. ఆదిత్యుడు యూపస్తంభమనుట ప్రత్యక్ష ప్రమాణ విరుద్ధమైన యర్థము గదా. (2) ప్రమాణాంతర బోధితార్థమునే మరల చెప్పునది అర్థవాదము. **'అగ్నిర్హిమస్య భేషజమ్'** ఇత్యాది వాక్యముదాహరణము. ఇందు అగ్ని చలికి మందు అన్న విషయము ప్రత్యక్షప్రమాణసిద్ధమే కదా. (3) ప్రమాణాంతర విరోధము గాని ప్రమాణాంతర ప్రాప్తిగా లేనిది భూతార్థవాదము. **'ఇంద్రోవృత్రాయ వజ్రముదయచ్ఛత్',** ఇత్యాది వాక్యముదాహరణము. ఇందు ఇంద్రుడు వృత్తునిపై వజ్రమును ప్రయోగించుట ప్రమాణాంతర సిద్ధార్థము కాదు. ప్రమాణాంతరమున నిది తెలియఁబడునది కాదు కావున నిది భూతార్థ వాదము. ఈ యర్థమే ఈ క్రింది శ్లోకమున సంగ్రహింపఁ బడినది. **'విరోధే గుణవాదః స్యాదనువాదోఽవధారితే భూతార్థవాద స్తద్ధానాదర్థ వాదస్త్రిధా మతః**

పై మూడు విధములైన అర్థవాదములు స్తుతిపరములైనను వానిలో భూతార్థ వాదమే దేవతాధికరణన్యాయము ననుసరించి (స్వతః) ప్రామాణ్యము గలది. ప్రామాణ్యమనగా అబాధితా జ్ఞాతార్థజ్ఞాపకత్వమే కదా! అనగా ప్రమాణాంతరముచే

బాధింపఁబడని ప్రమాణాంతరముచే 'దెలియఁబడని అర్థమును బోధించిననే అజ్ఞానము ప్రమాయగును. ఆ జ్ఞానము కలిగించునది ప్రమాణమగును. గుణవాదము బోధితార్థ విషయము కావున అనువాదము జ్ఞాతార్థ విషయము కావున నీ రెండు విధములైన యర్థములకు ప్రామాణ్యము లేదు. కాని భూతార్థవాదము అబోధితా జ్ఞాత విషయము కాన దానికి ప్రామాణ్యము కలదు. భూతార్థవాదమునకు స్వార్థమునందును ప్రామాణ్యము కలదు. గుణవాదానువాదములకు స్వార్థమున ప్రామాణ్యము లేదు. స్తుతిరూపత్వాంశము ననుసరించి పై మూడును ప్రమాణములే. ఈ విధముగ అర్థవాద భాగము నిరూపింపఁబడినది.

విధ్యర్థవాదోభయ విలక్షణమైనది వేదాంత వాక్యము. ఇది అజ్ఞాతజ్ఞాపక మైనను అనుష్ఠాన ప్రతిపాదకము కాదు. కావున ఇది విధి కాదు. స్వతః పురుషార్థ మైన పరమానంద జ్ఞానాత్మక స్వార్థ బ్రహ్మమున ఉపక్రమోపసంహారాది షడ్విధ తాత్పర్య లింగములు కలది యగుటచే వేదాంతవాక్యము స్వతః ప్రమాణ భూతమై అన్ని (కర్మ) విధులకును అంతఃకరణశుద్ధిద్వారమున స్వశేషతయుండి అన్యమునకు తాను శేషము కాకపోవుటచే నిది అర్థవాదము కూడ కాదు. అందువలన నిది ఉభయ(విధి అర్థ వాద) విలక్షణమే. అయినను అజ్ఞాత జ్ఞాపకత్వ మాత్రమున నిది విధియనియు నొకచోఁబిలువఁబడుచుండును. విధి పదము ఈ వాక్యములలో లేకున్నను ప్రమాణ వాక్యమగుటచే నొకచో భూతార్థవాదమనియుఁబిలువఁబడుచుండుట దోషము కాదు. ఈ విధముగ విధి అర్థవాద తదుభయ విలక్షణ (వేదాంతవాక్య) రూపమైన బ్రాహ్మణ స్వరూపము నిరూపింపఁ బడినది.

ఇట్లు కర్మకాండ, బ్రహ్మకాండ ద్వయాత్మకమైన వేదము ధర్మార్థకామమోక్ష హేతువగును. అది యజ్ఞనిర్వాహము కొఱకై ఋగ్యజుస్సామ రూపమున మూడు భేదములనొందియున్నది.

హోత ఉపయోగించు (హౌత్ర ప్రయోగము) ఋగ్వేదమున, అధ్వర్యువు ఉపయోగించు (ఆధ్వర్యవ ప్రయోగము) యజుర్వేదమున, ఉద్గాత ఉపయోగించు (ఔద్గాత ప్రయోగము) సామవేదమున, బ్రహ్మ యజమానుల ప్రయోగములు నంతర్భవించును. అథర్వవేదము యజ్ఞమునందంతగానుపయోగపడకపోయినను శాంతిక పౌష్టిక–ఆభిచారికాది కర్మల ప్రతిపాదించునదగుట నది విలక్షణము. ఇట్లు నాలుగు విధములుగానున్న ఈ వేదమున ప్రవచన భేదమున బెక్కు శాఖలు కలవు.

కర్మకాండమున వ్యాపారభేదమున్నను అన్నివేదశాఖలకేకరూపత్వ మంగీకరింపఁ



బడినది. బ్రహ్మకాండమని నాలుగు వేదముల ప్రయోజన భేదము నాశ్రయించి చెప్పఁ బడినది. ఇట్లు వేద చతుష్టయము నిరూపింపఁబడినది.

ఇక అంగములు (వేదాంగములు) నిరూపింపఁబడుచున్నవి. వానిలో ఉదాత్తానుదాత్త స్వరిత స్వరములు హ్రస్వదీర్ఘప్లుతభేదములు గలిగిన అచ్చులు మరియు హల్లులు వర్ణోచ్చారణ విశేష జ్ఞానమును గలిగించుట **శిక్ష** యొక్క ప్రయోజనము. ఆ జ్ఞానము లేకపోవుట వలన మంత్రముల యుచ్చారణ మనర్థమునే కలిగించును. **'మంత్రో హీనః స్వరతో వర్ణతో వా మిథ్యాప్రయుక్తో న తమర్థమాహ. స వాగ్వజ్రో యజమానం హినస్తి యథేన్ద్రశత్రుః స్వరతోఽ పరాధాత్.** స్వర్ణవర్ణోచ్చారణ లోపములతో కూడిన మంత్రము మిథ్యా ప్రయుక్తము. కావున యథార్థ ప్రకాశము కాక అది వాగ్వజ్రమై యజమానునే హింసించును. త్వష్ట చేత ఇంద్రశత్రుపదము స్వరభేదమున నుచ్చరింపఁబడి యజమానుడైన వృత్రుని వినాశనమునకు కారణమగుట వైదికులెరిగిన విషయమే. ఇది శిక్షయను వేదాంగము నాదరింపకపోవుట వలన కలిగిన అనర్థమును గుర్తింపఁజేయును. పాణిని రచించిన శిక్ష సర్వవేద సాధారణము. ప్రతివేద శాఖకును ప్రాతిశాఖ్య లను పేర నితరమునులచే రచింపఁబడిన శిక్షలు పెక్కులున్నను పాణిని నవఖండాత్మక శిక్ష వానిలో ముఖ్యస్థానము కలిగియున్నది. అది 'అథ శిక్షాం ప్రవక్ష్యామి' అను వాక్యముతో నారంభింపఁబడియున్నది.

ఇట్లు వైదిక పద సాధుత్వ జ్ఞానముచే కలుగు ఊహాదికము వ్యాకరణము యొక్క ప్రయోజనము**'వృద్ధిరాదైచ్'**అను సూత్రముతో నారంభింపఁబడి అష్టాధ్యాయాత్మకముగఁ బాణినిచే మహేశ్వరానుగ్రహమున రచింపఁబడినది, వ్యాకరణము. దానికి కాత్యాయన ముని వార్తికము, దానిపై పతంజలి మహర్షిచే రచింపఁబడిన భాష్యమును కలవు. మాహేశ్వరముత్రిముని ప్రణీతమైన ఈ **వ్యాకరణము** వేదాంగము. కౌముదాది వ్యాకరణములు వేదాంగములనఁబడవు. అవి లౌకిక ప్రయోగ జ్ఞానమునే కలిగింపఁ జాలినవి. వైదికపదసాధుత్వ నిరూపణమునకుఁజాలినవి కావు కదా!

ఇట్లు వైదిక వర్ణోచ్చారణ పదసాధుత్వజ్ఞానము కలిగిన పిదప నా పదముల కర్థమేమియను నాకాంక్ష కలుగగా **'సమామ్నాయ స్సమామ్నాతః'** అని యారం భింపఁబడి త్రయోదశాధ్యాయాత్మకముగ యాస్కమునిచే రచింపఁబడిన నిరుక్తము యొక్క సముపస్థితి అందుకుఁదోడుపడును. అందు నామాఖ్యాతనిపాతోపసర్గలుగా పదములు విభజింపఁబడి వైదిక మంత్ర పదార్థము ప్రదర్శింపఁబడినది.

అనుష్ఠేయార్థప్రకాశన ద్వారమున మంత్రములు పురుషార్థసాధన భూత

కర్మమునకు హేతువులు, మంత్రములు, వాక్యరూపములు. తద్వాక్యార్థజ్ఞానము తన్మంత్ర పదార్థజ్ఞానముపై నాధారపడి యుండు గావున **నిరుక్త** మావశ్యక మయిన వేదాంగము.

**సృణ్యేవ, జర్భరీ, తుర్ఫరీ తూన** వంటి దురవగాహపదముల యొక్క యర్థము నిరుక్తముచేతనే నిరూపింపఁబడియుండుట సంభవము మఱొక విధముగా వాని యర్థము తెలియఁబడ జాలదు. వైదిక ద్రవ్య దైవతాత్మక పదార్థ పర్యాయ శబ్దముల బోధించు నిఘంటువులు మొదలగు గ్రంథములు నిరుక్తాంత ర్భూతములే. వానిలో పంచాధ్యాయాత్మక వైదిక నిఘంటు గ్రంథము యాస్కుని చేతనే రచింపఁబడినది. అమర హేమచంద్రాది రచిత నిఘంటువులును నిరుక్తాంతర్గతములేయగును.

ఇట్లే ఋఙ్మంత్రములు ఛందో విశేషములతో కూడి యుండుటచే తద్విశేష పరిజ్ఞానము కొఱకు ఛందస్సు కూడ ఆవశ్యకమయినదే. ఛందః పరిజ్ఞాన హీనత నిందింపఁబడినందున ఛందో విశేష నిమిత్తకములైన కర్మానుష్ఠాన విశేషములు విధింపఁబఁబడియుండుటచేత ఛందోజ్ఞానము కొఱకై **ధీ శ్రీ స్త్రీమ్** అను సూత్రముతో నారంభింపఁబడి అష్టాధ్యాయాత్మకముగ పింగలనాగునిచే నిర్మింప బడిన **ఛందో విచితి** యవశ్య మాదరణీయమైన వేదాంగము. **అథ లౌకికమ్** అను సూత్రము వఱకు గల అధ్యాయత్రయము చేత గాయత్రి, ఉష్ణిక్, అనుష్టుప్, బృహతి, పఙ్క్తి, త్రిష్టుప్, జగతి అను నేడు ఛందస్సులు వానియవాంతర భేదములు సైతము ప్రసంగవశమున నిరూపితములైనవి. మిగిలిన అయిదధ్యాయముల చేత పురాణేతిహాసాదులలో నుపయుక్తములైన లౌకికచ్ఛందో విశేషములు వ్యాకరణముచే ప్రసంగవశమున లౌకిక పద సాధుత్వమును నిరూపింపఁబడినట్లు నిరూపింపఁబడినది.

ఇట్లే వైదిక కర్మాంగ దర్శాది కాలజ్ఞానము కొఱకు ఆదిత్యునిచే గర్గాదుల చేతను బహువిషయముగా **జ్యౌతిషమను** వేదాంగము రచింపఁబడియున్నది. ఇట్లే శాఖాంతరీయగుణోపసంహారమున వైదిక కర్మానుష్ఠానక్రమ విశేష జ్ఞానము కొఱకు ప్రయోగత్రయభేదమున త్రివిధములైన **కల్ప సూత్రములు** మాత్ర ప్రయోగ ప్రతిపాదకము లాశ్వలాయన సాంఖ్యాయనాదులచే ప్రణీతములు, ఆధ్వర్యవ ప్రయోగ ప్రతిపాదకములు బోధాయనాపస్తంబాదులచే ప్రణీతములు, ఔద్గాత్ర ప్రయోగ ప్రతిపాదకములు లాట్యాయన ద్రాహ్యాయణాదులచే ప్రణీతములు కలవు.

ఇట్లు ఆఱు వేదాంగముల ప్రయోజనము చెప్పఁబడినది. ఇక నాలుగు ఉపాంగములు వివరింపఁబడుచున్నవి.



సర్గ ప్రతి సర్గ వంశమన్వంతర వంశానుచరిత ప్రతిపాదకములు బాదరాయణ కృత పురాణములు బ్రాహ్మము, పాద్మము, వైష్ణవము శైవము, భాగవతము, నారదీయము, మార్కండేయము, ఆగ్నేయము, భవిష్యము, బ్రహ్మవైవర్తము, కౌర్మము, మాత్స్యము, గారుడము, బ్రహ్మాండము, లైంగము, వారాహము, స్కాందము, వామనము, పదునెనిమిది కలవు. ఇట్లే అనేక ప్రకారములైన ఉపపురాణములును కలవు. **పురాణ**వాఙ్మయమొక యుపాంగము.

గౌతమ ప్రణీతమైన ఐదధ్యాయముల ఆన్వీక్షకి **న్యాయ**మనుపేరు కలది. ఇదియునొక యుపాంగము. ఇందు ప్రమాణ, ప్రమేయ, సంశయ, విపర్యయ, ప్రయోజన, దృష్టాంత, సిద్ధాంత, అవయవ, తర్క, నిర్ణయ, జల్ప, వితండ, హేత్వాభాస, ఛల, జాతి, నిగ్రహస్థానములనెడు షోడశ పదార్థముల ఉద్దేశలక్షణ పరీక్షలతో తత్త్వజ్ఞానము సంపాదించుట దీని ప్రయోజనము.

ఇట్లే దశాధ్యాయాత్మకముగా కణాదమునిచే రచింపఁబడిన వైశేషికము ద్రవ్యగుణ కర్మ సామాన్య విశేష సమవాయములను ఆఱు భావ పదార్థముల యొక్క అభావ పదార్థముతో కలిపి యేడు పదార్థముల యొక్క సాధర్మ్య వైధర్మ్యములతోడి జ్ఞానము కలిగించును. ఇదియు న్యాయ పదవాచ్యమే.

ఇట్లు **మీమాంస**యు రెండువిధములుగనున్నది. కర్మ మీమాంస, శారీరక మీమాంస అను రెండు మీమాంసములలో మొదటిది ద్వాదశాధ్యాయాత్మకము, **అథాతో ధర్మ జిజ్ఞాసా** అను సూత్రముతో నారంభింపఁబడి **'అన్వాహార్యే చ దర్శనాత్'** అను సూత్రముతో ముగింపఁబడిన కర్మ మీమాంస జైమిని మహర్షిచే రచితము. అందు ధర్మ ప్రమాణము, ధర్మ భేదాభేదములు శేషశేషి భావము, కృత్వర్థ పురుషార్థ భేదములతో గూడిన ప్రయుక్త విశేషము, శ్రుత్యర్థపాదనాది క్రమ భేదము, అధికార విశేషము, సామాన్యాతిదేశము, విశేషాతిదేశము, ఊహ, బాధ, తంత్రము, ప్రసంగము అను అంశములు పన్నెండు అధ్యాయములలో ప్రతిపాదింపఁబడిన అర్థములు.

అట్లే అధ్యాయ చతుష్టయాత్మకమైన సంకర్షణకాండము కూడ జైమిని చేతనే రచింపఁబడియున్నది. దానికి దేవతాకాండమను పేరున్నను ఉపాసనా రూపకర్మ ప్రతిపాదకమౌటచే నది మీమాంసాంతర్గతమేయగును. అట్లే నాలుగధ్యాయములు గల శారీరక మీమాంస **'అథాతో బ్రహ్మ జిజ్ఞాసా'** అను సూత్రముతో నారంభింపఁ బడి **'అనావృత్తిః శబ్దాత్'** అను సూత్రముతో ముగింపఁబడి జీవ బ్రహ్మైక్యసాక్షాత్కార హేతువైన శ్రవణమను విచారమునకుపయోగ పడు న్యాయములను బ్రదర్శించునదై

బాదరాయణ ప్రణీతమై యొప్పుచున్నది. అందు సర్వవేదాంత వాక్యములకు సాక్షాత్తుగానో, పరంపరగానో ప్రత్యగభిన్న మైన అద్వితీయమైన బ్రహ్మయందు తాత్పర్యమను సమన్వయము ప్రథమా ధ్యాయమున ప్రదర్శింపఁబడినది. అందును ప్రథమపాదమున స్పష్ట బ్రహ్మలింగక వాక్యములు, ద్వితీయపాదమున అస్పష్ట బ్రహ్మలింగకములైన ఉపాస్య బ్రహ్మ విషయములైన వాక్యములు, తృతీయ పాదమున అస్పష్ట బ్రహ్మలింగములైన జ్ఞేయబ్రహ్మవిషయ వాక్యములు (అధికముగా) విచారింపఁ బడినవి. పిమ్మట చతుర్థపాదమున ప్రధానవిషయములుగా సందేహింపఁబడుచుండు అవ్యక్త జగదాది పదములు విచారింపఁబడినవి. ఇట్లు ప్రథమాధ్యాయమున సర్వ వేదాంతములకు (ఉపనిషత్తులకు) అద్వితీయ బ్రహ్మమున సమన్వయము సిద్ధము కాగా స్మృతితర్కాది విరోధ సంభావనమును పురస్కరించుకొని తత్పరిహారమునకై ద్వితీయాధ్యాయమున అవిరోధము ప్రదర్శింపఁబడినది. అందుకు మొదటి పాదమున సాంఖ్యయోగ కాణాది స్మృతులచేతను సాంఖ్యాది ప్రయుక్త తర్కముల చేతను నేర్పడు విరోధము పరిహరింపఁబడినది. రెండవపాదమున సాంఖ్యాది మతములందలి దోషము ప్రతిపాదింపఁబడినది. విచారమనగా దోషప్రదర్శనమున పరపక్షము నిరాకరించి స్వపక్షమును స్థాపించుటయే కదా! మూడవ పాదమున పూర్వభాగమున మహాభూత సృష్ట్యాది శ్రుతులలోని పరస్పర విరోధము పరిహరింపఁబడినది.

ఉత్తర భాగమున జీవ విషయ శ్రుతులలోని పరస్పర విరోధము పరిహరింపఁ బడినది. నాల్గవ పాదమున ఇంద్రియాది విషయశ్రుతుల పరస్పర విరోధము పరిహరింపఁబడినది. తృతీయాధ్యాయమున సాధనములు నిరూపింపఁబడినవి. అందును మొదటి పాదమున పరలోక గమన నిరూపణ ద్వారమున జీవుని కావశ్యక మైన వైరాగ్యము, నిరూపింపఁబడినది. రెండవ పాదమునందలి ప్రథమభాగము చేత త్వంపదార్థము, ఉత్తరభాగముచేత తత్పదార్థము శోధింపఁబడినవి. మూడవ పాదమున నానాశాఖాపఠిత పునరుక్త పదోపసంహారము చేయఁబడినది. ప్రసంగవశమున సగుణ విద్యలలోని శాఖాంతరీయ గుణోపసంహారాద్యుప సంహారములు చేయఁబడినవి. చతుర్థ పాదమున నిర్గుణబ్రహ్మ విద్యకు బహిరంగ సాధనములైన ఆశ్రమధర్మయజ్ఞ దానాదులు, అంతరంగసాధనములైన శమదమనిదిధ్యాసనాదులు నిరూపింపఁబడినవి.

చతుర్థాధ్యాయమున సగుణ నిర్గుణ విద్యలకుగల ఫల విశేషములు నిర్ణయింపఁ బడినవి. అందును ప్రథమపాదమున శ్రవణాద్యావృత్తి ద్వారమున నిర్గుణబ్రహ్మమును, ఉపాసనావృత్తి ద్వారమున సగుణబ్రహ్మమును సాక్షాత్కరించు కొని జీవించియున్న వానికి పాపపుణ్యలోపలక్షణజీవన్ముక్తి చెప్పఁబడినది. రెండవ పాదమున చచ్చుచున్న



వాని ఉత్క్రాంతి ప్రకారము చెప్పఁబడినది. తృతీయ పాదమున సగుణ బ్రహ్మజ్ఞుని మరణానంతరకమైన ఉత్తరమార్గము చెప్పఁబడినది. నాల్గవ పాదమునందలి మొదటి భాగము చేత నిర్గుణ బ్రహ్మవేత్త యొక్క కైవల్య ప్రాప్తి, ఉత్తరభాగముచేత సగుణ బ్రహ్మలోకప్రాప్తి చెప్పఁబడినవి.

కావున ఈ **'శారీరకమీమాంసా శాస్త్రము సర్వశాస్త్రమూర్ధన్యము'.** తక్కిన శాస్త్రములన్నియు దీనికి శేషభూతములు. కావునను శ్రీశంకర భగవత్పాదుల వారు చెప్పినట్లు ఈ శాస్త్రమే ముముక్షువులచే నాదరింపఁదగినదైయున్నదనుట పరమ రహస్యము.

ఇట్లే మను యాజ్ఞవల్క్యవిష్ణుయమాంగిరోవసిష్ఠదక్షసంవర్తశాతాతపపరాశర గౌతమ శంఖ లిఖిత హారీత–ఆపస్తంబ–ఉశనో వ్యాస కాత్యాయన బృహస్పతి దేవల నారద పైఠీనసి ప్రభృతులైన మునులచే రచింపఁబడిన వర్ణాశ్రమ ధర్మ విశేషః ప్రతిపాదకములైన **ధర్మశాస్త్రము**లును కలవు.

ఇట్లే వ్యాసరచిత మహాభారతము, వాల్మీకి రచిత శ్రీమద్రామాయణమును ధర్మశాస్త్రముననే అంతర్భవించును. ఇతిహాసములుగా ప్రసిద్ధములైన ఈ రెండు గ్రంథములే గాక సాంఖ్యాదులును ధర్మశాస్త్రాంతర్భావము నొందునవే యైనను వానికి విడిగా కూడ స్థానము కలదు. ఒక వేదమున కొక ఉపవేదము చొప్పున నాలుగు ఉపవేదములున్నవి. **ఆయుర్వేదము** వానిలో నొకటి. అందు సూత్రము, శరీరము, ఇంద్రియము, చికిత్స, నిదానము, విమానము, కల్పము, సిద్ధియను నెనిమిది స్థానములు కలవు. బ్రహ్మ, ప్రాజాపత్య, అశ్వి, ధన్వంతరి, ఇంద్ర భరద్వాజ, ఆత్రేయ, అగ్నివేశ్యాదిమునులచే ఉపదిష్టమై చరకునిచే సంగ్రహింపఁబడిన దాయుర్వేదము. అందు సుశ్రుతునిచే పంచస్థానాత్మకమైన మరొక ప్రస్థానము కూడ కలదు. వాగ్భటాదులు పెక్కురనేక గ్రంథములందు నిర్మించినను ఆయుర్వేదశాస్త్రమునకంటె భిన్నములు కావు. కామశాస్త్రము కూడ ఆయుర్వేదాంతర్గతమే. సుశ్రుతుడు వాజీకరణశాస్త్రమునకే కామశాస్త్రమను నామముకలదని చెప్పెను. వాస్తవమునకు వాజీకరణశాస్త్రము కాని కామ శాస్త్రము గాని వైరాగ్య ప్రయోజనములే. శాస్త్రమార్గము ననుసరించి భోగముల ననుభవించినను అవి దుఃఖపర్యవసాయులనుట స్పష్టమే కదా! చికిత్సా శాస్త్రమునకు,రోగ,తత్సాధన,తన్నివృత్తి,తన్నివృత్తి సాధన జ్ఞానమే ప్రయోజనము.

అట్లే విశ్వామిత్ర ప్రణీతమైన పాదచతుష్టయాత్మకమైన **ధనుర్వేదము** ఉప వేదములలో నొకటి. అందు మొదటిది దీక్షాపాదము. రెండవది సంగ్రహ పాదము.

మూడవది సిద్ధిపాదము. నాల్గవది ప్రయోగపాదము. మొదటి పాదమున ధను ర్లక్షణము. అధికార నిరూపణము చెప్పఁబడినవి. అందు ధనువనగా చాపమేయైనను చతుర్విధాయుధవాచిగా అది వివరింపఁబడినది. ముక్తము, (చక్రాదికము), అముక్తము (ఖడ్గాదికము), ముక్తాముక్తము (శల్యాదికము), యంత్ర ముక్తము (చక్రాదికము) ఈ నాలుగింటిలో ముక్తమస్త్ర మని, అముక్తము శస్త్రమని చెప్పఁబడును. అదియు బ్రహ్మ, వైష్ణవ, పాశుపత, ప్రాజాపత్య, ఆగ్నేయాది భేదములనేక విధము. ఇట్లు సాధిదైవతములు సమంత్రకములునైన చతుర్విధాయుధముల యందధికారము కల క్షత్రియులు తదనుయాములు పదాతి, రథి, గజి, అశ్వి భేదమున చతుర్విధులుగా నుందురు. దీక్షాభిషేక శకున మంగలకరణాదులు ప్రథమపాదమున నిరూపింపఁ బడినవి. అన్ని శాస్త్ర విశేషముల యొక్కయు నాచార్యుని యొక్కయు లక్షణము ఆ పిమ్మట తత్సంగ్రహణము, రెండవ పాదమున నిరూపింపఁబడినవి. గురుసంప్రదాయ సిద్ధములైన శస్త్రముల పునఃపునరభ్యాసమున మంత్ర దేవతా సిద్ధి సంపాదనము తృతీయపాదమున నిరూపింపబడినవి. ఇట్లు దేవతార్చనాభ్యాసాదులచే సిద్ధములైన అస్త్రవిశేషముల ప్రయోగము చతుర్థపాదమున నిరూపింపఁబడినది.

క్షత్రియులకు దుష్టదస్యుచోరాదుల నుండి ప్రజలను పాలించుటయను ప్రయోజనము, సంపాదింపఁజేయుటయే ధనుర్వేద ప్రయోజనము. ఇట్లు బ్రహ్మ ప్రజాపత్యాది క్రమమున సంపాదించిన ధనుర్వేదమును విశ్వామిత్రుడు రచించెను. ఇట్లే భరతునిచే రచింపఁబడినది **గాంధర్వవేదము**. అందు నృత్యగీత వాద్యాది భేదమున పెక్కు విషయములు నిరూపింపఁబడినవి. దేవతారాధన, నిర్వికల్పసమాధ్యాది సిద్ధి గాంధర్వ వేద ప్రయోజనము.

ఇట్లే **అర్థశాస్త్రము,** నీతిశాస్త్రము, అశ్వశాస్త్రము, గజశాస్త్రము పాక శాస్త్రమును పెక్కు విధములుగానున్నవి. ఇవికాక చతుష్షష్టికలలును శాస్త్ర రూపము ధరించి యున్నవి. చతుఃషష్టి కలలేవి అను ప్రశ్నమునకు పెక్కు విధములుగ వాని పరిగణనమున భిన్న భిన్న సమాధానములుండుటచే అవి యిట నుదహరింపఁబడలేదు. వాని ప్రయోజనములును లౌకికాలౌకికములు పెక్కులు కలవు. పెక్కురు మునులు వానిని రచించియుండినారు.

కపిలముని ప్రణీతమైనది సాంఖ్యశాస్త్రము. అందును త్రివిధ తాప నివృత్తియే ప్రధాన పురుషార్థము అని నిరూపింపఁబడినది. ప్రథమాధ్యాయమున ప్రధాన పురుషాదిలక్షణములు, ద్వితీయాధ్యాయమున ప్రధానకార్యములు, తృతీయాధ్యాయమున



విషయవైరాగ్యము, చతుర్థాధ్యాయమున పింగలాకుర రాద్యాఖ్యాయికలు, పంచ మాధ్యాయమునపరపక్షనివృత్తియును, షష్ఠాధ్యాయమున సర్వార్థములు సంగ్రహముగా నిరూపింపఁబడినవి. ప్రకృతి పురుష వివేకమే ఈ శాస్త్రము యొక్క ప్రయోజనము.

ఇట్లే పతంజలి ముని ప్రణీతమైన యోగశాస్త్రము కలదు. అందు మొదటి పాదమున చిత్తవృత్తి నిరోధరూప సమాధి, తత్సాధనములైన వైరాగ్యాదులు నిరూపింపఁ బడినవి. రెండవ పాదమున విక్షిప్త చిత్తునకు సమాధి లభించుట కావశ్యకములైన యమనియమప్రాణాయామప్రత్యాహారధారణాధ్యాన సమాధిరూపములైన అష్టాంగములు నిరూపింపఁబడినవి. మూడవపాదమున యోగ విభూతులు, నాల్గవ పాదమున కైవల్యము నిరూపింపఁబడినది. విజాతీయ ప్రత్యయ నిరోధద్వారమున నిదిధ్యాసన సిద్ధియే యోగశాస్త్ర ప్రయోజనము.

అట్లే పాశుపతశాస్త్రము పశుపతి నిర్మితమైనది కలదు. అందలి ఐదధ్యాయముల చేత జీవుడు కార్యరూపుడని, ఈశ్వరుడు కారణరూపుడని పశుపతి యందు చిత్త సమాధానమే యోగమని భస్మత్రిషవణ స్నానాదికము విధియని నిరూపింపఁబడినది. దుఃఖాంత రూపమైన మోక్షమే ఈ శాస్త్రమునకు ప్రయోజనము. అందుచేతనే మొదటి యధ్యాయము కార్యాధ్యాయమని, రెండవ అధ్యాయము, కారణాధ్యాయమని, మూడవది యోగాధ్యాయమని, నాల్గవది విధ్యధ్యాయమని, ఐదవది దుఃఖాంతాధ్యాయ మని పిలువఁబడినవి. శైవ మంత్ర శాస్త్రము కూడ నీపాశుపతశాస్త్రమునందే అంతర్భవించును. అట్లే వైష్ణవ నారదాది కృతమైన పాంచరాత్రము కలదు. అందు వాసుదేవ సంకర్షణ ప్రద్యుమ్న అనిరుద్ధ చతుః పదార్థములు నిరూపింపఁబడినవి.

వాసుదేవుడు పరమేశ్వరుడు, సర్వకారణభూతుడు. ఆతని నుండి సంకర్షణాఖ్య జీవుడు. ప్రద్యుమ్నాఖ్యా మనస్సు, అనిరుధ్యాఖ్యాహంకారము, జన్మముఁబడసెను. ఇవి యన్నియు వాసుదేవాంగములగుటచేత నభిన్నములే. కావున మనోవాక్కాయములతో వాసుదేవునారాధించుటచే కృతకృత్యత సిద్ధించు నని అందు నిరూపింపఁబడినది. వైష్ణవమంత్రశాస్త్రము (పరిమితమైనను) ఈ పాంచరాత్రశాస్త్రమునందే అంత ర్భవించును.

ఇన్ని ప్రస్థాన భేదములున్నను వీనన్నింటిలో జగదీశ్వర సంబంధము ఈ క్రింది మూడు ప్రస్థానములలో నిరూపింపఁబడును.(1) పరమాణువుల చేత జగమారంభింపఁ బడునను ఆరంభ వాదము. (2) ప్రకృతియే జగదాకారముగా పరిణమించునను పరిణామ వాదము. (3) బ్రహ్మమునందు జగమధ్యస్తమగు నను వివర్తవాదము.

పై మూడింటిలో మొదటి వాదమున పార్థివాప్యతైజసవాయ వీయ చతుర్విధ పరమాణువులు ద్వ్యణుకాది క్రమమున జగదాకారముగ పరిణమించు నని చెప్పఁబడినది.

(1) ఇందుకారణ వ్యాపారముచే అసత్తైన కార్యమే పుట్టునని తార్కికుల యొక్కయు, మీమాంసకుల యొక్కయు పక్షము మొదటిది. (2) సత్త్వ రజస్తమో గుణాత్మక ప్రకృతియే (ప్రధానమే), మహదహంకారాది క్రమమున జగదాకారముగ పరిణమించునను పక్షము రెండవది. ఇది సాంఖ్య యోగ పాశుపతులకు సమ్మతము. బ్రహ్మము యొక్క పరిణామమే జగమనుట వైష్ణవులకు సమ్మతము. (3) స్వప్రకాశ పరమానందాద్వితీయ బ్రహ్మమే స్వమాయావశమున జగదాకారమున గల్పింపఁబడుటచే జగము మిథ్యయనునది, మూడవ పక్షము. ఇది బ్రహ్మవాదుల పక్షము.

ఈ మూడవ పక్షమే మొదటి రెండు పక్షముల ప్రతిపాదించిన వారికి సమ్మతము. అదియే ఉపనిషత్తుల సిద్ధాంతము. అదియే విభిన్న ప్రస్థానముల బ్రతిపాదించిన మునులకు అభిమతము. వారు మునులు కదా! భ్రాంతులు కారు కదా! అయినను విషయ ప్రవణులైన జీవులకా సిద్ధాంతము తలకెక్కదని ముందుగా వేఱువేఱు ప్రస్థానముల ప్రతిపాదించి వానిలోని దోషములను వారే తెలిసికొని మూడవ పక్షము నాశ్రయించెదరని చివఱకు ఉపనిషత్సమ్మత మతము తప్ప మిగిలిన వేవియు వైదికములు కావని గ్రహించునట్లు చేసిరి. కాని అజ్ఞులు కొందఱు ఆ మునులకు ప్రతిపాదిత ప్రథమ ద్వితీయ పక్షములందే తాత్పర్యమని భావించెదరు. కావుననే ఋజువైన మూడవ పక్షమును మేధావు లాశ్రయింపగా, కుటిలములైన ప్రథమ ద్వితీయ పక్షముల నితరులాశ్రయించిరి. అయినను ప్రథమ, ద్వితీయ కుటిల పక్షముల నాశ్రయించినవారు కాలక్రమమున శుద్ధ చిత్తులై ఋజువైన తృతీయ పక్షము నాశ్రయించి ముక్తులగుదురు.



**అవతారిక:-** పూర్వశ్లోకములలో శివుని (దార్శనిక) నిర్గుణ, అనంతగుణ (సగుణ) మహిమ ప్రతిపాదింపబడినది. ఈ శ్లోకమున అర్వాచీన పదము గల శివుని (పౌరాణిక) పరిమితగుణ (సగుణావతార) సాకార మహిమ స్తుతి ఆరంభింపబడుచున్నది.

**శ్లో॥** *మహోక్షః ఖట్వాఙ్గమ్ పరశురజినం భస్మ ఫణినః*
*కపాలం చేతీయత్తవ వరద! తన్త్రోపకరణమ్।*
*సురాస్తాం తామృద్ధిం దధతి తు భవద్భ్రూప్రణిహితాం*
*న హి స్వాత్మారామం విషయమృగతృష్ణా భ్రమయతి॥* **8**

మహోక్షః-ఖట్వాంగం-పరశుః-అజినం-భస్మ-ఫణినః-కపాలం-చ-ఇతి-ఇయత్-తవ-వరద-తంత్రోపకరణమ్-సురాః-తాం-తాం-ఋద్ధిం-దధతి-తు-భవత్-భ్రూప్రణిహితాం-న-హి-స్వాత్మారామం-విషయ మృగతృష్ణా-భ్రమ యతి.

**ప్రతిపదార్థము:-** వరద!=ఓ వరములనిచ్చువాడా, తవ=నీకు, మహోక్షః=పెద్ద యెద్దు, ఖట్వాఙ్గమ్=మంచపుకోడు, పరశుః=గండ్రగొడ్డలి, అజినమ్=చర్మము, భస్మ=బూడిద, ఫణినః=పాములు, కపాలమ్=పుఱ్ఱెయు, ఇతి=అను, ఇయత్=ఇంతమాత్రము, తన్త్రోపకరణమ్=కుటుంబభరణ సాధనలు, తు=కాని, భవద్భ్రూ ప్రణిహితామ్=నీ కనుబొమచే ఈయబడిన, తామ్‌తామ్=ఆయా, ఋద్ధిమ్=ఐశ్వర్యమును, సురాః=దేవతలు దధతి తు=ధరించెదరు, విషయమృగతృష్ణా=విషయములను ఎండమావి, స్వాత్మారామమ్=తనలో తాను ఆనందముగా క్రీడించువానిని, న భ్రమయతి=మోహింపజేయదు.

**తాత్పర్యము:-** ఓ వరదా! పెద్ద యెద్దు, మంచపుకోడు, బూడిద, గండ్రగొడ్డలి, పాములు, పుఱ్ఱె అనునవి మాత్రమే నీ కుటుంబ భరణ సామగ్రి. కాని నీ కనుబొమలచే ప్రసాదింపబడిన ఐశ్వర్యమును దేవతలు ధరించియున్నారు. తనలో తాను ఆనందించువానిని విషయ మృగతృష్ణ మోహింపజేయదు.

**అనువాదము:-**

అంగబలమ్ము నీకు వరదా! వృషభమ్మజినమ్ము భూతి ఖ
ట్వాంగము పుఱ్ఱె గొడ్డలి మహాహులు నింతియ కాని త్వత్కృపా

పొంగ విసృష్ట వైభవములన్య సురల్ ధరియింపరొక్కొ స్వా
సంగ సుఖాత్మునిన్ విషయసంగమెటుల్ భ్రమియింపఁజాలెడిన్॥

**వివరణము:**–(1) జీవులలో మనుష్యులు కుటుంబులుగా నుందురు. పురాణము లలో దేవతలును కుటుంబులుగానే వర్ణింపబడినారు. శచి అను భార్య, జయంతుడు అను కుమారుడు గల ఇంద్రుడు కుటుంబి. సూర్యుడు సంజ్ఞా ఛాయలను ఇరువురు భార్యలు, యముడు శనైశ్చరుడను ఇరువురు కుమారులు గల కుటుంబి. ఇట్లే పెక్కురు దేవతలు పురాణములలో కుటుంబులు గానే వర్ణింపబడినారు. సృష్టికర్త బ్రహ్మ సరస్వతి అను భార్య, నారదాది బహుపుత్రులు గల కుటుంబి. పాలనకర్త విష్ణువు, శ్రీదేవి, భూదేవి అను ఇద్దఱు భార్యలు లేక శ్రీదేవి,భూదేవి, నీలాదేవి అను ముగ్గురు భార్యలు, బ్రహ్మ, మన్మథుడు ఇద్దఱు. కుమారులు గల కుటుంబి. సృష్టి స్థితి కర్తల సృష్టి స్థితి లయములను, సర్వ లోకముల సర్వసృష్టి స్థితిలయకర్తల లయమునొనర్చు శివుడు గంగాపార్వతులు భార్యలు గణేశ స్కంధులు కుమారులుగా గల కుటుంబి. కుటుంబములు గల వారందరు కుటుంబపోషణకై ఏదో ఒక వృత్తి నవలంబింప వలసియుండును. రైతులు నాగలి మొదలగు కృష్యుపకరణముల ద్వారా ధనము నార్జించునట్లు, వైశ్యులు తులాది (క్రయ విక్రయ) సాధనముల (ఉపకరణముల) ద్వారా, క్షత్రియులు ఖడ్గాది (యుద్ధసాధన) కోపకరణముల ద్వారా కుటుంబముల పోషించుకొనుట లోకసిద్ధము. శివుడు (బ్రాహ్మణదేవత) భిక్షాచరణమునకై కావలసిన ఉపకరణముల మహోక్షాదులను కూర్చుకున్నాడు. భిక్షాచరణమున కుటుంబ పోషణ చేయదలచుకొన్నవారు గ్రామైక రాత్రముగా సకుటుంబముగా ప్రయాణము చేయుదురు. అట్లు చేయుటకు బండి నేర్పాటు చేసికొనెదరు. చిన్న కుటుంబమైనచో (అనగా భార్యాభర్తలు ఒకరిద్దఱు సంతానముగలదైనచో) ఒక గుఱ్ఱమో యెద్దో సరిపోవును. ఆ యెద్దు పెద్దదైనచో వెసులుబాటుగా నుండును. కావున శివుడు పెద్ద యెద్దునే సంపాదించుకొన్నాడు. సాధారణముగా గుఱ్ఱమునో యౌవనముననున్న ఎద్దునో సంపాదించు కొనలేనివారు వ్యవసాయమునకు అనగా కృషికి ఉపయోగించరాని ముసలి ఎద్దును సంపాదించు కొందురు. శివుడు పెద్దది సృష్ట్యాదినుండియు జీవించి యున్న యెద్దును అప్పటినుండి వాహనముగా చేసికొనియున్నాడు. దేవజాతికి చెందిన శివునకు ముసలితనము



లేకపోయినను ఎద్దు మాత్రము ముసలిదై పోయినది. అయినను అలవాటు పడినది, ఆరోగ్యవంతమునయిన ఆ యెద్దు శివకుటుంబమును మోయుచునే యున్నది. కైలాసము ప్రధానస్థానమైనను సాధారణముగా అలకాపురమునకు ఎక్కువగా పోవుచుండును. అలకాధిపతి ధనవంతుడే గాక శివునకు మిత్రుడు గూడ. అందుచేత అలకాపురమున ఆయన కుటుంబభరణమునకు కావలసిన భిక్షమును సంపాదించుట సుకరమని ఆ పట్టణమునకు దగ్గఱగానున్న కైలాస పర్వతమున నివసించు చుండును. కైలాస పర్వత ప్రాంతము సాధారణ జన వాసములకు దూరముగా అడవుల మధ్య నుండుటచే నది దుర్గమమే అయినను శివుడు భిక్షాచరణమునకు పట్టణ ప్రాంతములకో గ్రామ ప్రాంతములకో పోవునపుడు క్రూరజంతువులో రాక్షసులో దాడిచేయునవకాశమున్నది. అందుచేత ఖట్వాంగమును, గండ్రగొడ్డలిని పై రెండుచేతులలో క్రింది రెండుచేతులలో కపాలమును పాములను బట్టుకొని తిరుగుచుండును. పామును, కపాలమును ధరించుటచే జనులాతని చుట్టూ మూగుదురు. పాముల ఆట నాడించి వారికి సంతసమును కల్గించినందులకు వారధికముగా నాతనికి భిక్షమొసగుదురు. ఒడలి నిండ బూడిద పూసికొన్నప్పుడు దిగంబరులకు కొంత శీతబాధ తగ్గును. అయినను అది శీతబాధా నివారణమునకు చాలకపోవుటచే చర్మమును కప్పు కొనియేయుండును. ఇదియంతయు ఆ శివునకు తంత్రోపకరణము, తంత్ర మనగా జీవనోపాయము (భైక్ష్యము), దానికివియన్నియు ప్రత్యక్షముగానో (కపాలము) పరోక్షముగానో (ఆయుధములు, సర్పములు, భస్మాజినములు) ఉపయోగించునట్టివే. ఇంత పేదగానున్న శివుని సేవించి దేవతలెందఱో ఐశ్వర్య వంతులై జీవించుచున్నారు. వారి ఐశ్వర్యములన్నియు ఆయన కనుబొమ కదలించి ప్రసాదించినవే. వారలనందఱను ఐశ్వర్యవంతులనొనరించిన శివుడు మహైశ్వర్యవంతుడు గావలెను గదా! నిజమే, కాని ఆయనకు విషయమృగతృష్ణ లేదు. ఆయన తలచుకున్నచో దేవతలందఱకన్న ఐశ్వర్యవంతుడై దర్జాగా జీవించగలడు. ఆయనకు ఐశ్వర్యముల పట్ల ఏమాత్రమాసక్తి లేదు. విషయముల వలన యథార్థ సుఖము లభింపదని ఆతడెఱుగును. కావున స్వచ్ఛందముగా పేద జీవితము నవలంబించినాడు. తన కడ ఐశ్వర్యముల బిచ్చమడుగుకొని ఐశ్వర్యవంతుల మని విఱ్ఱవీగు వారిపట్ల అతనికి జాలి కలుగుచుండును.

అయ్యో! వీరు యథార్థ సుఖమైన కైవల్యమునర్థించక ఐశ్వర్యములనర్థించు చున్నారే అని ఆయనకు వారిపట్ల జాలి. శివుడేమో స్వాత్మ రాముడు. స్వాత్మానందమే కైవల్యము. అదియే స్వాత్మరమణము లేక స్వాత్మయే ఆయనకు ఆరామము, సంపూర్ణా నందము. అది అందఱిలో నున్నను దానిననుభవించుట యెఱుగక ఇతర విషయముల (దుఃఖములే అయ్యు సుఖరూపముగా భ్రమ కలిగించువాని) తృష్ణ కలిగియుందురు. వాస్తవమునకు వానియందు సుఖములేదు, వాని యను భవము వాస్తవసుఖము నీయదు అని యెఱిగిన శివుని ఎండమావుల వంటి విషయములు భ్రమింపజేయ జాలవు. నీరులేకున్న నీటికి విరుద్ధమైన వేడికలిగియున్న మృగతృష్ణ (ఎండమావి) క్షితిజరేఖయందు నీరున్నట్లు భ్రమింపజేయుటచే దప్పికొన్న మృగాలు దానికై పరుగులిడు చుండును. పఱుగు పెట్టిన కొలది తృష్ణ మరింత అధికమగునే కాని వానికి నీరు మాత్రము లభింపదు. అట్టి ఎండమావికాకారణమున మృగతృష్ణ అను పేరు కలిగినది. మృగమరీచికయను మరొక పేరు గూడ ఉన్నది. దూరముగా నున్న సూర్యకిరణములే మృగములకు జల భ్రాంతిని కలిగించును గాన మృగమరీచిక యని పేరు కలిగినది. (2) ఇది యంతయు శ్లోకమును పైపైన జూచిన కలిగిన అర్థము. అది వ్యావహారికార్థము మాత్రమే. శైవాగమముల ననుసరించి మోక్షమనగా పురుషుడు, శరీరములందు శయనించు ఆత్మ (జీవుడు) ఖట్వాఙ్గము (మంచము వలె పురుషుని సుఖముగా నిద్రింపజేయునది) అనగా ప్రధానము (జడప్రకృతి లేక మూల ప్రకృతి). పరశువనగా త్రిగుణాత్మక ప్రకృతి సమష్టి ప్రాణి కర్మ పరిపాకమున తన గుణసామ్యమును విడచి గుణ వైషమ్యమును పొందినపుడు ప్రకృతిలో ఏర్పడిన మొదటి వికారమైన (పరిణామమైన) మహత్తు. ఇందు గొప్పతనము అంతయు నా (లోని) దే అను నిశ్చయాత్మక జ్ఞానములు కలిగి రెండు శృంగములు గల అర్ధచంద్రాకారపు మొన కలిగిన పరశువును బోలుటచే పరశువును మహత్తునకు ప్రతీకమని భావింప నగును. అజినమనగా చర్మము కప్పుకొనుటకుపయోగించును. అది ఆత్మ కాకపోయినను దేహేంద్రియాదుల నాత్మగా భావింపజేయునహంకారమునకు ప్రతీకముగా భావింపనగును. భస్మ మనగా త్రసరేణువులవంటి కాలినవస్తువు యొక్క (చూర్ణము) కణముల సమూహము. అది సూక్ష్మత అను ధర్మము వలన



తన్మాత్రలకు (సూక్ష్మభూతములకు) ప్రతీకముగా భావింపనగును. పాములు పుట్టలో నుండి బయటకు వెడలి సంచరించి తిరిగి పుట్టలోనికి పోయినట్లు సూక్ష్మదేహమునుండి వెడలి విషయముల గ్రహించి వెనుకకు వచ్చి స్థూల శరీరమున ప్రవేశించును కావున పాములు ఇంద్రియములకు ప్రతీకముగా భావింపనగును. కపాలమనగా పుఱ్ఱె. అది పాంచ భౌతిక శరీరము కాలిపోగా అందులో మిగిలిన ప్రధానమైన ఎముక కావున స్థూల పంచభూతములకది ప్రతీకముగా భావింపబడదగినది.

(3)మహా+ఉక్ష అను శబ్దములు కలసి యేర్పడిన మహోక్ష శబ్దము శివ పక్షమున పెద్దయెద్దును బోధించగా, మహః అక్షమ్ అను శబ్దములుగా భావింప బడినప్పుడు విష్ణుపక్షమున తేజోరూపమైన చక్రము అను అర్థము నిచ్చును. శివ పక్షమున భస్మఫణినః అనునవి రెండు శబ్దములు. విష్ణుపక్షమున భస్మము వలె శుభ్రమైన (శరీరముగల) పాము (ఆదిశేషుని) యొక్క అను అర్థము నొసగును. శివపక్షమున అజినమ్ అనునది ప్రత్యేకమైన కప్పుకొను ఉపకరణము. విష్ణు పక్షమున పైన చెప్పబడిన ఆదిశేషుని యొక్క అజినము అని శేషసంబంధ్య జినముగా సమన్వయించుకోవలెను. శివపక్షమున ఖట్వాఙ్గమ్ (మంచపుకోడు) అనునది ఒకే పదము. విష్ణు పక్షమున ఖట్వా అనునది ఒక పదము, అఙ్గమ్ అనునది మరొక పదముగా భావించి పైన చెప్పబడిన ఆదిశేషుని చర్మమే మంచము అనగా శయ్య అని సమన్వయించుకోవలెను. శివపక్షమున కపాల మనగా పుఱ్ఱె. విష్ణుపక్షమున కమ్ అనగా శిరమును పాలః=పాలించునది అను వ్యుత్పత్తిననుసరించి దిండు అను అర్థమునొసగును. ఆదిశేషుని అంగమైన (ఉత్తమాంగమైన) శిరమే విష్ణువునకు దిండు అను అర్థమేర్పడును. లేక 'క' అనగా జలము దానిచేత పాలించబడునది అను వ్యుత్పత్తిననుసరించి శంఖమో, పద్మమో కపాలశబ్దము యొక్క అర్థమగును. ఆదిశేషుని అఙ్గము మంచము కాగా ఆయన చర్మము దానిమీద దుప్పటి అను అర్థము లభించును. విష్ణువు పరశుధారిగా ప్రసిద్ధుడు కాకపోయినను ఆయన పరశు రామావతారమున పరశువును ధరించినందున విష్ణువును పరశుధారి అని చెప్ప వచ్చును. కావున చక్రము వలె, శంఖము వలె, పద్మము వలె పరశువు కూడ విష్ణువునకుపకరణమే అని చెప్పవచ్చును. స్వాత్మారామమ్ అను పదమును స్వాత్మా+రామమ్ అను

రెండు పదములుగా విభజించి నాలుగవ పాదమునకు మరొక విధముగా వ్యాఖ్యానించ వచ్చును. స్వ అనగా ఆత్మ అదియే ఆత్మ అనగా స్వరూపము గలది అను విగ్రహముననుసరించి స్వాత్మా శబ్దము అవిద్య లేక మాయ అను అర్థము నొసగును. అది రామమ్ అనగా సచ్చిదానందరూపుడువైన నిన్ను విషయ మృగ తృష్ణ భ్రమింపజేయజాలదు. చక్రము మనస్సునకు ప్రతీకమని, శంఖము సాత్వికాహంకారమునకు ప్రతీకమని, పద్మము విష్ణువు ప్రకాశమునకు ప్రతీకమని విష్ణుపురాణమున చెప్పబడినది.

**అవతారిక:–** జీవ యాత్రకు ఉపకరణమైనట్లు జీవ సమష్టియైన ఈశ్వరుని బ్రహ్మాండశరీరములోని పై శ్లోకమున చెప్పబడిన పురుష ప్రధాన మహదహం కారేంద్రియ భూతములను ఏడు ఉపకరణములు తత్త్వములే, జగత్కుటుంబియైన ఈశ్వరునకు సృష్ట్యాది క్రియోపకరణములు అని గ్రహింపదగినది. పురుష ప్రధాన మహదాదులు గుప్తముగా శివునియందున్న ఇంతటి గొప్ప ఉపకరణములు శివుని మహైశ్వర్యమునకే సూచకములు. ఆయన సర్వ బ్రహ్మాండాధిపతి కావున బ్రహ్మాండములోని దేవాదిజీవులకు భిక్షము (కోరిన కోర్కె) ఈయగల్గిన సమర్థుడని 'వరద' అను సంబోధనము వ్యంజించును. పై శ్లోకమున పురుష ప్రధానాది భూతాన్త సప్త తత్త్వములు భగవద్విభూతిగా చెప్పబడినది. ఈ శ్లోకమున తత్సప్తక హేతుకమైన పాంచభౌతిక ప్రపంచము యొక్క నిత్యా నిత్యత్వాదివాదములు ప్రస్తావింపబడుచున్నవి.

***శ్లో॥***

***ధ్రువం కశ్చిత్సర్వం సకలమపరస్త్వధ్రువమిదమ్***
***పరో ధ్రౌవ్యాధ్రౌవ్యే జగతి గదతి వ్యస్తవిషయే।***
***సమస్తేఽ ప్యేతస్మిన్ పురమథన! తైర్విస్మిత ఇవ***
***స్తువఞ్జిహ్రేమి త్వాం న ఖలు నను ధృష్టా ముఖరతా॥ 9***

ధ్రువం–కశ్చిత్–సర్వం–సకలం–అపరః–తు–అధ్రువం–ఇదం–పరః –ధ్రౌవ్యాధ్రౌవ్యే–జగతి–గదతి–వ్యస్తవిషయే–సమస్తే–అపి–ఏతస్మిన్–పురమథన–తైః –విస్మితః–ఇవ–స్తువన్–జిహ్రేమి–త్వాం–న ఖలు–నను–ధృష్టా–ముఖరతా.

**ప్రతిపదార్థము:–** పురమథన=ఓ త్రిపుర మథనా!, కఃచిత్=ఒకానొకడు, ఇదమ్= దీనిని (జగమును), ధ్రువమ్=నిత్యమునుగా, సర్వమ్=అంతటిని, అపరః= మరొకడు, అధ్రువమ్=అశాశ్వతముగా, పరః=మరొకడు, ధ్రౌవ్యాధ్రౌవ్యే=నిత్యత్వా నిత్యత్వములు, జగతి=జగమున, వ్యస్తవిషయే=వేరువేరు విషయములుగలవిగా, గదతి=చెప్పును, సమస్తే=మొత్తము, ఏతస్మిన్=దీనియందు, తైః=వానిచేత, విస్మిత ఇవ=ఆశ్చర్యమునొందినవాని వలె, త్వామ్=నిన్ను, స్తువన్=స్తుతించుచు, న జహ్రేమి=సిగ్గుపడకయున్నాను, ఖలు=కదా, ముఖరతా=వాచాలత, ధృష్టా నను= సిగ్గులేనిది కదా!

**తాత్పర్యము:–** ఒకడు జగమంత నిత్యమనును, మరొకడనిత్యమనును, మరొకడు సర్వజగమున కొన్ని నిత్యములు, కొన్ని అనిత్యములు అనును. ఈ మూడు వాదములచే విస్మితుడనైన వాని వలె నిన్ను స్తుతించుచు సిగ్గుపడుటలేదు. మాటకారితనము సిగ్గులేనిది కదా!

**అనువాదము:–**

ఒకడు జగమ్మునిత్యమను నొక్కడనిత్యమను మఱొక్కడిం
దొకటి యనిత్యమౌను మఱొక్కడు నిత్యమటంచు బల్కు నీ
వికట మతి ప్రభేదముల విస్మయమందిన వాడవోలె ని
న్నికఁ బొగడంగ సిగ్గిలను ధృష్టత కాదొకొ నోరు విప్పినన్.

**వివరణము:–** (1) ఈ జగమంత నిత్యమను వాడు సాంఖ్యుడు. కుండ ఏర్పడక పూర్వమే ఉపాదాన కారణమైన మట్టి యందున్నది. పగిలిన పిదప ఉపాదాన కారణమైన మట్టిలోనే చేరుచున్నది. కావున కుండ వ్యక్తమగుటయే కాని కుండకు పుట్టుట అనునది లేదు. మట్టిలో నుండి వ్యక్తమయిన కుండ మట్టిలో చేరి అవ్యక్తమే యగుచున్నది. కావున కుండకు నాశము లేదు. కార్యమైన కుండ కారణమైన మట్టిలో నిదివరకేయున్నది అని అంగీకరించు సాంఖ్యులది సత్కార్య వాదము. ఇప్పుడు వ్యక్తమైన ఈ జగమంతయు ప్రళయమున అవ్యక్తమయిన అనగా ప్రకృతి యందు లీనమగును. తిరిగి సృష్టికాలమున అవ్యక్తములో నుండియే, వ్యక్తమగును. కావున ఈ జగమంతయు కార్య రూపమున వ్యక్త మైనను, కారణ రూపమున అవ్యక్తముగానున్నను అది నిత్యమే. సాంఖ్యులు ఈ జగమంతయు ప్రకృతి పరిణామమందురు. ఈ పరిణామమే వ్యక్త స్థితి నొందు నప్పుడు సృష్టి (పుట్టుక) అని అవ్యక్త స్థితినొందునప్పుడు నాశము అని

వ్యవహరింపబడినను వాస్తవమునకు నాశము పుట్టుక అనునవి ఏ వస్తువునకును లేవు. వీరి వాదము పరిణామవాద మనబడును. యోగుల మతము కూడ నిదియే. (2) ఈ జగమంత అనిత్యమను వాడు బౌద్ధుడు. ఈ జగమంతయు క్షణికమే. మనకు నిత్యమును లేక కొంతకాలముండునదిగా కనబడుట భ్రమ మాత్రమే. నది ఒడ్డున కూర్చొనియున్న వారి కందలి ప్రవాహము నిత్యమను భ్రమ కలుగును. వాస్తవముగా ఆ ప్రవాహము ప్రతిక్షణము వాని కన్నుల నుండి తొలగిపోవు చున్నను ఆ ప్రవాహము వలెనే కొత్తగా వచ్చు ప్రవాహము కనబడుటచే పోలిక వలన నీ భ్రాంతియేర్పడును. విచారించిన వానికి ఇది భ్రమయని తెలియును. అట్లే క్షణికములైన జ్ఞానముల ధారలో పోలిక గల పూర్వాపర వస్తువులు ఏకముగా నిత్యముగానున్నట్లు భ్రమించుటయే కాన నిత్యమనునది జగమున ఏదియు లేదు. జగమంతయు క్షణికమే. అట్లు అయినచో సదసద్వ్యవహారము లోని సదసత్తులకు భేదమేమియను ప్రశ్నకు అర్థక్రియాకారిత్వమే సత్తు యొక్క లక్షణము అంతేకాని నిత్యత్వము దాని లక్షణము కాదు అని సమాధానము చెప్పెదరు. ఒక క్షణమందు ఆ సత్తు అర్థక్రియాకారియై ఉత్తరక్షణమున అది అసత్తే అగును. ఒకవేళ పరమేశ్వరు నొప్పుకున్నను ఆయనయు క్షణికుడే. ఆ క్షణమున అర్థ క్రియాకారియై ఉత్తరక్షణమున అసత్తైపోవును. ఆయన నంగీకరించుట ఆ సత్తును పుట్టించుటకే కాని సద్వస్తువును స్థిరముగానుంచుటకు కాదు. మరొకడు ఆకాశ కాల దిశాత్మ మనస్సులు పృథివ్యాప్తేజోవాయు పరమాణువులు నిత్యములని, పృథివ్యాప్తేజో వాయు సంబంధద్వ్యణుకాది బృహత్పరిమాణాంత వస్తువులు అనిత్యములనియు చెప్పును. ఈ జగమున కొన్ని నిత్యములు కొన్ని అనిత్యములు అని, ధ్రౌవ్యా ధ్రౌవ్యములు (నిత్యానిత్యతలు) భిన్న వస్తు గతములనుట తార్కికుల వాదము. తార్కికులనగా నైయాయికులు మరియు వైశేషికులు. ఈ కార్యద్రవ్యము పుట్టకముందుండదని అనగా అసత్తని నశించిన తరువాత కూడ అసత్తే అని అనగా అది(కార్యము)ఉత్పత్తి వినాశములు గలదై యుండును అని చెప్పుట చేత వీరి వాదము అసత్కార్య వాదము ఉత్పత్తివాదము అని చెప్పబడును. పైన చెప్పబడిన క్షణిక వాద, పరిణామవాద, ఉత్పత్తివాదులెవరును పరమేశ్వరు డద్వితీయుండని నంగీకరించరు కావున వారీశ్వరుని సోపాధిక సంకుచితైశ్వర్యము



కలవానిగానే స్తుతించెదరని చెప్పవలెను. అట్టి స్తుతి సిగ్గును కలిగించునదియే. ఇందటిన్ని విధములుగా ఈశ్వరుని గూర్చి చెప్పుచుండగా ఏమియు ఎరుగని నేను స్తుతించుటకు సిగ్గుపడలేదనగా నా ధార్ష్ట్యము స్పష్టపడుననుటలో సందేహములేదని మరియొక విధముగా 'న ఖలు ననుధృష్టా ముఖరతా' అను చతుర్థపాదభాగము చెప్పునట్లు వ్యాఖ్యానింపవచ్చును. ఆ ధార్ష్ట్యము ఆ ఈశ్వరునిచే క్షంతవ్యమనియు పై వాదములన్నియు సత్యాభాసములే కాని సత్యములు కావని తనకు స్తుత్యుడైన పరమేశ్వరుడొక్కడే సత్యమనియు వ్యంగ్యమగును. సకార తకారావృత్తి బహువారముండుటచే ఈ శ్లోకమున వృత్త్యనుప్రాసాలంకారమేర్పడియున్నది. ఇట్లీ తొమ్మిది శ్లోకములలో స్తుత్యనుప పత్తులు శంకింపబడి పరిహరింపబడినవి. విస్మిత శబ్దము తాను విస్మితుని వలె ఎదుటివాడు పరిహసించునేమోయను శంకలేమిచే స్తుతికి తాను పూనుకొనెననుట వ్యంగ్యమగును.

**అవతారిక:–** ఈశ్వర సృష్ట జగద్విషయక వికల్పములు పైశ్లోకమున చెప్ప బడినవి. ఈ శ్లోకమున ఈశ్వరకృప చేతనే తత్సాక్షాత్కారము కలుగునని చెప్పబడుచున్నది. ఈ శ్లోకము మొదలు పరమేశ్వరుని పరిమిత గుణసాకార మహిమ వర్ణన మారంభింపబడుచున్నది.

***శ్లో।।*** ***తవైశ్వర్యం యత్నాద్యదుపరి విరిఞ్చిర్హరి రధః***
***పరిచ్ఛేత్తుం యాతావనలమనలస్కన్ధవపుషః।***
***తతో భక్తి శ్రద్ధాభరగురు గృణద్భ్యాం గిరిశ యత్***
***స్వయం తస్థే తాభ్యాం తవ కిమనువృత్తిర్న ఫలతి।। 10***

తవ–ఐశ్వర్యం–యత్నాత్–యత్–ఉపరి–విరిఞ్చిః–హరి–అధః–పరిచ్ఛేత్తుం –యాతౌ–అనలమ్–అనలస్కంధ–వపుషః–తతః–భక్తిశ్రద్ధాభరగురు–గృణద్భ్యాం –గిరిశ–యత్–స్వయం–తస్థే–తాభ్యాం–తవ–కిం–అనువృత్తిః–ఫలతి.

**ప్రతిపదార్థము:–** అనలస్కంధవపుషః=తేజః పుంజ శరీరివైన, తవ=నీ యొక్క, యత్=ఏ, ఐశ్వర్యమ్=ఐశ్వర్యమును, పరిచ్ఛేత్తుమ్=కొలచుటకు, యత్నాత్= యత్నము వలన, ఉపరి=పైకి, విరించి=బ్రహ్మ, అధః=కిందికి, హరిః=విష్ణువు లేక శేషుడు, యాతౌ=వెళ్ళినవారై, అనలమ్=అసమర్థులైరి, గిరిశ=కైలాసము

నందు లేక గోవర్ధనమునందు శయనించువాడా!, తతః=పిమ్మట, భక్తిశ్రద్ధాభర గురుగృణద్భ్యామ్=భక్తిచేత శ్రద్ధచేత గొప్పగా స్తుతించు, తాభ్యామ్=వారి ఇరువురి కొరకు,(తత్=ఆ, ఐశ్వర్యమ్=ఐశ్వర్యము),స్వయమ్=స్వయముగా, తస్థే=నిలచెను, తవ=నీయొక్క, అనువృత్తి=సేవ, న ఫలతి కిమ్=ఫలించదా!

**తాత్పర్యము:–** ఓ గిరిశా! తేజః పుంజ శరీరుడవైన నీ పైభాగము కొలుచుటకు బ్రహ్మ, క్రిందిభాగము కొలచుటకు విష్ణువు లేక శేషుడు పోయిన వారయ్యు కొలవలేకపోయిరి. వారు శ్రద్ధాభక్తులచేత స్తుతించిరి. అప్పుడు నీవు వారికి సాక్షాత్కరము ననుగ్రహించితవి.

**అనువాదము:–**

పావక యష్టి విగ్రహా! భవద్విభవమ్మును గొల్వ క్రింది మీ
దై వనజాక్ష ధాతలు స్వయత్నము చాలమి భక్తి శ్రద్ధయున్
భావము నింద నీ నుతులు బాడుచునుండుట కాదె నీదు సం
సేవఫలమ్ము నీ మహిత చిత్రచరిత్రము స్తోత్రపాత్రమౌ.

**వివరణము:–** (1) బ్రహ్మ, విష్ణువులు తన ఐశ్వర్యమే గొప్ప, తన ఐశ్వర్యమే గొప్ప అని వివదించుచుండగా శివుడు ఊర్ధ్వాధోభువనములు దాటిన అగ్ని స్తంభ రూపమున నిలచెను. ఆకాశవాణి ద్వారా 'మీలో నాక్రింది భాగమునో పై భాగమునో తెలుసుకొని వచ్చిన వాడే గొప్ప, వృథా వివాదములు మాని బయలుదేరుడు' అని వినిపించెను. బ్రహ్మ హంసరూపమున పైకి విష్ణువు లేక శేషుడు వరాహరూపమున క్రిందకు పోయియు ఊర్ధ్వాధోంతభాగముల తెలుసు కొనలేక పోయిరి. (2) అనువృత్తి అనగా సేవ. అది మానసికమైనచో శ్రద్ధ అనబడును. శారీరక మైనచో భక్తి అనబడును. ఏదైనను ఫలింపక మానదు. హరిబ్రహ్మలు గొప్ప వారలు కావున వారి స్తుతి గొప్పది అని 'భక్తి శ్రద్ధాభరగురు గృణద్భ్యాం' అను విశేషణములోని గురు శబ్దము సూచించును. నేనంత గొప్పగా స్తుతింపలేక పోయినను నా స్తుతిరూప వాఙ్మయసేవ కూడ ఫలించుట తథ్యము అను రచయిత విశ్వాసమిందు వ్యంగ్యము. మరియు హరి బ్రహ్మల ప్రయత్నము వ్యర్థమై యత్నము విరమించి నీ కృపకై ఎదురుచూచుచు స్తుతించుచుండగా, వారాశ్చర్యపడునట్లు, వారికి నీ గౌరీమనోహరరూపము



చూపి అనుగ్రహించితివి. వారిక స్తుతింపకుండుట ఎట్లు సంభవించునను అర్థమును వ్యంగ్యము. (3) విష్ణు పక్షమున హరియనగా శేషుడు. శేషబ్రహ్మలకు లక్ష్మీమనోహర రూపమున విష్ణువనుగ్రహించెనని, హరిశబ్ద శేషబలమున వ్యాఖ్యానించవచ్చును. (4) తాభ్యామ్ అనునది చతుర్థ్యంతముగా భావించినపుడు ఐశ్వర్యపదము కర్తయని గ్రహింపవలెను. అది తృతీయాంతమని భావించినపుడు తస్థే యనునది భావార్థక్రియయని విష్ణువిరించులు స్తుతించలేక తమ స్తుతిని విరమింపగా వారి అహంకార మణగిపోవుట గమనించిన శివుడు వారి ననుగ్రహించెనని శివ పక్షమున, శేష విరించులట్లే తమ స్తుతిని విరమింపగా వారి అహంకారమణగి పోవుట గమనించిన విష్ణువు వారి ననుగ్రహించెనని విష్ణుపక్షమున అర్థము చెప్పవచ్చును. (5) ప్రథమ, తృతీయ పాదములలో రేఫా వృత్తివలన వృత్యనుప్రాసాలంకార మేర్పడియున్నది. ద్వితీయ పాదమున అనలమనలమ్ అనుచోట యమకాలంకార మేర్పడియున్నది. (6) విష్ణుపక్షమున, శేష, బ్రహ్మలిరువురనేకముఖులు, శేషునకు వేయితలలు రెండు వేల నాలుకలతో స్తుతించుచు విష్ణువును స్తుతించలేనని సిగ్గుపడి విరమించెను. బ్రహ్మ సరస్వతీ పతియైనను తాను నాలుగు నాలుకలతోను స్తుతించుచు విష్ణువును స్తుతించలేనని సిగ్గుపడి విరమించెను అని వ్యంగ్యమగును. శివపక్షమున సర్వవిద్యాధార హయగ్రీవావతారధారియైన విష్ణువు నాలుగు ముఖములు (నాలుకలు) గల బ్రహ్మ స్తుతించలేక సిగ్గుపడి విరమించెననుట వ్యంగ్యము. కాయికసేవ (భక్తి), మానసికసేవ (శ్రద్ధ), వాచికసేవ (స్తుతి) చాల లేదను నిరహంకారత కల్గినప్పుడే భగవానుడనుగ్రహించి, సేవకు ఫలమిచ్చునని గ్రహించవలెను. (7) తేజః పుంజ రూపము హరి, విరించుల అహంకార నిరాసము కొఱకు చూపబడినది. ఆ తరువాత చూపబడినది గౌరీలక్ష్మీ మనోహర రూపము.

గృణద్భ్యామ్ అను శత్రంతవిశేషప్రయోగమునసరించి, ఇప్పటికి, హరి విరించులు స్తుతించుచునే యున్నారని, వారి స్తోత్రమాగలేదని మరొక విధముగ గూడ మూడవపాదమును వ్యాఖ్యానించవచ్చును.

**అవ:–** పై శ్లోకమున భగవత్కృతమైన హరి విరించ్యనుగ్రహము వర్ణింపబడినది. ఈ శ్లోకమున తత్కృతమైన బలిరావణానుగ్రహము వర్ణింపబడుచున్నది.

***శ్లో॥ అయత్నాదాపాద్య త్రిభువనమవైరవ్యతికరం***
***దశాస్యో యద్బాహూనభృతరణకణ్డూపరవశాన్।***
***శిరః పద్మశ్రేణీరచితచరణామ్భోరుహబలేః***
***స్థిరాయాస్త్వద్భక్తేస్త్రిపురహర! విస్ఫూర్జితమిదమ్॥ 11***

అయత్నాద్–ఆపాద్య–త్రిభువనం–అవైరవ్యతికరం–దశాస్యః–యత్–బాహూన్–అభృత–రణకండూపరవశాన్–శిరః–పద్మశ్రేణీ రచితచరణాంభోరుహ బలేః–స్థిరాయాః–త్వద్భక్తేః–త్రిపురహర–విస్ఫూర్జితం–ఇదమ్.

**ప్రతిపదార్థము:–** త్రిపురహర=ఓ త్రిపురహరా!, అయత్నాత్=యత్నము లేకయే, త్రిభువనమ్=ముజ్జగమును, అవైరవ్యతికరమ్=వైరసంబంధములేని దానినిగా, ఆపాద్య=లోబఱచుకొని, దశాస్యః=రావణుడు, రణకణ్డూపరవశాన్=యుద్ధపు దురదతో పరవశములైన, బాహూన్=భుజములను, అభృత=భరించినాడనుట, యత్ ఇదమ్=ఏదికలదో అది, శిరఃపద్మశ్రేణీరచిత చరణాంభోరుహబలేః= శిరములను కమలముల వరుసచే చేయబడిన పాదపద్మపూజగల, స్థిరాయాః =నిశ్చలమైన, త్వద్భక్తేః=నీ భక్తియొక్క, విస్ఫూర్జితమ్=ప్రభావము.

**తాత్పర్యము:–**అనాయాసముగా వైరక్రియ (యుద్ధము) చేయకయే ముజ్జగమును స్వాధీనమొనరించుకొన్న రావణుడు యుద్ధపు దురదతో పీడింపబడుబాహువులను మోయుట అనునది, తన తలలను కమలముల వరుసతో నీ పాదపద్మములను పూజించిన, నీ భక్తి ప్రభావమే.

**అనువాదము:–**

ఆహత శాత్రవమ్ము భువనావలి యత్నము లేక లోబడన్
బాహువులన్ రణప్రణయ భారములన్ దశకంఠుడూనుటు
త్సాహము తోడ శీర్షజలజమ్ములనీ పదపూజసేయగా
సాహసమిచ్చి ప్రేరణముసల్పిన నీ పదభక్తి శక్తియే

**వివరణము:–** (1) శివానుగ్రహమున రావణుడపార బల పరాక్రమాదుల సంపాదించినాడని వినిన త్రిలోకములలోని వీరులందఱు తమకు తామే రావణునకు కప్పము చెల్లించుటకు పూనుకోగా త్రిలోకములు యుద్ధము యొక్క అవసరము లేకయే రావణునకు స్వాధీనమయ్యెను. గొప్ప శివభక్తి గల రావణుడు



శివానుగ్రహమునకై తపముచేయుచు తన తొమ్మిది తలలను శివుని పాదములపై పుష్ప(పద్మ)ములుగా సమర్పించెను. ఇది అతని స్థిరమైన శివభక్తికి నిదర్శనము. ఇట్టి భక్తుడగుట వలననే త్రిలోకముల ననాయాసముగా అప్రయత్నముగా స్వాధీన మొనర్చుకోగలిగెను. (2) విష్ణు పక్షమున రావణుడు విష్ణు ద్వారపాలకుడైన జయుడు. బ్రహ్మ (సనకాదుల) శాపమున త్రేతా యుగమున రావణుడుగా జన్మించినాడు. వైకుంఠమున చేసిన విష్ణుసేవకు ఫలముగానే ఆ రావణునకీ త్రిలోకవిజయ మప్రయత్నముగా సిద్ధించినది. శిరఃపద్మశ్రేణీరచిత చరణాం భోరుహ బలేః అను సమాసమునకు బలేః అను పదమునకు బలి (అను రాక్షసుని) యొక్క అను అర్థము లభించును. ఆ బలి విష్ణ్వవతారమైన వామనునకు సమర్పించిన మూడడుగుల భూమిలో ఒక అడుగు తోడనే వామనుడు భూమిని నింపగా, రెండవ అడుగునకై స్వర్గమునొసగును. మూడవ అడుగునకై తన తలనే సమర్పించెను. ఆ బలితలపై విష్ణువు తన పాదపద్మమును మోపెను. శ్రేణి అనగా నిచ్చెన. నిచ్చెనపై కాలు మోపినట్లు బలి తలపై తన పాదకమలమును మోపిన వాడు అని బలిశబ్దమునకు పూర్వమున్న సమాసమునకర్థమేర్పడును. (3) అవైర వ్యతికరమ్, రణకణ్డూపరవశాన్, శిరః పద్మశ్రేణీరచిత చరణాం భోరూహ, స్థిరాయా, త్రిపురహర అనుపదబన్ధములలో రేఫావృత్తి ఉన్నది. కావున ఈ శ్లోకమున వృత్త్యనుప్రాసాలంకారమేర్పడియున్నది. (4) త్రిపురహర అను సంబోధనములోని త్రిపుర శబ్దము స్థూల, సూక్ష్మ, కారణ శరీర త్రయమును బోధించును. ఆ మూడింటిని బ్రహ్మజ్ఞానము కలిగించి నశింపజేయు భగవానుడు త్రిపురహరుడు. ఈ అర్థము ననుసరించి శివునితో పాటు విష్ణువును త్రిపురహర శబ్దము బోధించును. శివపక్షమున త్రిపురాసురులను సంహరించు కథ ప్రసిద్ధము.

**అవతారిక:–**పై శ్లోకమున బలిరావణులకు భగవంతుని పట్ల భక్తి కలిగి ఉండుట వలన కలిగిన త్రిలోకవిజయము చెప్పబడినది. ఈ శ్లోకమున భగవంతుని యెడ అవినయమును ప్రదర్శించినందువలన కలిగిన అప్రతిష్ఠ చెప్పబడుచున్నది.

***శ్లో॥ అముష్య త్వత్సేవాసమధిగతసారమ్ భుజవనమ్***
***బలాత్కైలాసేఽపి త్వదధివసతౌ విక్రమయతః।***

***అలభ్యా పాతాలే౽ ప్యలసచలితాఙ్గుష్ఠ శిరసి***
***ప్రతిష్ఠా త్వయ్యాసీద్ధ్రువముపచితో ముహ్యతి ఖలః॥ 12***

అముష్య–త్వత్–సేవాసమధిగతసారం–భుజవనమ్–బలాత్–కైలాసే–అపి–త్వత్–అధివసతౌ–విక్రమయతః–అలభ్యా–పాతాలే–అపి–అలస చలితాంగుష్ఠశిరసి–ప్రతిష్ఠా–త్వయి–ఆసీత్–ధ్రువం–ఉపచితః–ముహ్యతి–ఖలః

**ప్రతిపదార్థము:–**త్వత్సేవా సమధిగత సారమ్=నీ సేవవలన పొందబడిన బలము గల, భుజవనమ్=భుజముల సమూహమును, బలాత్=బలాత్కారముగా, త్వదధి వసతౌ=నీ నివాసమైన, కైలాసే అపి=కైలాసమునందును, విక్రమయతః= పరాక్రమింపజేసిన, అముష్య=వీనికి (రావణునకు), త్వయి=నీవు, అలసచలితా ఙ్గుష్టశిరసి=మెల్లగా కదలింపబడిన (కాలి) బొటనవేలికొన కలవాడవు కాగా, పాతాలే అపి=పాతాలమునందును, ప్రతిష్ఠా=ఉనికి, అలభ్యా=పొందరానిది, అసీత్=ఆయెను, ధ్రువమ్=నిశ్చయముగా, ఉపచితః=అభివృద్ధినొందిన, ఖల= ఖలుడు, ముహ్యతి ఖలు=మోహమునొందునుగదా!

**తాత్పర్యము:–** నీ నివాసమైన కైలాసమునందును తన భుజ పరాక్రమమును చూపుటకు బూనుకొనిన ఈ రావణునకు పాతాలములోనను ఉనికి దొరకని దయ్యెను. ఖలుడు అభివృద్ధినొందిన మోహమునొందును గదా!

**అనువాదము:–**

నీ చరణమ్ము గొల్వగ జనించిన శక్తి మదించుబాహులన్
నీచుడు పంక్తి కంధరుడు నీ గృహమున్ బెకలింప బూనగా
నీ చరణాగ్రచాలనము నిల్వగనీక రసాతలమ్మునన్
దాచెను వాని నీచునకు నైజము మోహము బుద్ధినందినన్.

**వివరణము:–** (1) రావణుడు శివానుగ్రహము చేతనే సమధిక భుజ బలవంతు డైనాడు. ఆ భుజబలముతో గర్వించి కృతఘ్నుడై ఆ శివుని తోడనే పోరాడబూని ముందుగా ఆయన నివాసమైన కైలాసమునే పెకలింపబూనినాడు. అప్పుడు శివుడు తన బొటనవ్రేలి కొన కదలించి అనగా దానితో కైలాసమును మెల్లగా నొత్త ఆ రావణుడు పాతాళమునందును నిలువలేనంత క్రిందకు పడిపోయెను. (2) విష్ణుపక్షమున కైలాసే అనునది విష్ణువు యొక్క సంబోధనము. కేలి అనగా



ఆట. కేలి ప్రయోజనముగా గలది కైలము. అసి అనగా కత్తి. ఎవనికి కత్తి క్రీడార్థమో వాడు కైలాసి విష్ణువొకచేత కత్తి ధరించును. సంకల్పమాత్రమున శత్రుసంహారము చేయగలిగిన విష్ణువునకు చేతనున్న కత్తి యుద్ధమున నుపయోగింపవలసిన అవసరము కలుగు అవకాశము లేదు. కేవలము వినోదము కొఱకే ఆయన చేత నాకత్తిని (నందకమను పేరు గలదానిని) ధరించి యున్నాడు. ఒకవేళ ఆ కత్తి నుపయోగించినను ఆ ఉపయోగించుట కూడ అతని వినోదమే. క్రీడయే. కావున విష్ణువు కైలాసే అని సంబోధింపఁబడినాడు. త్వదధివసతౌ=నీనివాసమునందు(త్రైలోక్యమునందు), బలాత్= బలాత్కారముగా, త్వత్సేవాసమధిగతసారమ్=నీ సేవచేత పొందబడిన సౌభాగ్యముగల, భుజవనమ్ =హస్తోదకమును, విక్రమయతః=ప్రతిగ్రహీత యగు వామనునకు (నీదని తన హక్కును వదలి హక్కును కల్పించుట త్యాగము) విక్రమింపజేయు, అముష్య= వీనికి (బలికి), త్వయి=నీవు, అలసచలితాఙ్గుష్ఠ శిరసి=మెల్లగా కదల్చిన కాలిబొటనవ్రేలి కొనగలవాడవు కాగా, పాతాలే+అపి= పాతాలమునందును, ప్రతిష్ఠా=ఉనికి, అలభ్యా=పొందరానిది, ఆసీత్=ఆయెను.

అపరాధములనొనర్చి కృతఘ్నుడైన బలిని శిక్షించుట ఈ శ్లోకమున చెప్పబడినది. ఈ త్రైలోక్యము ఈశ్వరునిదే అయిఉండగా నాదని మమకారమును చూపుట, ఈశ్వరునిదైన త్రైలోక్యము నీశ్వరునకు దానము చేయుట, దానము చేసినానని అహంకరించుట బలి అపరాధములు. భగవంతుడు బలిని స్వర్గ భూలోకముల నుండి తొలగించుట అను శిక్షను విధించెను. బలి చక్రవర్తి పాతాలమునాదని అహంకరించకపోవుటయే ఆయనకు పాతాలమున ఉనికి లేకపోవుట. మరొకవిధముగా ఈశ్వరునకు తన సర్వస్వమును సమర్పించు పుణ్యమున పాతాలముననున్నను ఇంద్రాదులకు లభించని ప్రతిష్ఠ అనగా కీర్తి కలిగినదని ప్రతిష్ఠా శబ్దమునకు కీర్తి అను అర్థము చెప్పుట ద్వారా వ్యాఖ్యానించవచ్చును. స్వర్గ భూలోకముల నుండి తొలగించి శిక్ష విధించిన పరమేశ్వరుడు పాతాలమున ఇంద్రాద్యలభ్యకీర్తిని ప్రసాదించుట అను, బలి పాపపుణ్యములకు తగిన ఫలముల నిచ్చినాడను అర్థము లభించుట ఇందు విశేషము. ఈ విధముగా బలిచక్రవర్తిని ఖలుడు అనుటకు వీలులేదు కావున నాలుగవ పాదమునందలి ఉత్తరార్ధమున భక్తుడు పుణ్య ఫలమును అభివృద్ధిని

గ్రహించిన లేక భగవాను డనుగ్రహించిన పిమ్మట ఖలుడై మోహించును అని భగవంతుని మనసులోని భావమును బోధించునదిగా వ్యాఖ్యానించవచ్చును. ఈ వ్యాఖ్యానమున తాను అనుగ్రహింపదలచిన వాని విత్తమును హరించునను పెద్దల మాటను సత్య మొనరించుచు, బలి యొక్క స్వర్గభూలోకాధిపత్యమును తొలగించుట అను అనుగ్రహమును పాతాలమున తాను ద్వారపాలకుడై తన సేవకుని తాను సేవించుట అను మహానుగ్రహమును చూపుట ద్వారా బలి చక్రవర్తికి సాటిలేని ప్రతిష్ఠను ప్రసాదించుట మరొక మహానుగ్రహమును చూపుట వ్యంగ్యములు. బలి ఐశ్వర్యమదమత్తతను నశింప జేసి, త్రైలోక్యాధిపత్యము వలన బలికి మోహము కలిగి పతితుడు కాకుండ అపరాధి బాగుపడుటకు తగిన శిక్ష నొసగి నాడనుట కూడ వ్యంగ్యమే. (3) శ్లోకమున సలకారముల బహువారావృత్తి వృత్త్యనుప్రాసాలంకారమునేర్పఱచినది. రావణుడు ఉపచితత్వమును పొంది ఉపకరించిన శివుని గృహమును పెకలించుట అను మోహము పొందుట అను విశేషమును, ఉపచితుడైన ఖలుడు మోహమును పొందును అను సామాన్యము చేత సమర్థింపబడుటచే నీ శ్లోకమున అర్థాంతరన్యాసాలంకారమేర్పడియున్నది.

**అవతారిక:**–పూర్వశ్లోకమున కృపాసాగరుడై ఉపకరించిన భగవానుని యందును కృతఘ్నతతో తమ ఔన్నత్యమును (ఔద్ధత్యమును) ప్రదర్శించిన బలిరావణులకు (తాత్కాలికమే అయినను) అథః పతనము కలిగిన వృత్తాంతము చెప్పబడినది. ఈ శ్లోకమున అట్లు ఔన్నత్యమును ప్రదర్శించనంతవరకు అనగా భగవానుని యందు అవనతిని ప్రదర్శించనంతవరకు ఔన్నత్యమును పొందిన ఇంద్రబాణుల వృత్తాంతము చెప్పబడుచున్నది.

శ్లో॥ *యదృద్ధిం సుత్రామ్ణో వరద! పరమోచ్చైరపి సతీ*
*మధశ్చక్రే బాణః పరిజనవిధేయస్త్రిభువనః।*
*న తచ్చిత్రం తస్మిన్ వరివసితరి త్వచ్చరణయో*
*ర్న కస్యా ఉన్నత్యై భవతి శిరసస్త్వయ్యవనతిః॥* **13**

యత్–ఋద్ధిం–సుత్రామ్ణః–వరద–పరమ–ఉచ్చైః–అపి–సతీం–అధః–చక్రే–బాణః–పరిజన విధేయః–త్రిభువనః–న–తత్–చిత్రం–తస్మిన్–వరివసితరి–త్వచ్చరణయోః–న–కస్యై–ఉన్నత్యై–భవతి–శిరసః–త్వయి–అవనతిః.



**ప్రతిపదార్థము:**– వరద!=వరములనొసగువాడా!, పరమా=పరమా! సుత్రామ్ణః =ఇంద్రుని యొక్క, ఉచ్చైః అపి=ఉన్నతముగానున్నదే అయినను, ఋద్ధిమ్= సంపదను, పరిజన విధేయః త్రిభువనః=విధేయ పరిజనముగానొనర్చిన త్రిభువనములు గల, బాణః=బాణుడు, అధః సతీమ్ చక్రే=క్రిందనున్న దానినిగా, చక్రే=చేసెను, (ఇతి) యత్=అనునది యేదో, తత్=అది, త్వచ్చరణయోః=నీ పాదముల యొక్క, వరివసితరి=నమస్కరించు, తస్మిన్=వానియందు, చిత్రమ్ న=చిత్రము కాదు, త్వయి=నీయందు, శిరసః=శిరస్సు యొక్క, అవనతిః =వంగుట, కస్యై=ఎట్టి, ఉన్నత్యై=ఉన్నతి కొరకు, న భవతి=కాకుండును.

**తాత్పర్యము:**– మిక్కిలి ఉన్నతముగా నున్నదైనను ఇంద్రుని సంపదను, మూడు లోకములను తన పరిజనముగా విధేయముగా నుండునట్లొనరించుకొన్న బాణుడు, క్రింద నున్న దానినిగా నొనర్చుట అనునది నీ పాదములకు నమస్కరించిన అతని యందు వింత కాదు. నీ చరణములపై శిరసు మోపిన వానికి ఎట్టి ఉన్నతియైనను కలుగకుండునా?

**అనువాదము:**–

త్రిభువన వాసులెల్లఱు విధేయులుగాఁ బరమోన్నతేంద్ర స
ద్విభవ మధఃకరించగల వింతవిభూతిని బాణుడున్ జగత్
ప్రభుపదసేవ నొందుట కెవడును నబ్బురపాటు జెందడో
యభవ భవత్పదామ్బుజ సమానతి నెవ్వడు పొందడున్నతిన్

**వివరణము:**– (1) ఇంద్రుడు త్రిలోకాధిపతి కావున ఆయనకున్నంత ఉన్నత సంపద మఱెవరికిని ఉండునవకాశము లేదు. బాణుడు శివునకు నమస్కరించి మూడు లోకముల వశమొనరించి కొని తనకు పరిజనమువలె విధేయములుగా నుండునట్లు చేసికొనెను. అప్పుడు ఇంద్రుని సంపదను మించిన సంపదను బాణుడు పొందుటచే బాణున కన్న పైనున్న సంపద క్రిందనున్న బాణునకు సంక్రమించినది. అప్పుడా సంపద క్రిందుగా చేయబడినది. ఇంద్రుడు ఊర్ధ్వలోక మైన స్వర్గమునకు అధిపతి. ఆయన ఉన్నచోట ఆయన సంపద ఉండును. కావున అది పైనున్న సంపద ఐనది. బాణుడు పాతాళవాసి. ఇంద్రుని జయించి ఆయన సంపదనంతయు పాతాళమున తన గృహమును నింపివైచినాడు. స్వర్గలోకము

నాక్రమించి అచటనే ఉండలేదు. ఇప్పుడా ఇంద్రసంపద క్రిందనున్నట్లు చేయ బడినది. అను అర్థవిశేషము ఉచ్చైరధస్సతీమృద్ధిమ్ అను పదములు వ్యంజించు చున్నవి. స్వర్గమున నున్న దేవతలందఱి సంపదయు పైనున్న సంపదయే. (కాని ఇంద్రుని సంపద ఆ దేవతల సంపద కన్న మిక్కిలి గొప్పది అను అర్థము పరమ శబ్దమును ఉచ్చైః అను శబ్దమునకు విశేషముగా చేసినచో లభించును.) బాణుడు దేవతలనే తనకు సేవకులుగా విధేయులుగా జేసికొన్నాడని అప్పుడు మిగిలిన భూపాతాలవాసులు ఆ స్థితినొందినారని పరిజనవిధేయస్త్రిభువనః అను సమాసము వ్యంజించును. ఇది యంతయు బాణుడు శివపాదములపై తల మోపుట యొక్క ఫలము. బాణుడే కాదు ఏవడైనను శివపాదములపై తల మోపినచో అట్టి స్థితినే పొందునని ఇందు వింతయేమియు లేదని ఉత్తరార్ధము తెలుపును. (2) విష్ణు పక్షమున సుత్రామ్ణః ఋద్ధిమ్ అని అన్వయింపక సుత్రామ్ణః బాణః అని సుత్రామ పదమునకు బాణ పదమునకు అన్వయించినచో ఎంతటి గొప్పవారి సంపదనైనను అధఃకరించగల సంపద ఇంద్రునకు భగవంతునిచే ప్రసాదింపబడినదను అర్థము లభించును. భూపాతాళములందలి రాక్షసు లందఱను ఇంద్రుడు ఒక బాణముతో వధించి పాతాలలోక సంపదనంతయు స్వర్గమునకు గొనిపోవుటచే ఉచ్చమైన ఇంద్ర సంపద పరమోన్నతమైనదని, నాయకులు చచ్చిపోగా మిగిలిన రాక్షసులందఱు భూలోకమును విడచి పాతాలమున దాగుకొనియుండుటచే ఇంద్రాధిక సంపద గల పాతాలలోక వాసుల సంపద ఇప్పుడు యథార్థముగా ఇంద్రుని బాణముచే అధఃకరింప బడినదను అర్థవిశేష మిక్కడ వ్యంగ్యమగును. లేక పైన క్రింద మాత్రమే ఉన్న ఇంద్రుని సంపద రాక్షస వధానంతరము భూలోకమందంతటను అన్ని దిక్కులకు వ్యాపించిన దానినిగా చేసెనను అర్థము వ్యంగ్యమగును. పర అనగా ఉత్కృష్ట మైన, మా అనగా సంపద (లక్ష్మి) గలవాడా! అని పరమ శబ్దమును విష్ణువునకు సంబోధనముగా చెప్ప వచ్చును. శివపక్షమున పరమ శబ్దము ఓ ఉత్కృష్టుడా! అను అర్థము నిచ్చు సంబోధనముగా కూడ చెప్పవచ్చును. (3) వంగినవారికి ఉన్నతి లభించుట విరుద్ధము కాని ఈ శ్లోకమున నాల్గవ పాదమున నమస్కరించిన బాణునకు కింద్రాధికసంపదలు కలుగుట అను 'విశేషము' ఎట్టి ఉన్నతినైనను శివపాద నమస్కృతి ఈయగలదను చతుర్థపాదాక్షిప్తమైన సామాన్యముచే సమర్థింప బడినందున అతిశయోక్తితో కూడిన అర్థాంతర



న్యాసాలంకారము ఈ శ్లోకమున నేర్పడియున్నది. ఇందు వృత్త్యనుప్రాసాలంకార మున్నది. (4) బాణునకింద్రుని మించిన సంపద అనునది శివపాదములందు తలను వంచి నమస్కరించుటకు అల్పఫలమే. వాస్తవమునకట్టి నమస్కృతి మోక్షమునే కలిగించునని కస్యై అను శబ్దము వ్యంజించును. అట్లే ఇంద్రునకు త్రైలోకాధిపత్యము అత్యున్నతమైన సంపదయు నశ్వరములే కావున ఇంద్రుడు కోరియుండినచో మోక్షమునే ప్రసాదించగల విష్ణుపాద నమస్కృతి వైభమును సైతమాశబ్దము వ్యంజించును. (5) ఇంద్రుడు వజ్రముతో రాక్షసవధ యొనరించుట ప్రసిద్ధము. బాణముతో సర్వరాక్షస సంహారమొనర్చుట ప్రసిద్ధము కాదు. ఇచట బాణశబ్దము వజ్రా యుధమున కుపలక్షకము. ప్రసిద్ధము కాకపోవుట అనునది ఇంద్రుడు బాణము ప్రయోగింపడని నిరూపింపదు.

**అవతారిక:–** పై శ్లోకమున బాణ త్రిభువన విజయము భగవత్ప్రసాదము అని వర్ణింపబడినది. ఈ శ్లోకమున బలీంద్రాదులందు భగవానుడొనరించిన ఉపకారము చెప్పబడుచున్నది.

**శ్లో॥** *అకాణ్డబ్రహ్మాణ్డక్షయచకితదేవాసురకృపా*
*విధేయస్యాసీద్యస్త్రినయన! విషం సంహృతవతః।*
*స కల్మాషః కణ్ఠే తవ న కురుతే న శ్రియమహో*
*వికారోఽపి శ్లాఘ్యో భువనభయభఙ్గవ్యసనినః॥* **14**

అకాండ–బ్రహ్మాండ–క్షయ–చకిత–దేవ–అసుర కృపా–విధేయస్య–ఆసీత్–యః– త్రినయనః–విషం సంహృతవతః–సః–కల్మాషః–కంఠే–తవ–న–కురుతే–న–శ్రియం–అహో–వికారః–అపి–శ్లాఘ్యః–భువన–భయ–భంగ–వ్యసనినః.

**ప్రతిపదార్థము:–** త్రినయన!=ఓ త్రినయనా!, అకాణ్డ బ్రహ్మాణ్డ క్షయ చకిత దేవాసుర కృపా విధేయస్య=అకస్మాత్తుగా బ్రహ్మాండ క్షయము (కలుగునేమోయని) వలన భయపడిన దేవాసురులందలి కృపకు వశుడవైన, విషమ్=విషమును, సంహృతవతః=సంహరించిన, తవ=నీ యొక్క, కణ్ఠే=కణ్ఠమునందు, సః=ఆ, కల్మాషః=మచ్చ, శ్రియమ్=శోభను, న కురుతే న=కలిగించలేదనుట లేదు, అహో=ఆహా!, భువన భయ భంగవ్యసనినః=లోకవ్యసనము పోగొట్టుట అను వ్యసనముగల వానికి, వికారః=వికారము కూడ, శ్లాఘ్యః=మెచ్చుకొనదగినదే.

**తాత్పర్యము:–** హఠాత్తుగా బ్రహ్మాండ క్షయము వచ్చిపడినదని భయపడిన దేవాసురలందలి దయకు వశుడవై విషము త్రాగిన నీకు కంఠమున నేర్పడిన మచ్చ శోభనే కలిగించుచున్నది. లోక భయమును పోగొట్టు వ్యసనముకల వానికి వికారమును మెచ్చుకొనదగినదే.

**అనువాదము:–**

అసమయమందు లోకవిలయమ్మగునంచు భయమ్మునందునా
యసుర సురాలియందు దయ నంది విసమ్ముతినన్ బ్రభూతమై
యెసగిన మచ్చ కణ్ఠమున కింపునె కూర్చెడు నార్తరక్షణ
వ్యసనునకున్ వికారమును వాసి యొసంగును శ్లాఘనీయమై

**వివరణము:–** బాణుని సృజించినవాడు అనగా కన్నవాడు బాణుని తండ్రియైన బలి బాణమును విసర్జించి రాక్షసులను సంహరించినవాడు ఇంద్రుడు. దేవతలకు ప్రభువైన ఇంద్రుడు రాక్షసులకు ప్రభువైన బలి తమ తమ అనుచరులతో కలసి పాల సముద్రమును మథించిరి. అమృతమునకై మథించగా అమృతము పుట్టుటకు ముందు కాలకూట విషము పుట్టెను. అది సమస్త బ్రహ్మాండ క్షయము కలిగించునేమో అను భయము దేవరాక్షసులకు కలిగించెను. దేవాసురులు శివుని ప్రార్థింపగా విషమును త్రాగి భువనభయభంగ మొనర్చెను. ఆ విషమును మ్రింగినచో తన లోపలి లోకములు నశించునని మ్రింగలేదు. బయటనున్న భువనములు నశించునని క్రక్కలేదు. కణ్ఠమునందుంచుకొన్న దాని తీవ్రతచే శివుని కణ్ఠము నల్లనయ్యెను. కణ్ఠమున విషము లోపలనున్న భాగమున నల్లని మచ్చ యేర్పడెను. ఆ మచ్చ కణ్ఠము యొక్క శోభను పెంచెనే కాని విరూపము కలిగింపలేదు. విష్ణుపక్షమున కృతయుగారంభమున అప్పుడప్పుడే దేవాసుర మనుష్యాది జీవులు సృష్టులై వృద్ధిచెందుచుండిరి. ఆ సమయమున హిరణ్యాక్షుడు భూ దేవాదుల హింసించుచు అకాండ బ్రహ్మాండ క్షయము కలుగునో యన్నంత భయము కలుగునట్లు విధ్వంసమును సృజించెను. దానిని చూచి రాక్షసులే భయపడినారనగా దేవతలు భయపడినారని వేరుగా చెప్పనక్కరలేదు. వాడేమి చేసినాడు? అని ప్రశ్న. సముద్రములోనికి దూకి భూమిని ముంచునంత జలము నెగజిమ్మినాడు. ఆ జలము భూమధ్య భాగమునకు వ్యాపింపకుండా విష్ణు వాదివరాహ రూపమున ఆ జలమంతయు తీరప్రాంతగతమైన మట్టితో కలసి



బురదయగునట్లు కాళ్ళతో త్రొక్కి ముట్టెతో కెలికి విషసదృశమైన ఉప్పుని సముద్ర జలము భూమిపైనున్న చెఱువులు కుంటలు బావులు మొదలగు జలాశయముల లోనికి చేరకుండా విషసదృశజలమును సంహరించెనని అప్పుడు బురద ఆదివరాహమూర్తి కోర యందు భూగోలమంతయున్నదా అనిపించునంత పెద్దదిగా నుండెను. ఆ ముద్ద నొకచోట నుంచగా కొన్నాళ్ళకది ఎండి సస్యానుకూల భూమిగ మారిపోయెను. ఇట్లు దేవాసురులను అనగా స్వాయం భువమన్వాది ప్రజలనందరిని దయతో కాపాడినాడు. అప్పుడందరు ఆది వరాహమూర్తిని ప్రశంసించిరి. ఆ స్తోత్రము వారి కంఠగతమై వారి కంఠమునకు శోభనే కలిగించుచుండెను. ఆ దృష్టితోనే హారములు కంఠమును తాత్కాలికము గానే శోభింపజేయును. మంచివాక్కు(స్తోత్రములు) విజ్ఞుల దృష్టిలో కంఠమునకు యథార్థమైన దీర్ఘకాలముండు అలంకారము. వర్ణింపబడు మచ్చ (మచ్చ యొక్క స్తోత్రము) స్తుతించువారి కంఠమునకలంకారమైనది. శ్వేతవర్ణుడైన ఆది వరాహమూర్తి కంఠమునందును అది ఆయనకు చంద్రునిలో కలంకమువలె ఆదివరాహమూర్తి కంఠమునకు అలంకారముగనే ఉండెను. సస్యానుకూలము గానే గాక యజ్ఞభూమి గాను ఆ భూమి ఉపయోగపడెను. పుష్కలముగా యజ్ఞముల, ప్రవర్తింపజేసిన ఆ శ్వేత వరాహమూర్తి యజ్ఞ వరాహమూర్తిగా కొనియాడబడెను. వేదములలో చంద్రునిలో మచ్చ యున్న భూమి భారతదేశము లోని గంగా సింధు మధ్య ప్రాంత భూమి దేవయజనమని కీర్తింపబడినది. వరాహమూర్తి యొనరించిన ఈ మహోపకారమునకు స్మారకముగా ఈ కల్పము శ్వేతవరాహకల్పముగా ప్రసిద్ధినందినది. దేవాసుర శబ్దము భూలోక వాసులైన స్వాయమ్భువమన్వాది మనుష్యాది ప్రాణులకుపలక్షకము. సూర్యు నందు హిరణ్యగర్భుని, చంద్రునందు లక్ష్మిని, అగ్నియందు యజ్ఞపురుషుని (విష్ణువును) ఉపాసించు ముగ్గుఱు ఉపాసకులను తన లోకమునకు గొనిపోవు వాడగుటచే విష్ణువు త్రినయన అనుపదముతో సంబోధింపబడినాడు. లేక మూడు లోకములను నయనమువలె ప్రకాశింపజేయువాడు కావున త్రినయన శబ్దముచే విష్ణువు సంబోధింపబడినాడు. (3) శివునకు మచ్చ అలంకారమగుట అను విశేషము భువన భయభంగ వ్యసనునికెవనికైనను వికారము అలంకారమే అను సామాన్యముచేత సమర్థింపబడినందున వివిధ వర్ణావృత్తి వృత్త్యనుప్రాసను

నేర్పరచు చున్నది. (4) భువనభయభఙ్గవ్యసనినః అను సమాసములోని వ్యసన శబ్దము భగవానుడు భువన భయమును పోగొట్టుట, వ్యసనముగా కలవాడు అను అర్థమునిచ్చుటచే జీవులు కోరినను కోరకున్నను భయమును పోగొట్టుచునే యుండునని పోగొట్టకుండ ఉండజాలడని వ్యంజించును.

**అవతారిక:–** పూర్వశ్లోకమున భగవత్కృత విషసంహరణము చెప్పబడినది. ఈ శ్లోకమున కామ (మన్మథ) సంహారోత్పత్తులు చెప్పబడుచున్నవి.

***శ్లో॥ అసిద్ధార్థా నైవ క్వచిదపి సదేవాసురనరే***
***నివర్తన్తే నిత్యం జగతి జయినో యస్య విశిఖాః।***
***స పశ్యన్నీశ! త్వామితరసురసాధారణమభూత్***
***స్మరః స్మర్తవ్యాత్మా న హి వశిషు పథ్యః పరిభవః॥ 15***

అసిద్ధార్థాః–న–ఏవ–క్వచిత్–అపి–సదేవాసురనరే–నివర్తంతే–నిత్యం–జగతి–జయినః–యస్య–విశిఖాః–సః–పశ్యన్–ఈశ–త్వాం–ఇతర–సుర సాధారణం–అభూత్–స్మరః–స్మర్తవ్య–ఆత్మా–న–హి–వశిషు–పథ్యః–పరిభవః.

**ప్రతిపదార్థము:–** జయినః=జయశీలుడైన, యస్య=ఎవనియొక్క, విశిఖాః= బాణములు, సదేవాసురనరే=దేవరాక్షసమనుష్యులతో కూడిన, జగతి=జగమున, క్వచిత్ అపి=ఎప్పుడును, నిత్యమ్=నియతముగా, అసిద్ధార్థాః=సిద్ధార్థములు కానివై, న నివర్తంతే=మరలవో, ఏవ=అలాగే, సః=ఆ, స్మరః=మన్మథుడు, ఇతరసుర సాధారణమ్=ఇతరదేవతలతో సమానునిగా, త్వామ్=నిన్ను, పశ్యన్=చూచుచు, స్మర్తవ్యాత్మా=స్మరింపదగిన శరీరముగలవాడు, అభూత్=ఆయెను, వశిషు= ఇంద్రియనిగ్రహము కలవారియందు, పరిభవః =అవమానించుట, న పథ్యః హి= హితము కాదు కదా!

**తాత్పర్యము:–** ఎవని బాణములు దేవరాక్షస మనుష్యులలో నెవని యందు ప్రయోగింపబడిన వానిని కామిగా మార్చకుండ వెనుకకు తిరిగి రాలేదో అట్టి మన్మథుడు ఇతర దేవతలవంటి వానినిగా నిన్ను భావించి బాణమును వదలి శరీరమునే కోలుపోయెను. ఇంద్రియనిగ్రహము కలవాని నవమానించుట హితము కాదు గదా!



**అనువాదము:–**

భువనములన్నిటన్ జయము పొందెదు నెవ్వని యమ్ములెన్న దా
నవ సురవీరులపైనబడిన విఫలత్వమునంది వెన్క కే
గవొ–ఘనుడాస్మరుండు నిను గాంచుచు నల్పసుపర్వ బు
ద్ధి విగత జీవుడయ్యె గద ధీర పరాభవమెట్లు మేలగున్.

**వివరణము:–** దేవతలలో శివుడు పరదేవత. దేవులలో మహాదేవుడు. ఆయన నితర దేవతలతో సమానముగా జూచుట అపరాధము. మన్మథబాణములు ఒకసారి బ్రహ్మ కామ దృష్టికి భయపడి లేడి రూపము ధరించి సరస్వతి పరుగిడు చుండగా ఆ లేడివెంట బడునట్లు బ్రహ్మకే కామతీవ్రత గలిగించెను. ఇంద్రుని ఋషి పత్నియైన అహల్యయందు కామము గల వానిగా నొనరించెను. ఇతర దేవ గంధర్వాసుర నరాదుల గూర్చి చెప్పనక్కరలేదు. ఇట్లు లోకమున అప్రతి హతముగ విజయపరంపరలో కృతకృత్యములై తిరిగి వచ్చిన బాణములను శివునందు గూడ ఇతర దేవ సాధారణ బుద్ధితో ప్రయోగింపగా ఆ మన్మథుడు దేహమే లేనివాడయ్యెను. సర్వమోహనమైన సుందరమైన అంగముల గల ఆ అంతరంగజుడు అనంగుడైపోయెను. ఇతర సాధారణమైన ఏదో ఒక లోపము గల అంగము లేదను అర్థము గల అనంగ శబ్దము పూర్తిగా సార్థకమగునట్లు అంగమే లేనివాడయ్యెను. ఆయన శరీరమంత యందము మరొకరి శరీర మందుండెడిది కాదు అని అందమునకు ఆదర్శమైన పరమ సుందరము అతి మనోహరము అయిన అతని అంగము భస్మావశిష్టమయ్యెను. స్మర్తవ్యమయ్యెను. స్మృతిశేషమయ్యెను. కీర్తి శేషమయ్యెను. సాధారణముగ ఇంద్రియ నిగ్రహము గల వశిష్ఠాదులయందే మన్మథుడు విఫలుడగుట సంభవించినది. పరాభవ మొందుటయు సంభవించినది. ఆ పరాభవమును మరచి తన బ్రహ్మాది విజయమునే స్మరించుకొనుచు విఱ్ఱవీగుచు ఇంద్రుడి ముందు శివుని తప్పక కామి నొనరించెదనని ప్రగల్భములు పలికి చివరకు అనంగ నామావశేషు డయ్యెను. శివుని పరాభవించెద ననుకొని తానే పరిభూతుడయ్యెను. సాధారణ మహర్షుల మోహింపజేయ యత్నించిన రంభాదుల కేగతి పట్టినదో గమనింపక ఇతర సుర సాధారణునిగా శివుని భావించి స్మర్తవ్యాఙ్గుడయ్యెను. స్మర్తవ్యాత్ము డయ్యెను. వసంతాదులు ఈ శ్లోకము పూర్వార్ధము యొక్క మన్మథుని

శరములెప్పుడును ఏ సురుని యందు గాని, ఏ నరుని యందు గాని, అసురుని యందు గాని కామము గలిగింపకుండ విఫలము కాలేదు అను అర్థమును ఇచ్చు పూర్వార్ధమునే మాటిమాటికాతని ముందు వల్లించుచు, భట్రాజులవలె పొగడుచు మునగచెట్టెక్కించుచు ఆతనికున్న గర్వమును మరింత పెంచిరి. రతీదేవి చేసిన హెచ్చరికలను గూడ పెడచెవిన పెట్టునట్లొనరించిరి. ఇప్పుడు లోకమున మహర్షుల జోలికి పోరాదని స్పష్టమైనది. వారి జోలికి పోవుట వారిని పరాభవించుట పరిభవించు వారికి మేలు కాదు, పథ్యము కాదు అని తెలిసి వచ్చినది. అట్లు తెలిసివచ్చునట్లు శివుడొనరించినాడు. (2)విష్ణుపక్షమున పూర్వము స్మర్తవ్యాత్ముడైన స్మరుడు త్వామ్=నిన్ను, పశ్యన్= జూచుచు, నీకు సాధారణము అనగా తుల్యమైన రూపము కలుగునట్లుగా అభూత్ అనగా పుట్టెను. ఇతర=(అసాధారణుడా) విలక్షణుడా? సుర=ఓ దేవా అని ఇతరసుర శబ్దములు విష్ణు సమ్బోధనములుగా సమన్వయించుకొనవలెను. సాధారణముగా తండ్రి పుట్టగానే కుమారుని జూచును. కాని ఇచట తండ్రియైన విష్ణువును చూచుచు స్మరుడు పుట్టెనని చెప్పబడినది. తండ్రి కుమారుని చూచుచున్నప్పుడు మరొకరక్కడ సూతికాగృహమున లేకుండుటచే పుత్రుడు కూడ తండ్రిని చూచును. ఈ అంశము నిన్ను జూచుచు పుట్టెనని ఈ శ్లోకమున చెప్పిన వాక్యమున కర్థముగా భావింపవలెను. వశిషు అనగా జితేంద్రియులందు పరిభవః అనగా కామము (పరిభవించునది గాన కామము శ్లోకమున పరిభవ శబ్దమునకర్థము) నపథ్యః హి=మేలైనది కాదుగదా! కామము (కాముడు) సర్వ సంసార బన్ధ హేతువు. నీవే (విష్ణువే) మో సంసార విచ్ఛేద హేతువు. నీకును అతనికి (కామునకు) రూపమునందు పోలికయున్నను స్వభావమునందు పోలిక లేదనుట తథ్యము. వేదము కూడ భగవానుని కెవడు సముడు కాని అధికుడు కాని లేడనియే చెప్పుచున్నది. ఆ శ్రుతి యొక్క అర్థము నాల్గవ పాదమున కామార్థక పరిభవ శబ్దము వ్యంజించును. (3) సదేవాసురనరే, జగతి జయినః, ఇతరసుర సాధారణమ్, స్మరఃస్మర్తవ్యాత్మా, పథ్యః పరిభవః ఇత్యాది పదబన్ధములలో వృత్త్యనుప్రాసమున్నది. వశియైన శివునిచే కామ పరిభవము అను విశేషము వశులందు పరిభవము పథ్యము కాదు అను సామాన్యముచే సమర్థింపబడుటచే నర్థాంతరన్యాసాలంకారమేర్పడి యున్నది.



**అవతారిక:–** పై శ్లోకమున లోక క్షేమంకర కర్మ యందు కలిగిన వికారము కూడ హరిహరులకు శోభనే కలిగించునని చెప్పబడినది. ఈ శ్లోకమున వారి నర్తనశీలత వర్ణింపబడుచున్నది.

**శ్లో॥** ***మహీ పాదాఘాతాద్వ్రజతి సహసా సంశయపదమ్***
***పదం విష్ణోర్భ్రామ్యద్భుజపరిఘరుగ్ణగ్రహగణమ్।***
***ముహుర్ద్యౌర్దౌస్థ్యం యాత్యనిభృతజటాతాడితతటా***
***జగద్రక్షాయై త్వం నటసి నను వామైవ విభుతా॥*** ***16***

మహీ–పాద–ఆఘాతాద్–వ్రజతి–సహసా–సంశయపదం–పదం–విష్ణో–భ్రామ్యత్ –భుజ–పరిఘరుగ్ణగ్రహ గణం–ముహుః–ద్యౌః–దౌస్థ్యం–యాతి –అనిభృత–జటాతాడితతటా–జగత్–రక్షాయై–త్వం–నటసి–నను–వామా –ఏవ–విభుతా.

**ప్రతిపదార్థము:–** మహీ=భూమి, పాదాఘాతాత్=పాదముల తాకిడి వలన, సహసా=వెంటనే, సంశయపదమ్=సంకటమును, వ్రజతి=పొందుచున్నది, విష్ణోః పదమ్=ఆకాశము, భ్రామ్యద్భుజపరిఘరుగ్ణగ్రహగణమ్=తిరుగుచున్న భుజముల ప్రాకారముల చేత జబ్బుపడిన గ్రహముల సమూహము గలదై (సంకటమును పొందుచున్నది), ద్యౌః=స్వర్గము, అనిభృతజటాతాడితతటా=వెలికివచ్చిన జడల తో కొట్టబడినప్రాంతములుగలదై, దౌస్థ్యమ్=సంశయమును (సంకటమును) యాతి=పొందుచున్నది, త్వమ్=నీవు, జగద్రక్షాయై=జగద్రక్షణము కొఱకు, నటసి నను=నటించుచున్నావు గదా!, విభుతా=ప్రభుత, వామా ఏవ= వక్రత (వంక) గలదియే!

**తాత్పర్యము:–** శివుడు నాట్యము చేయుచుండగా ఆయన పాదముల తాకిడికి భూమి బద్దలగునా? భుజ పరిఘముల తాకిడికి గ్రహ నక్షత్రముల గుంపులు జబ్బుపడి నశించునో! స్వర్గము యొక్క ఉన్నత ప్రాంతములు జడల తాకిడికి కొట్టబడుచున్నవో? అను సంశయస్థానములను పొందుచున్నవి. ప్రభుత వక్రత గలది గదా!

**అనువాదము:–**

మహి పదఘట్టనముననె ప్రమందునో? విష్ణుపదమ్ము త్వద్భుజా
గ్రహణ భయాకుల గ్రమత క్రందునో? యున్నతమౌ దివంబునున్

ముహురభితో జటాహతులఁ బ్రుంగునో? లోకరిరక్షతాండవం
బహహ! యొనర్చెదో వినిహతారి! విభుత్వము వామమేకదా!

**వివరణము:-** (1) జగ్రద్రక్షణము కొఱకు నీవు నాట్యము చేయుచున్నను జగత్తులను సంకటములలో బడవేయుచుండుట నీ తప్పు గాదు. నీ అధికారము యొక్క తప్పు. రాజు శ(త్రు సంహారము కొఱకు సైన్యముతో బయలుదేరు చున్నప్పుడు కొంత దేశోపద్రవము కూడ కలుగుచుండును. నీ ఏలుబడిలోని ప్రాంతములు నీ పాదముల తాకిడికి బద్దలై పోవునేమో అన్నంత గట్టిగా భూమికి తాకుచున్నవి. భూలోక వాసులు భూకంపము కలుగుచున్నదేమో అని భయపడు చున్నారు. భూమి ప్రళయకాలమున కంపించునంత తీవ్రముగా కంపించుటచే భూలోక వాసులు తమ జీవితములపై ఆశ విడచుకొనుచున్నట్లు అనిపించు చున్నది. అంతరిక్షమున గ్రహగణములు నీ భుజముల పరిఘలచే కొట్టబడి ప్రకాశమును కోలుపోవుచున్నవి. నీ జడలు స్వర్గమునే అతలాకుతలము చేయుచున్నవి. ఇట్లు మూడు లోకములకు భీతియే కలుగుచున్నది. ఇంతకు ఒక మహారాక్షసుని చేత జగద్ధ్వంసము కలుగకుండ రక్షించుట కొఱకే వానిని మోహపెట్టుట కొఱకే నీవు నాట్యము చేయుచున్నను నీ నాట్యము వానిని మోహపెట్టు మాట యేమో గాని ముందు నీ నాట్యము ప్రలయము కలిగించు నట్లున్నది. ఆ రాక్షసుని బాధలనుండి కాపాడుమని మొరపెట్టుకొనుట మాదే తప్పనిపించుచున్నది. మృత్యుకరమైన రోగమును నశింపజేయుటకు వైద్యుడు చేదుమందిచ్చునపుడు రోగి రోగము వలన బాధ తగ్గునో లేదో కాని ముందీ మందు మ్రింగలేకున్నామన్నట్లు మేము నిన్నాక్షేపించుచున్నను నీవు లోక రక్షణమునకై ఆ రాక్షసుని మోహపెట్టు నాట్యమును మానుకొందువా? నీవు మా ప్రభుడవు గావున నీయీ నాట్య తీవ్రతను మేము సహింపవలసినదే. (2) విష్ణు పక్షమున ఆఘాతాత్=పూర్తిగా నశింపజేయు, మహీపాత్=రాజు వలన, సా=ఆ భూమి, సంశయపదమ్=సంకటమును, వ్రజతి=పొందుచున్నది. అనగా హింస కులైన రాజులు విజృంభించుచున్నప్పుడు పరశురామ వేషము ధరించెదవు. గ్రహములనగా యజ్ఞపాత్రలు. అవి దుష్టులచే భుజ పరిఘలతో పాడుచేయ బడుచున్నవి. అనగా విష్ణు నివాసములని చెప్పదగిన దేవాలయములు యజ్ఞ శాలలు మొదలగునవి ధ్వంసము చేయబడుచున్నప్పుడు వరాహాది వేషము



ధరించెదవు. అనిభృతజటులనగా ఇష్టము వచ్చినట్లు హిప్పీలవలె జుట్టుపెంచు కొని తిఱుగు పాఖండులు. అట్టి పాఖండుల వలన స్వర్గము కొట్టబడినది. అనగా ఆలోకమునకు పోవువారే లేరు. పాఖండుల మాటలకు భ్రమించి వేదవిశ్వాసులు యజ్ఞములమానుటచే నీ దుఃస్థితి దౌఃస్థ్యమేర్పడినది. సత్యవచనులు లేకపోవుటచే సత్యలోకమే కొట్టబడినట్లున్నది. వైకుంఠమునే అంగీకరించనివారు స్వర్గలోక సత్యలోకములనంగీకరించెదరా యేమి? ఇట్టి పరిస్థితులలో కల్కి వేషము ధరించెదవు. ఇట్లు నీవు వివిధ వేషములతో నటునివలె ఆడుచున్నావు. నటుని వలె ఆచరించుచున్నావు. అని నటసి పదము బోధించును. విష్ణువుగానే ఈ పనులన్నియు చేయరాదా? అని నిన్నెవరడుగుదురు. అడిగినచో నా యిష్టమని చెప్పెదవేమో? నీ అధికారమునెవరు ప్రశ్నింపగలరు. అధికారము వక్రత గలది గదా! (3) 'సహసా సంశయ పదమ్' భ్రామ్యద్భుజ, పరిఘరుగ్ణగ్రహగణమ్, 'ద్యౌర్దౌఃస్థ్యమ్', 'యాత్యనిభృత జటాతాడిత తటా' అను పదబన్ధములలో వృత్త్యనుప్రాసాలంకారమేర్పడియున్నది.

**అవతారిక:-** పై శ్లోకమున హరిహరప్రభువుల వామత వారి నాట్యము ద్వారా సిద్ధమైనట్లు చెప్పబడినది. ఈ శ్లోకమున వారిచే చేయబడిన గంగోద్ధార ధారణములు చెప్పబడుచున్నవి.

***శ్లో॥ వియద్వ్యాపీ తారాగణగుణితఫేనోద్గమరుచిః***
***ప్రవాహో వారాం యః పృషతలఘుదృష్టశ్శిరసి తే।***
***జగద్ద్వీపాకారం జలధివలయం తేన కృతమి***
***త్యనేనైవోన్నేయం ధృతమహిమ దివ్యం తవ వపుః॥ 17***

వియద్వ్యాపీ–తారాగణగుణితఫేన–ఉద్గమరుచిః–ప్రవాహః–వారాం–యః –పృషత–లఘుదృష్టః–శిరసి–తే–జగద్–ద్వీపాకారం–జలధివలయం–తేన– కృతం–ఇతి–అనేన–ఏవ–ఉన్నేయం–ధృతమహిమ–దివ్యం–తవ–వపుః.

**ప్రతిపదార్థము:-** వియద్వ్యాపీ=ఆకాశమును వ్యాపించు, తారాగణగుణిత ఫేనోద్గమరుచిః=నక్షత్రగణములచేత రెట్టింపైన నురుగు చిన్న చిన్న బుడగలు వెడలుట యొక్క కాంతిగల, వారామ్=జలముల యొక్క, ప్రవాహః=ప్రవాహము, తే=నీ యొక్క, శిరసి=శిరమున, పృషత లఘు=బిందువువలె చిన్నదిగా, దృష్టః

=చూడబడినది, తేన=దానిచేత, జలధివలయమ్=సముద్రముతో చుట్టబడిన, జగత్=భూమి, ద్వీపాకారమ్=ద్వీపము యొక్క ఆకారము గలదిగా, కృతమ్=చేయబడినది, ఇతి అనేన=అనుటచేత, ధృతమహిమ=ధరింపబడిన మహిమ గల, దివ్యమ్=దివ్యమైన, తవ=నీ యొక్క, వపుః=శరీరము, ఉన్నేయమ్=ఊహింపదగినది.

**తాత్పర్యము:–** ఆకాశమునంతను వ్యాపించు నక్షత్రగణములచే రెట్టింపు చేయబడిన చిన్నచిన్న బుడగల బయలుదేరు, కాంతిగల జలముల సమూహము నీ శిరమున బిందువువలె చిన్నదిగా చూడబడినది. దానిచేతనే జలధులచే చుట్టబడిన ఈ భూమి దీవిగా చేయబడినదని ఒకమాట చెప్పినచో నీ దివ్య శరీరము యొక్క మహిమ నూహించుకొనవచ్చును.

**అనువాదము:–**

గగనము గ్రమ్మి ఋక్షగణ కాంతి వివర్ధిత ఫేనజాతమై
జగతిని జుట్టి ద్వీపముగ సల్పినయట్టి మహాజలౌఘ మా
పగ జలబిందు మాత్రముగ త్వచ్ఛిరమందు గనంబడెన్ దలం
పగదగు నింతమాత్రమున త్వన్మహిమాన్విత దివ్యదేహమున్.

**వివరణము:–** ఆకసమునంతను వ్యాపించి తన నుఱుగులతో నక్షత్రముల కాంతిని పెంచిన ఆకాశగంగ నీ తలపై చిన్న బిందువుగ గనబడినది. ఆ ఆకాశ గంగయే భగీరథుని వెంట భూలోకమునకు దిగివచ్చి జహ్నుఁది మహామునుల ఆశ్రమాది ప్రదేశములనుంచి ఈ విశాల పృథివి చిన్నదిగా గనబడునట్లు చేయగలిగినది. ఆ భాగీరథి భోగవతియై పాతాలమున కేగి సముద్రముల నింపి వైచినది. ఇట్లు గంగ త్రిపథగయై మూడులోకముల నాప్లావితము నొనరించినంత జలముగల దైనను నీ తలపై చిన్న నీటి చుక్కవలె కనబడినదనగా నీ శరీరమెంత పెద్దదో ఊహించుకొనవలసినదే కాని ఎవరికిని చూడశక్యమైనది కాదు.(2) విష్ణుపక్షమున బలి ఛలనమునకై వటువుగా అవతరించిన విష్ణువు అవతారమైన వామనుడు తన పాదమున భూమినంతను వ్యాపింపగా రెండవ పాదము నాకాశమున వ్యాపింపజేసినప్పుడా పాదము యొక్క శిరమున అనగా పై లోకములలోనొక లోకమగు సత్యలోకమున బిందువుగా నున్న ఆ గంగయే మూడు లోకములలో



మూడు పేర్లతో ప్రసిద్ధమై లోకముల జలావసరముల తీర్చుచున్నది. విష్ణువు బలిని మభ్యపెట్టి మూడు అడుగుల దానమును స్వీకరించి రెండవపాదము నాకాశమున కెత్తినపుడు బ్రహ్మాండావరణమైన పృథివికి రంధ్రము పడినది. దానిపై ఆవరణము జలావరణము కనుక ఆ బ్రహ్మాండ పృథ్వ్యావరణ రంధ్రము నుండి బ్రహ్మాండ జలావరణ జలమా విష్ణుపాదమున నుండి మెల్లగా బ్రహ్మాండము లోనికి, మొదట ఆకాశము లోనికి వచ్చి ఆకాశగంగగా, భూమిలో జాహ్నవ్యాదినామముతో, పాతాలమున భోగవతిగా ప్రసిద్ధిచెందినది. (3) అగస్త్యుడు సముద్రజలములన్ని త్రాగగా మరల ఆ సముద్రములన్నీ శివుని శిరమునుండిగాని విష్ణుపాదమునుండిగాని వచ్చిన గంగ చేతనే నింపబడినట్లు పురాణములలో గాథలున్నవి. (4) 'గణగుణిత' అను పద బన్ధమున అనుప్రాస భేదమైన ఛేకానుప్రాసమున్నది. 'వియద్వ్యాపీ, ప్రవాహో వారాం, జలధి వలయమ్' అను పదబన్ధములలో అనుప్రాస భేదమైన వృత్త్యనుప్రాసమున్నది. జగద్ద్వీపాకారం జలధి వలయమ్ తేన కృతమితి అను మూడవ పాదమున దాక్షిణాత్యమైన వర్ణమైత్రి ఉన్నది.

**అవతారిక:–** పై శ్లోకమున శివకేశవుల శిరఃపాదములలోని గంగ యొక్క గొప్పతనము ద్వారమున వారి శరీరమహత్త్వము చెప్పబడినది. ఈ శ్లోకమున వారి త్రిపుర లంకా దాహ వృత్తాంతము చెప్పబడుచున్నది.

***శ్లో॥ రథః క్షోణీ యన్తా శతధృతిరగేన్ద్రో ధనురథో***
***రథాఙ్గే చన్ద్రార్కౌ రథచరణపాణిశ్శర ఇతి।***
***దిధక్షోస్తే కోఽయం త్రిపురతృణమాడమ్బరవిధి***
***ర్విధేయైః క్రీడన్త్యో న ఖలు పరతన్త్రాః ప్రభుధియః॥ 18***

రథః–క్షోణీ–యంతా–శతధృతిః–అగేంద్రః–ధనుః–అథ–ఉ–రథాంగే–చంద్రార్కౌ–రథచరణ పాణిః–శర–ఇతి–దిధక్షోః–తే–కః–అయం–త్రిపురతృణం–ఆడంబర విధిః–విధేయైః–క్రీడంత్యః–న–ఖలు–పరతంత్రాః–ప్రభుధియః.

**ప్రతిపదార్థము:–** రథః=రథము, క్షోణీ=భూమి, యన్తా=సారథి, శతధృతిః=బ్రహ్మ, ధనుః=ధనువు, అగేన్ద్రః=పర్వతరాజు (మేరువు), రథాఙ్గే=చక్రములు, చన్ద్రార్కౌ=సూర్యచంద్రులు, రథచరణపాణిః=రథాఙ్గపాణి (విష్ణువు), శరః=

బాణము, ఇతి=అని, త్రిపురతృణమ్=త్రిపురములు అను గడ్డిని, దిధక్షోః=కాల్ప దలచిన, తే=నీకు, అయమ్=ఈ, ఆడమ్బర విధిః=ఆర్భాటము, కః=ఏమి, విధేయైః=తమవారిలో, క్రీడన్త్యః=ఆడుకొనుచుండు, ప్రభుధియః=ప్రభువుల బుద్ధులు, న పరతన్త్రాః ఖలు=పరతన్త్రములు కావు గదా!

**తాత్పర్యము:–** రథముగా భూమిని, సారథిగా బ్రహ్మను, ధనువుగా మేరువును, చక్రములుగా సూర్యచంద్రులను, బాణముగా విష్ణువును చేసికొను నీ ఆడంబరము త్రిపురములు అను గడ్డిని కాల్చదలచిన నీకెందుకు? ప్రభువుల బుద్ధులు తమ విధేయులతో నాడుకొనుచుండునే కాని అవి పరతంత్రములు కావు.

**అనువాదము:–**

రథ మిల యంత బ్రహ్మ కుధరమ్ము శరాసము చంద్రసూర్యులే
రథ చరణమ్ము లాహరి శరమ్మగు త్రైపురదాహమందు నీ
ప్రథన విడంబనమ్మిది స్వభక్త విధేయులతోడ క్రీడయే
ప్రథితము లీశ్వరేచ్ఛలు హరా! పరతంత్రములై యెసంగునే.

**వివరణము:–** శివుని దేవతలు త్రిపుర సంహారమునకై ప్రార్థించిరి. శివుడు యుద్ధమునకు సిద్ధమనెను. కాని యుద్ధసామగ్రి లేదనెను. ఆ దేవతలలోని భూదేవత నేను రథముగా నుందుననెను. రథమునకు సారథి కావలెను గదా! బ్రహ్మదేవుడు తాను సారథిగా నుందుననెను. గుఱ్ఱములు లేనిదే రథమెట్లు ముందుకు సాగును. ఇంతకు రథమునకు చక్రములే లేకుండెను. సూర్యచంద్రులు రథచక్రములుగా నుందుమనిరి. శివునకు ధనువు కావలయును గదా! మేరు పర్వతము తాను ధనువుగా నుందుననెను. మరి బాణమో? విష్ణువు బాణముగా నుందుననెను. వాసుకి పగ్గమయ్యెను. అన్నియును సమకూరినవి కదా. ఇక శివుడు యుద్ధమునకు రథమునెక్కి పోవలెను గదా! పోలేదు. మూడవకన్ను తెఱచి త్రిపురములను గడ్డిని కాల్చునట్లు కాల్చెను. ఇట్లు మూడవ కన్ను తెఱచి త్రిపుర దాహము చేయదలచిన శివుడే యుద్ధమునకు కావలసిన సామగ్రి నేల కూర్చు కొనవలెను? భూదేవత అనుకొన్నది త్రిపుర సంహారమునందు నాదే ముఖ్య పాత్ర. రథము లేనిదే యుద్ధము సాగదు కదా! అని సూర్యచంద్రులు చక్రములు లేనిదే రథమెట్లు సాగును? త్రిపుర సంహారము మావల్లనే జరగనున్నదనుకొనిరి.



సారథి బ్రహ్మ నేను గుఱ్ఱములు తోలిన గదా రథము ముందుకు సాగుట త్రిపుర సంహారమును నేనొర్చినట్లే అని అనుకొనెను. ఇట్లు వారి సాయము కావలెనని ప్రకటించి వారికి గర్వము కలుగునట్లు చేసెను. వారి సాయము లేకపోయిన త్రిపురసంహార మాగిపోవునని తమ సాయము తప్పక తీసికొనవలసివచ్చునని గర్వించిన వారికి శృంగభంగమగునట్లు శివుడు మూడవ కన్ను తెఱచి త్రిపురముల కాల్చెను. హరబుద్ధి భూమ్యాదులతో క్రీడించుట అను విశేషము ప్రభువుల బుద్ధులు విధేయులతో క్రీడించుట అను సామాన్యముచే సమర్థింప బడినందున నాల్గవపాదమున అర్థాంతరన్యాసాలంకారమేర్పడియున్నది. (2) విష్ణు పక్షమున త్రిపురమనగా త్రికూట పర్వత శిరములు మూడు. వానికి పై నున్న పురములందు కాపురము గల రావణుడు త్రిపురుడు. దానిని కాల్పదలచిన విష్ణువు రామావతారము ధరించుట, సుగ్రీవునితో సఖ్య మొనరించుట, ఆయన సాయమున సీతజాడను తెలుసుకొనుట, వారధి గట్టుట సముద్రము దాటుట, రావణునితో యుద్ధము చేయుట, ఈ ఆడంబరమేల? అని అర్థము చెప్పికొన వలెను. ఆ యుద్ధమున ఇంద్రుడు శ్రీరామునకై పంపిన రథము భూమి యంత పెద్దది. కావున రథము క్షోణియని చెప్పబడినది. ఇంద్ర సారథి నూర్గురు పట్టుకొనునంత గట్టిగా పట్టుకొను బ్రహ్మయంత వాడు కావున సారథి శతధృతి యని చెప్పబడినాడు. పర్వతము(ల) రెక్కలు విరచి ధనువుగా చేసికొన్నంత గట్టి ధనువు అగేంద్రము అని చెప్పబడినది. సూర్యచంద్రబింబములాయన్నట్లు ప్రకాశించు ఆ రథము యొక్క చక్రములు సూర్యచన్ద్రులని చెప్ప బడినది. చక్రధారి విష్ణ్వవతారమైన శ్రీరాముడు తన శక్తినంతను తాను ధనువు నందు ఎక్కుపెట్టబడిన బాణమునందుంచినందున బాణము విష్ణువు అని చెప్పబడినది. పూర్వార్ధమున రథాదులయందు క్షోణ్యాద్యారోపమందుటచే నిందు రూప కాలంకార మేర్పడియున్నది. ప్రథమ ద్వితీయ పాదములందు దాక్షిణాత్య మైన (పాదాది) ప్రాసమున్నది. ద్వితీయ పాదమున వర్ణమైత్రి యున్నది. ఇదియు దక్షిణాత్యమే. (3) త్రిపురనామకుడైన రాక్షసుడు లేక రాక్షసుడైన రావణుడు తృణముగా రూపింపబడుటచే మూడవ పాదమున రూపకాలంకారమేర్పడి యున్నది. అట్లే హరిహరుల బుద్ధులు పరతంత్రములు కావు అను విశేషము ప్రభుబుద్ధులు పరతంత్రములు కావు అను సామాన్యముచే సమర్థింబడినందున

అర్థాంతరన్యాసాలంకారమేర్పడియున్నది. శ్రీమద్రామాయణమున రావణునితో మాట్లాడ వలసి వచ్చినప్పుడు సీతాదేవి గడ్డిని మధ్య నుంచినది ఆ పని ఆచారపాలనమే గాక రావణుడు తృణతుల్యుడని సూచించునని సంప్రదాయజ్ఞులు చెప్పెదరు. (4) 'ఆత్మానం రథినం విద్ధి' అను ఉపనిషదుక్తి ప్రకారము హరియో హరుడో స్వాత్మగా తెలియుటకు ప్రభువైన అనగ సమర్థమైన బుద్ధి ప్రభుబుద్ధి అనబడును. లేక హరియో హరుడో పై ఉపనిషదుక్తి ననుసరించి త్రిపురనామక మైన దేహమునకు ప్రభువైన ఆత్మ. త్రిపురములనగా మూడు దేహములు. స్థూల సూక్ష్మకారణ దేహములు మూడు త్రిపురములు. స్థూలదేహమన మనకు స్థూలదృష్టికి గూడ కనబడునది. సూక్ష్మదేహమనగా స్థూలదృష్టికి కనబడనిది. అది ఉన్నట్లు అనుమాన ప్రమాణమున అనగా సూక్ష్మదృష్టితో తెలియబడునది. మనస్సు, ఇంద్రియములు, ప్రాణములు మన కంటికి కనబడకున్నవి. అవి లేనిదే మనము దేనిని తెలిసికొనజాలము కావున అనుమాన ప్రమాణమున ఉన్నట్లు మనకు తెలియబడుటచే నవి సూక్ష్మదేహమునకు చెందిన భాగములు అయి ఉన్నవి. మన అందఱకున్న అజ్ఞానమే కారణదేహము. ఈ మూడు శరీరములు ఆత్మ కాకున్నను ఆత్మగా భావింపబడుచున్నవి. అభిమానింపబడుచున్నవి. ఈ అభిమానములు రాక్షసనామధేయములు. ఈ త్రిపురాభిమాన (రాక్షస) ములు ఆత్మ జ్ఞానముచే నశింపచేయబడును. త్రిపురాసుర సంహార కథలో శివుని మూడవ కన్ను అనగా ఆత్మజ్ఞానమే. అది తెఱువబడగానే అనగా ఆత్మజ్ఞానము కలుగగానే త్రిపురా (భిమానా) సుర సంహారము జరుగును. దీనికి విషయముల నుండి వెనుకకు మరలించు వందలకొద్ది ధృతులు (ధైర్యములు లేక పట్టుదలలు) కావలె. అవి కలిగియున్న బుద్ధి సారథి యని ఉపనిషత్తు చెప్పుచున్నది. ('బుద్ధింతు సారథిం విద్ధి'). వందలకొలది ప్రత్యాహార సామర్థ్యము గల ధృతులు గల బుద్ధి శతధృతి. విష్ణుపక్ష కథలోని త్రికూట పర్వతము ఓంకారము. అ,ఉ, మ-కారములు త్రికూటములు. **'ప్రణవోధనుః'** అని ఉపనిషత్తు ప్రణవమను నామాంతరము గల ఓంకారమును ధనువుగా చెప్పుచున్నది. శివపక్షమందలి త్రిపురాసుర కథలోని మేరువు కూడ త్రికూటమే అని **'సుమేరు మధ్య శృంగస్థా'** అను శ్రీ లలితా సహస్ర స్తోత్ర నామము చెప్పుచున్నది. ఎక్కు పెట్టబడిన ధనువు మధ్యన ఒక లంబరేఖ నూహించుకొన్నచో అది రెండు త్రికోణములుగా



నుండును. కావున అది కూడా త్రికూటమే. ఈ శరీరము పార్థివము పృథివీ భూతము (మట్టి) ఇందు ప్రధాన భూతము. మిగిలిన నాలుగు భూతములు కలసి ఇది పాంచభౌతికమైనను పృథివీ భూత ప్రాధాన్యత ననుసరించి ఇది పార్థివమనబడును. అనగా ఈ శరీరము మట్టియే పృథివియే. దీనికి రెండు వైపులా సూర్యచంద్రులు చక్రములవలె తిరుగుచున్నందున సూర్యచంద్ర బింబములు చక్రములుగా చెప్పబడినవి. శివపారమ్య దృష్టితో విష్ణువు జీవాత్మయే. ఆ విష్ణువే అనగా జీవాత్మయే బాణముగా సంధింపదగినది. అని ఉపనిషత్తు చెప్పినది. బాణము ప్రయోగింపదగినది. ఏ లక్ష్యము గూర్చి? **'బ్రహ్మతల్లక్ష్యముచ్యతే'** అని ఉపనిషత్తు బ్రహ్మలక్ష్యమని చెప్పును. ఆ బ్రహ్మ త్రిపురాభిమాన రాక్షసునిలో అనగా శరీరములోనే ఉన్నది. ఆ జీవాత్మ శరము నాశరీరములోని పరమాత్మ లక్ష్యముగా ప్రయోగించవలెను. అనగా జీవ బ్రహ్మైక్యానుసంధానము చేయవలెను. అప్రమత్తముగా జీవాత్మను పరమాత్మ (బ్రహ్మ) యందు అనుసంధానించి ప్రయోగించినచో బాణము లక్ష్యములోనికి చొచ్చుకుపోయి విడిగా తన ఉనికిని కోలుపోయి అదృశ్యమయినట్లు జీవుడు బ్రహ్మలో అనగా పరమాత్మలో కలసి తన్మయము అనగా బ్రహ్మమయమైపోవును. ఇట్లీ శ్లోకము జీవబ్రహ్మైక్య జ్ఞాన ప్రతిపాదకముగా ఆధ్యాత్మిక దృష్టితో వ్యాఖ్యేయమై ఉన్నది. మరొక ఉపనిషత్తులో **'శరం హ్యుపాసానిశితః సందధీత'** అని ఉన్నది. జీవబ్రహ్మైక్య జ్ఞానము కలుగునంతవరకు జీవబ్రహ్మైక్యోపాసనము చేయవలెను. అట్టి ఉపాసన చేత జీవాత్మ శరము నిశితమగునని బ్రహ్మ లక్ష్యమును భేదించగలదని చెప్పుచున్నది. ఈ శరీర రథ ప్రయాణమునకు దానిలోని జీవునికి దానిలోని పరమాత్మయే గమ్యము.

**అవతారిక:-** పై శ్లోకమున ప్రభువుల బుద్ధులు విధేయులతో క్రీడించుట చెప్పబడినది. ఈ శ్లోకమున అట్టి క్రీడలో నొకటి నేత్రకమల స్వీకరణ పూర్వక చక్రప్రదానము చెప్పబడుచున్నది.

**శ్లో॥** ***హరిస్తే సాహస్రం కమలబలిమాధాయ పదయో***
***ర్యదేకోనే తస్మిన్నిజముదహరన్నేత్రకమలమ్।***
***గతో భక్త్యుద్రేకః పరిణతిమసౌ చక్రవపుషా***
***త్రయాణాం రక్షాయై త్రిపురహర! జాగర్తి జగతామ్॥ 19***

హరిః-తే-సాహస్రం-కమలబలిం-ఆధాయ-పదయోః-యత్-ఏక-ఊనే, తస్మిన్- నిజం-ఉదహరత్-నేత్రకమలం-గతః-భక్త్యుద్రేకః-పరిణతిం-అసౌ-చక్రవపుషా-త్రయాణాం-రక్షాయై-త్రిపురహర-జాగర్తి-జగతామ్.

**ప్రతిపదార్థము:-** త్రిపురహర=ఓ త్రిపురహరా!, హరిః=విష్ణువు, తే=నీ యొక్క, పదయోః=పాదములయందు, సాహస్రమ్=వేయి, కమలబలిమ్=కమలముల పూజను, ఆధాయ=సమర్పించి, యత్=ఏ కారణమున, తస్మిన్=అది, ఏకోనే=ఒకటి తక్కువ కాగా, నిజమ్=తన, నేత్రకమలమ్=నేత్రకమలమును, ఉదహరత్=పెరికెను, అసౌ=ఈ, భక్త్యుద్రేకః=భక్త్యతిశయము, చక్రవపుషా=చక్రశరీరముగా, పరిణతిమ్=పరిణామమును, గతః=పొంది, త్రయాణామ్=మూడు, జగతామ్=లోకముల యొక్క, రక్షాయై=రక్షణ కొరకు, జాగర్తి=మేలుకొనుచున్నది.

**తాత్పర్యము:-** విష్ణువు నీ పాదముల యందు సహస్రకమల పూజను సమర్పించు నపుడొక పూవు తక్కువ కాగా సంఖ్యాపూర్తి యగుటకై తన నేత్ర కమలమునందు చేర్చి వేయి కమలముల సమర్పించినవాడాయెను. ఆ భక్త్యుద్రేకము చక్రముగా పరిణమించి మూడు లోకముల రక్షణకొరకు మేలుకొనుచున్నది.

**అనువాదము:-**

హరి భవదీయ పాదయుగమందు సహస్ర సరోజ పూజ ద
త్పరుడయి సేయ నొక్కటియ తక్కువగా దన నేత్రపద్మమున్
చరణములందు గూర్చెను ప్రశస్తము త్వత్పదభక్తి చక్రమై
పరిణతినంది ముజ్జగము బాయక ప్రోచును జాగరూకమై

**వివరణము:-** (1) విష్ణువు శివపాదార్చనము సహస్రకమల పుష్ప సమర్పణ రూపమున జేయుచుండగా నొక కమలము తక్కువయయ్యెను. తక్కువగుట యేమి? ఆ పరమేశ్వరుడు(శివుడు) ఒక కమలమును అంతర్హితము నొనరించెను. తొమ్మిది వందల తొంభై తొమ్మిది కమలములను సమర్పించెను. ఒకటి తక్కువ ఎట్లయ్యెనో విష్ణువునకు తోచలేదు. తనకు కమలాక్షుడని పేరున్నది గదా అనగా తన కన్నులు కమలములు అని అందఱు చెప్పుకొనుచున్నారు. అప్పుడు వెంటనే తన రెండు నేత్రములలో నొకదానిని పెరికి దానిని శివపాదములందు సమర్పించి సహస్రకమలార్చనమును ముగించెను. శివుడు విష్ణువు యొక్క తన



నేత్రకమలమును పెఱికి వేయుటకు కూడ వెనుదీయనీయని, భక్త్యుద్రేకమునకు సంతసించి సుదర్శన చక్రమును విష్ణువునకు ప్రసాదించెను. ఇప్పుడా చక్రము సాయమున మూడులోకములనవలీలగా పాలించుచు తన విధియైన లోక రక్షణ కృత్యమును నెరవేర్చుచున్నాడు. ఇచట భక్త్యుద్రేకమే చక్రముగా రూపొందినదనుట అతిశయోక్త్యలంకారమును శ్లోకమున కూర్చుచున్నది. శివునకు పూజా కమలముగా కన్ను సమర్పించి ఆతని నుండి చక్రమును విష్ణువు స్వీకరించినట్లు స్ఫురించుటచే నీ శ్లోకమున పరివృత్త్యలంకారమేర్పడియున్నది. మెలకువలో తెఱచుకొను కన్ను నిచ్చుట కారణముగా ప్రసాదింపబడిన చక్రము కన్నువలె మేలుకొని ముల్లోకముల కాపాడుచున్నది. విష్ణువు కన్నే కమలాభిన్నమై సమర్పించు భక్త్యుద్రేకమే చక్రము కావున మేలుకొనుట అను నేత్రసహజకృత్య మొనరించుచున్నది. (2) విష్ణుపక్షమున హరిః అనగా ఇంద్రుడు. అతడు తన వేయికన్నులను కమలములను విష్ణుపాదములందు సమర్పించెను. ఈ పనినాతడు ఏకః అనగా అసహాయుడై, అనే తస్మిన్=ఇది (భూలోకము) కాని దాని (స్వర్గలోకమందు) యందు, నిజమ్=తనను, ఉదహరత్=ఉద్ధరించుకొనెను. అనగా విష్ణువును పూజించి తనను స్వర్గలోకమునకు తానే ఉద్ధరించుకొనెను. ఆ భక్త్యుద్రేకమునకు ఫలముగా విష్ణువు ఇంద్రునకు చక్రమును అనగా ఐరావతోచ్చైశ్రవః ప్రభృతికాంగములుగల సైన్యమును ప్రసాదించెను. అందువలన ఇంద్రుడు త్రిలోకాధిపత్యమును నిర్వర్తించుచున్నాడు. (3) రేఫము యొక్క బహువారావృత్తి మరియు 'కమలబలిమ్' 'పదయోర్యదేకోనే' 'త్రిపుర హర' అను పదబన్ధములుండుట వృత్త్యనుప్రాస శోభ శ్లోకమున కలిగించు చున్నవి.

**అవతారిక:-** ఇంతవరకు హరిహరులలో నొకరిని పరమేశ్వరునిగా నంగీకరించి ఆరాధించి లాభముల పొందిన వారి యొక్కయు, వారి యెడ నప్పుడప్పుడు తిరస్కార భావము చూపి క్లేశములను పొందిన రావణ బాణ బల్యాదుల యొక్క వృత్తాంతములు చెప్పబడినవి. ఈ శ్లోకమున పరమేశ్వరునే అంగీకరించని వారి వాదము నిరసింపబడుచున్నది.

***శ్లో॥ క్రతౌ సుప్తే జాగ్రత్త్వమసి ఫలయోగే క్రతుమతాం***
***క్వ కర్మ ప్రధ్వస్తం ఫలతి పురుషారాధానమృతే,***

***అతస్త్వాం సంప్రేక్ష్య క్రతుషు ఫలదానప్రతిభువం***
***శ్రుతౌ శ్రద్ధామ్ బద్ధ్వా కృతపరికరః కర్మసు జనః॥ 20***

క్రతౌ–సుప్తే–జాగ్రత్–త్వం–అసి–ఫలయోగే–క్రతుమతాం–క్వ–కర్మ–ప్రధ్వస్తం– ఫలతి–పురుషారాధనం–ఋతే అతః–త్వాం–సంప్రేక్ష్య–క్రతుషు–ఫలదాన ప్రతిభువం– శ్రుతౌ–శ్రద్ధాం–బద్ధ్వా–కృతపరికరః–కర్మసు–జనః.

**ప్రతిపదార్థము:–** క్రతౌ=(యజ్ఞాదిక) కర్మ, సుప్తే=నిద్రించగా (నశించగా), క్రతుమతామ్=కర్మ మొనరించినవారి యొక్క, ఫలయోగే=ఫలమును కూర్చుట యందు, త్వమ్=నీవు, జాగ్రత్=మేలుకొనువాడవు, అసి=ఉన్నావు, ప్రధ్వస్తమ్= నశించిన, కర్మ=కర్మ, పురుషారాధనమ్=చేతనుని సంతోషము, ఋతే=లేనిదే, క్వ=ఎచట, ఫలతి=ఫలించును, అతః=అందువలన, క్రతుషు=కర్మలయందు, ఫల దానప్రతిభువమ్=ఫలమునిచ్చుటలో హామీగా ఉన్న, త్వామ్=నిన్ను, సంప్రేక్ష్య= చూచి (నమ్మి), శ్రుతౌ=వేదమునందు, శ్రద్ధామ్=శ్రద్ధను, బద్ధ్వా= బంధించుకొని, కర్మసు=కర్మలయందు, జనః=జనము, కృతపరికరః=చేయబడిన పూనిక కలది (అయి ఉన్నది).

**తాత్పర్యము:–** క్షణికమైన యజ్ఞాది కర్మ నశించినను శాశ్వతమైన పరమేశ్వరుడు ఫలమునిచ్చుటకు మేలుకొనియుండును. అట్లు కానిచో నశించిన కర్మ కాలాంతరమున చేతనుని సాయము లేక ఎచట ఫలించును. అందువలన కర్మలయందు ఫలప్రాప్తికి హామీగానున్న నిన్ను నమ్మియే జనులు వేదమును నమ్మి శ్రద్ధతో కర్మలనాచరించుటకు పూనుకొనుచున్నారు.

**అనువాదము:–**

క్రతువతినిద్రమై వరల కర్తలకున్ ఫలదానమందు జా
గృతి వహియించె దీవు ఫలియించునెటుల్ కృతులీశ్వరార్చ లే
కతిహతమైప్రభూ! క్రతుఫలాగమ భూమి నినున్ దలంచి యా
శ్రుతులను విశ్వసించి క్రతుశోభన దీక్షితులౌదురీజనుల్

**వివరణము:–** క్రతువనగా వేదోక్తమైన లేక వేదవిహితమైన సత్కర్మ. ఈ వేదవిహితములైన కర్మలలో కొన్ని నిత్యములు. కొన్ని కామ్యములు. నిత్యకర్మలకు ఫలము లేదని అవి చేయబడనిచో ప్రత్యవాయ (పాప) ము గలిగించునని



మీమాంసకులలో కొందఱి అభిప్రాయము. 'ధర్మేణ పాపమపనుదతి' అను వేదవాక్యము ననుసరించి నిత్యకర్మరూప ధర్మము చేసి పాపమును తొలగించు కొనవచ్చును. అని తెలుపుచున్నది. (1) నిత్యకర్మనొనరించి అవి చేయకుండుట వలన కలుగు ప్రత్యవాయము రాకుండ చేసికొనవలెను. అనగా అకరణ ప్రత్యవాయ నివృత్తియే నిత్యకర్మ యొక్క ఫలము అనునది ఒక పక్షము. (2) నిత్యకర్మనొనరించినచో సంచిత పాపము కొంత తొలగును. అనగా సంచిత పాపనివారణము నిత్యకర్మ ఫలము. 'యద్రాత్ర్యా పాపమకార్షం మనసా వాచా...' ఇత్యాది శ్రుతి వాక్యములందుకు ప్రమాణము. ఇది రెండవ పక్షము. (3) పై ఫలములతో పాటు 'ఉద్యన్తమస్తం యన్తమాదిత్య మభిధ్యాయన్ కుర్వన్ బ్రాహ్మణో విద్వాన్త్సకలమ్ భద్రమశ్నుతేఽసావాదిత్యో బ్రహ్మేతి బ్రహ్మైవసన్ బ్రహ్మాప్యేతి' ఇత్యాది శ్రుతి వాక్యము నిత్యకర్మయైన సన్ధ్యోపాసనము పాపనివృత్తి ఫలముతో పాటు అజ్ఞాననివృత్తి జీవబ్రహ్మైక్యజ్ఞానము అను ఫలములను సైతము పొందునని చెప్పుచున్నది. ఇది మూడవ పక్షము. కామ్య కర్మ కూడ క్రతుశబ్దవాచ్యము. 'జ్యోతిష్టోమేన యజేత స్వర్గకామః దశపూర్ణమాసాభ్యాం స్వర్గ కామోయజేత' ఇత్యాది వాక్యములు స్వర్గకామునకు స్వర్గఫలజనకములుగా వేదోక్తమైన దర్శపూర్ణమాస జ్యోతిష్టోమాదులు మరణించిన పిదప కర్తకు స్వర్గమును కలిగించునని చెప్పుచున్నవి. కర్మ చేయబడుచున్నంతవఱకు అది జాగ్రత్కర్మము. కర్మము సమాప్తము కాగానే అది సుప్తమనబడును. సుప్తి (లేక సుప్తము) అనగా కారణములో కార్యము లీనమగుట. ఇదియే లయము అని కూడ చెప్పబడును. మనము నిద్రించు చున్నామనగా మన ఇంద్రియములు సుప్తి అను పేరుగల అజ్ఞానములో (లీనమగుట) దాగియుండుటయే. మెలకువ అనగా అవి అజ్ఞానము నుండి వెలుపలికి వచ్చుటయే. మరల రాకుండునట్లు నశించుట ఆత్యంతికనాశమని చెప్పబడును. ఆత్మజ్ఞానము కలుగునంతవరకు ఇంద్రియ కర్మాదులకు తన్మూల జ్ఞానమునకు ఆత్యంతిక నాశముండదు. ఇంద్రియాదులు పుట్టి చచ్చుచునే యుండును. లోపలికి వెళ్ళి దాగికొని కొంతకాలమునకు మరల వెలుపలకు వచ్చుచునేయుండును. కారణము లోపలికి పోవుట చచ్చుటయని, కారణము నుండి వెలుపలకు వచ్చుట పుట్టుటయని చెప్పబడును. అట్లే చచ్చుట యనగా (దీర్ఘ) నిద్రయే. నిద్ర అనగా తెలివిలేకుండుటయే. అజ్ఞానమే. మెలకువ

యనగా తెలివి కలుగుటయే. జీవుల విషయమున చచ్చుట పుట్టుట అనగా నివియే. జడ వస్తువుల నాశము నిద్ర సుప్తి అను పదములతో సాధారణముగా చెప్పబడవు. కాని కుండ మొదలగు మట్టిలో నున్న వస్తువులు కుమ్మరివాని వ్యాపారము వలన బయటకు వచ్చును. అది పగిలి మట్టి లోపలికి పోవును. కారణములోనుండి ఇట్లు బయటకు వచ్చుట మెలకువ వంటిదే కావున మెలకువ అని చెప్పబడవచ్చును. అట్లే కారణము లోనికి పోవుట సుప్తి (నిద్ర) అని చెప్పబడవచ్చును. ఈ శ్లోకమున జడమైన కర్మ (క్రతౌ) 'సుప్తే' అని చెప్పబడినది. ఈ సుప్తే అను పదము నశించగా అను అర్థమునే ఇచ్చును.

వాస్తవమునకు నిద్ర జడతను కలిగించుటచే ప్రాణులు సైతము నిద్రించు నప్పుడు జడులు గానే ఉందురు. అయినను ప్రాణి (ఆత్మ) తనకేమీ తెలియదని తెలియుచుండును కావున ప్రాణిలోని ఆత్మ ఎల్లప్పుడు జాగ్రత్తై యుండును. మెలకువలోని ఇతరములను తెలిసికొనుచు నిద్రలో ఇతరములను తెలియక యుండుటను తెలిసికొనుచునుండుటచే ఆత్మ నిత్య జాగరూకమని గమనింపవలెను. ఆత్మ యన్నను పరమాత్మయన్నను ఒక్కటే కావున శివుడును నిత్య జాగరూకుడే. 'ఏష సుప్తేషు జాగర్తి' అని ఉపనిషత్తు చెప్పును. క్రతుమంతులు అనగా కర్మచేయువారు. వారికి ఫలమునిచ్చుటకు శివుడెప్పుడును మేలుకొని యుండును. జాగరూకుడై యుండును అని ప్రథమ పాదమున చెప్పబడినది. ప్రథమ పాదమున కర్మలకర్తలకు ఫలము నిచ్చుటకు జాగరూకు డయిన శివుని యొక్క ఉనికి ఆవశ్యకమనుట స్పష్టము చేయబడినది.

మీమాంసకులు కర్మ ఫలమును ఇచ్చుటకు ఒక ఈశ్వరుని ఉనికి ఆవశ్యకమని ఒప్పుకొనరు. వేదోక్తమైన కర్మచేయబడగానే అది అపూర్వము అను సంస్కారమును కలిగించి చచ్చిపోవును. నశించును. ఆ అపూర్వమును జ్యోతి ష్టోమాది యాగకర్తలకు వారు మరణించిన పిదప వారి ఆత్మలోనుండి ఆ ఆత్మకు స్వర్గసుఖోపభోగమునకు కావలసిన శరీరమును, స్వర్గ భోగములను ఇచ్చి అది నశించును. కర్మ వలె అపూర్వము క్షణికము కాదు. అది యాగకర్తకు స్వర్గోప భోగమును కలిగించునంత వఱకు ఉండును. ఇట్టి అపూర్వము లోకములోని కర్మల కర్తలకు కలుగునట్లు దృష్టము కాని శ్రుతము కాని కాదు. యజమానులు తమ కర్మల కర్తలకు కర్మననుసరించి తగిన ఫలమునిచ్చుట లోక ప్రసిద్ధము.



అట్లే లౌకిక కర్మ ప్రధ్వస్తమైనను ఎట్లు యజమానులు ఫలము నొసగుచున్నారో అట్లే ఈశ్వరుడును వైదిక కర్మ కర్త మరణించిన పిదప వైదిక కర్మకు తగిన ఫలము నొసగుటకై మేలుకొనియుండగా అపూర్వమును లోకదృష్టము కాని సంస్కారమును అంగీకరించుట అనవసరము. లౌకికకర్మ యజమానుని సంతోషమునకు కారణమైనట్లే వైదికకర్మ ఈశ్వరుని సంతోషింపజేయును. సంతోషించిన యజమానుడు లౌకిక కర్మ కర్తకు ఫలమొసగునట్లే సంతోషించిన ఈశ్వరుడును వైదిక కర్మకు తగిన స్వర్గాది ఫలమునొసగును.

యజ్ఞయాగాది కర్మల చేయుట ఈశ్వరాజ్ఞా నిర్వహణ రూపమే కావున అది ఈశ్వరసేవారూపమే, ఈశ్వరారాధనా రూపమే. ఆ కారణము చేతనే ఈశ్వరుడు సంతసించుట, కర్మ ఫలమునొసగుటు. లేనిచో ఈశ్వరుడిచ్చిన హస్త పాదాది కారణములతో కర్మ చేయబడినప్పుడు దానికి ఫలము నీశ్వరుడేల ఈయవలెను? జీవుడు వెట్టి చాకిరి చేయును. ఈశ్వరుడు సంతోషించి కర్మకు ఫలముగా స్వర్గాదులనొసగును. అది వాస్తవమునకు కర్మ ఫలము కాదు. ఈశ్వరుడు సంతోషించి లేక జాలిదలచి యిచ్చిన పారితోషికము మాత్రమే. వేదములందు పేర్కొనబడిన ఫలములనే ఈశ్వరుడొసగి జీవులకు సత్కర్మలందు ప్రవృత్తిని కలుగజేయుచున్నాడు. ఇది ద్వితీయపాద నిరూపితార్థము అని నా యుద్దేశము. సత్కర్మల వలన పుణ్యమను నపూర్వము, దుష్కర్మల వలన పాపమను అపూర్వము జనించునని మీమాంసకులు చెప్పెదరు. అట్లొప్పు కొనినను ఆ పుణ్య పాపములకు స్వర్గనరకాది హేతుత్వము నొప్పుకొనవలసి యుండును. ఈశ్వరు నొప్పుకొనినచే ఆతనికి స్వర్గనరకాది స్రష్టృత్వము నంగీకరించుట ఉచితము. జడమునకు స్రష్టృత్వము నొప్పుకొను అసంగతత్వము, అనుపపత్తి ఉండవు.

అదిగాక లోకమున నొక అపరిచితుడైన యజమానుని దగ్గఱ పనిచేయ వలసిన యప్పుడు కార్మికుడు, యజమానుడు ఇరువురకు పనికివచ్చు నొక హామీ ఈయగలిగిన మధ్యవర్తి నాశ్రయించెదరు. అపూర్వము ఫలము నొసగుటలో అవకతవకలు కలుగకుండ కాపాడు ఈశ్వరునొప్పుకొనినచో అతడు ప్రతి భూ స్థానమున నుండును. అట్లు ఫలదాన క్రతు భూస్థానీయుడైన ఈశ్వరునంగీకరించి వేదమునందు శ్రద్ధను పూని తదుక్త కర్మలు చేయుటకు లోకులు పూనుకొను

చున్నారు. ఈ అంశము ఉత్తరార్థమున చెప్పబడినది. నాల్గవ పాదమున శ్రుతౌ శ్రద్ధామ్ బద్ధ్వా=వేదమునందు శ్రద్ధచేసి, సుజనః=సజ్జనుడు, కర్మ=కర్మను, అకృత=చేసెను. పరి అనగా చుట్టూ (ఉన్నవారికి) క అనగా సుఖమును ర అనగా చేయువాడు అని సుజనునకు విశేషణముగా చేసియు సమన్వయముచేయ వచ్చును. ఉత్తరార్థమున దాక్షిణాత్యమైన పాదాది ప్రాసమున్నది. గీతాదులలో నుండు ప్రాసయతి నాల్గవ పాదముననున్నది. కకార రేఫల బహువారావృత్తి శ్లోకమున వృత్త్యనుప్రాస శోభను కలిగించుచున్నది.

**అవ:–** పై శ్లోకమున భగవదారాధన రూపకర్మ అపూర్వ ద్వారమున గాక సాక్షాత్తు గానే స్వతంత్రముగానే భగవదనుగ్రహహేతువనినిరూపింపబడినది. ఈశ్లోకమున ఆ భగవంతుని యందు విశ్వాసము లేని వాని కర్మ ఎంత గొప్ప సాధన సామగ్రితో కూడియున్నను కర్తకు వినాశమునే కలిగించునని చెప్పబడు చున్నది.

శ్లో॥ *క్రియాదక్షో దక్షః క్రతుపతిరధీశస్తనుభృతా*
*మృషీణామార్త్విజ్యం శరణద! సదస్యాస్సురగణాః।*
*క్రతుభ్రేషస్త్వత్తః క్రతుఫలవిధానవ్యసనినో*
*ధ్రువం కర్తుః శ్రద్ధావిధురమభిచారాయ హి మఖాః॥* **21**

క్రియాదక్షః–దక్షః–క్రతుపతిః–అధీశః–తనుభృతాం–ఋషీణాం–ఆర్త్విజ్యం –శరణద–సదస్యాః–సురగణాః–క్రతుభ్రేషః–త్వత్తః–క్రతుఫలవిధానవ్యసనినః –ధ్రువం–కర్తుః–శ్రద్ధావిధురం–అభిచారాయ–హి–మఖాః.

**ప్రతిపదార్థము:–** శరణద=రక్షణము నిచ్చువాడా!, క్రియాదక్షః=క్రియలందు నిపుణుడు, తనుభృతామ్=ప్రాణులకు, అధీశః=ప్రభువునయిన, దక్షః=దక్షుడు, క్రతుపతిః=యజమానుడు, ఋషీణామ్=ఋషులయొక్క, ఆర్త్విజ్యమ్=ఋత్విక్త్వము, సదస్యాః=ఉపద్రష్టలు, సురగణాః=దేవగణములు (అయినను), క్రతుఫల విధాన వ్యసనినః=కర్మలకు ఫలమునిచ్చుట వ్యసనముగా గలిగిన, త్వత్తః=నీ నుండి, క్రతుభ్రేషః=యజ్ఞము యొక్క వినాశము, ధ్రువమ్=నిశ్చయముగా, కర్తుః =యజమానుని యొక్క, శ్రద్ధావిధురమ్=శ్రద్ధలేని, మఖాః=యజ్ఞములు, అభిచారాయ హి=ఇతరాపకారము కొఱకు చేయబడి ఫలింపక ఆత్మ వినాశము కొఱకే (అగును) కదా!



**తాత్పర్యము:–** క్రియాదక్షుడు, ప్రాణులకు పతియైన ప్రజాపతియైన దక్షుని యజమానత, ఋషుల ఆర్త్విజ్యము, దేవతల సదస్యత, కలిగిన యజ్ఞము క్రతుఫలము నిచ్చుటయే వ్యసనముగా గల నీ నుండి నశించుట నీ తప్పు కాదు. యజమానుని శ్రద్ధలేని కర్మ యజమాన వినాశము కొఱకే అగును కదా!

**అనువాదము:–**

క్రతుపతి యా ప్రజాపతియ కర్మ సుదక్షుడు దక్షుడే ఋషుల్
క్రతువున ఋత్విజుల్ సురవర ప్రకరమ్ము సదస్య సంఘమౌన్
క్రతుఫల దాత! నీ వలన కల్గునొకో క్రతునాశ మయ్యయో
క్రతువున శ్రద్ధలేమి క్రతుకర్త కదే యభిచారమౌ గదా

**వివరణము:–** శరీరధారులైన ప్రాణులకధిపతులైన ప్రజాపతులలో అగ్రగణ్యుడు, కర్మల నిర్వహించు దక్షత గల దక్షుడు యజమానుడుగానున్నను, సర్వజ్ఞులైన ఋషులు ఋత్విక్కులుగానున్నను, దేవతలు సదస్యులై క్రతువును పర్యవేక్షించు చున్నను, క్రతుఫలమును యజమానునకెప్పుడిత్తునాయని ఎదురుచూచుట స్వభావముగా గల శివుని చేతనే ఆ దక్షుని యజ్ఞము ధ్వస్తమగుటలో క్రతు ఫలము నిచ్చు నీశ్వరుని యందు (శివునందు) యజమానుడైన దక్షునకు శ్రద్ధ లేకపోవుట అనునది యజమాన దోషమే.

'అర్థీ సమర్థో విద్వాన్' అని యజమానుని కోరిక సామర్థ్యము (కర్మ) జ్ఞానము అను లక్షణములు పేర్కొనబడినవి. సామాన్యముగ స్వర్గమును పొందు కోరిక కలవాడు యజ్ఞకర్త యగును. దక్షుడు భూలోక ప్రాణులకు నాయకుడని 'తనుభృతామధీశః' అను పదము చెప్పుటచేత ఆయనకు స్వర్గవాంఛ ఉన్నదని వ్యంగ్యమగును. క్రియాదక్ష శబ్దము ఇదివఱకెన్నియో యజ్ఞాది క్రియల నొనరించి వానిని నిర్వహించుటలో సామర్థ్యము సంపాదించి దక్షుడను నామము యొక్క సార్థకత నొందినాడని వ్యంజించును. సాధారణ యజ్ఞమున వేదవేత్తలు, హోత, అధ్వర్యువు, ఉద్గాత, బ్రహ్మ అను ఋత్విక్కులుగా నుండి యజమానునకై కర్మను నిర్వహించి తత్ఫలమును యజమానునకు ధారపోసి యజమానుని నుండి దక్షిణల గ్రహించెదరు. ఇచట వేదద్రష్ట (ఋషు) లే ఋత్విక్కులుగా ఉన్నారనగా యజ్ఞమున ఏ లోపము జరుగునవకాశము లేదని 'ఋషీణామ్' అను శబ్దము

వ్యంజించును. ఎవరికాహుతులు యజ్ఞమున ఈయబడునో అట్టి దేవతలే సదస్సులో కూర్చొనియున్నారనగా, సాధారణ యజ్ఞమున దేవతల కాహుతులు అందినవో లేవో యని శంకించు నవకాశమున్నను, ఈ యజ్ఞమున అట్టి అవకాశము లేదని సదస్య శబ్దము వ్యంజించును. ఇట్లు సాధన సామగ్రి యందే లోపము లేదని పూర్వార్ధము వ్యంజించును.

ఈశ్వరుడు (శివుడు) క్రతు ఫలమునిచ్చు సమయమెప్పుడు వచ్చునా యని ఎదురుచూచుచున్నాడని 'క్రతుఫలవిధానవ్యసనినః' అను పదము వ్యంజించును. అయినను ఆ శివుడే ఆ ఈశ్వరుడే క్రతుఫలము నొసగుటకు బదులుగా దక్షుని యజ్ఞమునే పాడుచేసెను. అట్లు చేయుట ఈశ్వరునకిష్టమా? ఇదివఱకెప్పుడైన అట్లు చేసినాడా? అను ప్రశ్నలకు కాదు, లేదు అను శబ్దములే సమాధానములు. ఇప్పుడిట్లు జరుగుట చోద్యమే అని మూడవ పాదము వ్యంజించును. యజమానునకు ఫలప్రదాతయగు ఈశ్వరునందు (శివునియందు) శ్రద్ధ (భక్తి) లేనప్పుడు చేయబడిన కర్మ అభిచారమగును. ఆభిచారమనగా యజమానునకే హాని కలిగించు కర్మము. సాధారణముగా శత్రు సంహారము కొఱకు చేయబడు శ్యేన యాగాదులు కర్మయందేదియైన లోపము జరిగినప్పుడు యజమానునకే నాశము కలిగించును. త్వష్ట ప్రజాపతి ఇంద్రనాశము కొఱకు సంకల్పించిన యజ్ఞమున 'ఇంద్ర శత్రుర్వర్ధ స్వ' అను మంత్రము నుచ్చరించునపుడు ఋత్విక్కుదో యజమానిదో స్వరదోషము కలిగినందున ఇంద్రుడే శత్రువుగా వృద్ధినొంది ఇంద్రుని జంపు కుమారునకు బదులు ఇంద్రునిచే చంపబడు కుమారుని పొందుట అను వ్యతిరేక ఫలము త్వష్టకు కలుగెను. అట్లే ఇచట దక్షునకు ఫలప్రదాతయగు ఈశ్వరునందు విశ్వాసము లేకపోవుట అనగా శివుడు ఫలప్రదాత అని అంగీకరించకపోవుట తత్కారణముగా నేర్పడిన, శివునందు దోషారోపణము వినాశనమును తానే కొనితెచ్చుకొనెను అనుట నాల్గవ పాదమున వ్యంగ్యమగు నర్థము. (2) విష్ణు పక్షమున క్రియాదక్షో దక్షః=క్రియాదక్షుడు, ఉత్కృష్టములైన ఇంద్రియములును గలవాడునునైన, తనుభృతామ్=రాక్షసుల యొక్క లేద దాతల యొక్క అధిపతియగు, బలి, క్రతుపతి=యజమానుడు, సురగణాః=అసురులలో లెక్కింపదగిన వారు, సదస్యాః=సభ్యులుగా గల బలి యజ్ఞము నొనరించెను. బలి చక్రవర్తి రాక్షసరాజు కావున 'తనుభృతామధీశః'



అని చెప్పబడినాడు. తమ తనువులనే పోషించుకొనువారు ఇతరులను హింసించి యైనను తమ పొట్ట నింపుకొను కుక్షింభరులు. కావున రాక్షసులకు తనుభృత్తులని పేరువచ్చినదని సమన్వయింపవచ్చును. బలిచక్రవర్తి రాక్షసరాజైనను విష్ణువునకే భూమిని మూడడుగులు దానముచేసిన, అనగా తన సర్వస్వమును దాన మొనరించిన, గొప్పదాత కావున తనుభృత్తులనగా తనువులు అనగా క్షీణులు, వారిని దానములలో పోషించువారు తను భృత్తులు. అట్టి గొప్పదాతలైన శిబి దధీచ్యాదులలో అనగా దానవీరులలో గొప్పవాడు కావున తనుభృతామధీశః అని చెప్పబడినాడని సమన్వయింప వచ్చును.

కాని సమస్త భూమి ఇతర లోకములు విష్ణువుకు చెందినవని భావింపక తనదని మమకారమును భూమియందు పాతాల స్వర్గములందును పూని విష్ణువునకు దానమొసగు వాడనని అహంకరించిన కారణమున స్వర్గమునకన్న ఉత్తమ లోకమునకు పోవలెనను వాంఛతో యజ్ఞమునొనర్చిన బలి యజ్ఞమునకు విష్ణువుతోనే నాశమేర్పడగా పాతాలలోకమునకు పోవలసినవాడయ్యెను. ఎంత సాధన సంపత్తియున్నను, వామనుడు భగవానుడు అని తన గురువు శుక్రుడు చెప్పినను నమ్మని కారణమున అధోలోకమునకు పోవలసిన వాడయ్యెను. (3) 'క్రియాదక్షో దక్షః' అను పదబన్ధమున యమకాలంకారమున్నది. 'క్రతుపతి రధీశస్తనుభృతా మృషీణా మార్త్విజ్యమ్' 'శరణద సదస్యా స్సురగణాః' 'విధాన వ్యసనినః' 'శ్రద్ధావిధుర మభిచారాయ' ఇత్యాది పదబన్ధములలో వృత్త్యనుప్రాసాలంకార మున్నది. బలి దక్ష యజ్ఞధ్వంసము తన్నాశమునకు కారణమగుట అను విశేషమును శ్రద్ధలేని కర్తల యజ్ఞము లభిచారరూపమున కర్త వినాశహేతు భూతములు అను సామాన్యముచే సమర్థింపబడినందున అర్థాంతరన్యాసాలంకార మేర్పడి యున్నది.

**అవతారిక:–** పై శ్లోకమున దక్ష బలి యజ్ఞ ధ్వంసము తదభిచార కర్మఫల శిక్షగా చెప్పబడినది. ఈ శ్లోకమున కాముకత కాముకుల శిక్షా హేతువుగా చెప్పబడు చున్నది.

**శ్లో॥** *ప్రజానాథం నాథ! ప్రసభమభికం స్వాం దుహితరం*
*గతం రోహిద్భూతాం రిరమయిషుమృశ్యస్య వపుషా।*

***ధనుష్పాణేర్యాతం దివమపి సపత్రాకృతమముం***
***త్రసన్తం తేఽద్యాపి త్యజతి న మృగవ్యాధరభసః॥ 22***

ప్రజానాథం-నాథ-ప్రసభం-అభికం-స్వాం-దుహితరం-గతం- రోహిద్భూతాం-రిరమయిషుం-ఋశ్యస్య-వపుషా-ధనుష్పాణే-యాతం-దివం-అపి-సపత్రాకృతం-అముం-త్రసంతం-తే-అద్య అపి-త్యజతి-న-మృగవ్యాధరభసః.

**ప్రతిపదార్థము:-** నాథ=ఓ ప్రభూ!, ప్రసభమ్=బలాత్కారమున, రోహిద్భూతామ్=లేడిగా మారిన, స్వామ్=తనకు సంబంధించిన, దుహితరమ్=కూతురును, ఋశ్యస్య=జింక యొక్క, వపుషా=శరీరముతో, రిరమయిషుమ్=రమింపగోరిన, గతమ్=పోయిన, దివమ్=స్వర్గమునకు, యాతమ్ అపి=పోయినవానినైనను, సపత్రాకృతమ్=బాణము తగుల్కొన్నవానివలె, త్రసన్తమ్=భయపడుచున్న, అభికమ్=కాముకుడైన, అముమ్=ఈ, ప్రజానాథమ్=బ్రహ్మ, తే=నీ యొక్క, మృగవ్యాధరభసః=కిరాతవేగము, న త్యజతి=వదలుట లేదు.

**తాత్పర్యము:-** ఓ ప్రభూ! తన కూతునే కామించి వెంటబడిన బ్రహ్మను జూచి లేడి రూపము ధరించినను తాను కూడ జింక రూపము ధరించి రమింపగోరిన బ్రహ్మపై నీవు బాణము నెక్కుపెట్టగా స్వర్గమునకు పారిపోయిన బ్రహ్మవెంబడి స్వర్గమునకును పోయిన ధనుర్ధారివగు నీ కిరాతవేగము వలన కలిగిన భయము బ్రహ్మనింకను వదలుట లేదు.

**అనువాదము:-**

మృగియగు కూతునే మృగ శరీరమునన్ బ్రసభమ్ముగా రమిం
పగ జనునా ప్రజాపతిని వ్యాధుడవై ధనువున్ ధరించి తీ
వ్రగతిన్ నీవు వెంటబడ స్వర్గము జేరిన నేటికైన నీ
మృగయ సుభీకరాకృతి జనించిన భీతి నతండు వీడునే.

**వివరణము:-** (1) తాను సృజించిన సంధ్యాదేవి సౌందర్యమును జూచిన బ్రహ్మ ఆమె వెంటబడగా ఆమె లేడి రూపము ధరించి పారిపోజొచ్చెను. సిగ్గుతో లేడి రూపమును ధరించినదని భావించిన బ్రహ్మ కాముకుడై తానును జింక రూపము ధరించి వెంట పరుగుపెట్టెను. ఈ దృశ్యము జూచిన శివుడు ప్రజానాథుడు



ప్రజలకాదర్శముగా నుండవలసిన బ్రహ్మ ఇట్లు కూతు వెంటబడు నధర్మమునకు శిక్ష విధించుటకు శివుడు తన పినాక ధనువు నెక్కువెట్టి బ్రహ్మ వెంట పడెను. భయపడిన బ్రహ్మ మృగశిరా నక్షత్రరూపము ధరించి ఆకసమున దాగుకొనెను. శివుడును ఆర్ద్రా నక్షత్రరూపమున బ్రహ్మనిప్పటికిని వెంబడించుచున్నట్లు కనబడుచున్నాడు. బ్రహ్మయు ఇంకను వణకుచున్నట్లే మినుకుమినుకుమను చున్నాడు. (2) భూలోకమున జింక రూపము ధరించిన తన వెంట బడిన ధనువెక్కు పెట్టిన కిరాతవేషధారియగు శివుని జూచినప్పటి భయము నక్షత్రరూపము నందిన పిదపను వదలలేదను సంభావన మీ శ్లోకమున నుండుటచే ఉత్ప్రేక్షాలంకారమేర్పడియున్నది. (3) రోహిణీ నక్షత్రము బ్రహ్మ దైవత్యము దాని వెనుక నున్న నక్షత్రము మృగశీర్ష నక్షత్రము చంద్ర దైవత్యము. చంద్రుని కిరువదియేడు నక్షత్రములు భార్యలైనను రోహిణి యందు అధిక ప్రీతియని పురాణకథయున్నది. అత్త్ర్యనసూయలకు హరిహరులతో ప్రత్యక్షమైన బ్రహ్మ స్వాంశమున చంద్రుని పుత్రునిగా ప్రసాదించెను. ఈ కథ చంద్రబ్రహ్మలకు ఏకరూపత సూచించును. చంద్రుడు రోహిణి వెంటబడినాడన్నను, బ్రహ్మ రోహిద్భూతయైన సంధ్య వెంటబడి నాడన్నను రోహిణి బ్రహ్మ దైవత్యమన్నను మృగశీర్ష చంద్ర దైవత్యమన్నను బ్రహ్మ చంద్రుల అభేదము రోహిణీ సంధ్యల అభేదమును బ్రహ్మ చంద్రుల పితృపుత్ర భావము ననసరించి 'ఆత్మా వై పుత్రనామాసి' అను శ్రుతిననుసరించియు సూచించును. వారి వెనుక ఆర్ద్రా నక్షత్రముండుట రుద్రుడు బ్రహ్మను శిక్షింప కిరాతవేషము ధరించి వెంటబడు కథగా పురాణములలో చిత్రింపబడినది. మరియు మృగ (బ్రహ్మ)ముగా భావింపబడినది చంద్రుని యందలి మచ్చయే. చంద్రుని పైన మచ్చ యుండుట మృగశీర్షత. మృగశీర్ష నక్షత్రము ఆర్ద్రనక్షత్రము పై నుండుట శివుని చంద్ర శీర్షత. శివగతముగా పురాణమున వర్ణింపబడుట పెక్కుఱకు పరిచితమే.

శివుడు సోముడు, చంద్రుడును సోముడు. చంద్రునికి గౌరి అధిదేవతగా గ్రహారాధనలో పూజింపబడును. గౌరియు రోహిణియు ఏకరూపులు. సోమ నామార్థ స్వరూపులగుటచే చంద్ర రుద్రులకభేదము. ఏకశబ్దగత భిన్నార్థములు ఏకరూపముగా (వినువారి కేకరూపముగా) తోచుననుట ఆలంకారికులకు సమ్మతమే. ఆకాశమున మృగశీర్ష రోహిణిని వెంబడించునట్లుండుట, రోహిద్భూత

(రోహిణిని) వెంబడించుట, చంద్రబ్రహ్మాభిన్నకృత్యముగా రూపింప బడినది. ఆర్ద్రానక్షత్రము (చంద్రబ్రహ్మాభిన్న) మృగమును (మృగశీర్ష నక్షత్రమును) వెంబడించుట శివుడు బ్రహ్మను శిక్షించుటకు వెంబడించుట భల్లూకము మృగమును వెంబడించునట్లున్నది. నక్షత్రమునకు ఋక్షమను పేరు గూడనున్నది. ఋక్ష శబ్దమునకు ఎలుగుగొడ్డు అను అర్థము కూడ నున్నది. మృగశీర్ష నక్షత్రమునకు మృగము, చంద్రుడను పేర్లు కూడ నున్నవి. మృగశీర్షార్ద్రా నక్షత్రములు రెండును రోహిణిని వెంబడించినట్లే యుండుట చేత మృగ (చంద్ర) ఆర్ద్రా (శివ) అభేదము కూడ ఏర్పడును. కావుననే మృగమన్నను మృగశీర్ష మన్నను ఒకే నక్షత్రము. (మృగశీర్షో మృగశ్చన్ద్రః). మృగము (చంద్రుడు) ముందు అనగా శీర్షమున ఆర్ద్రానక్షత్రము (శివుడు) నుండుట చేత శివుడు (ఆర్ద్రానక్షత్రము) చంద్రశీర్షుడైనాడు. దగ్గరగా నున్నందున శివుని (ఆర్ద్రా) చేత మృగము ధరించినట్లు కూడ వర్ణనమున్నది. ఈ మూడు నక్షత్రము లొకదానినొకటి వెంబడించుట ఈ శ్లోకములోని వర్ణనమునకు పురాణములలోని బ్రహ్మాచంద్ర మృగవ్యాధ వృత్తాంతములకు మూలము అని భావించుట కవకాశము కలదు. వెంబడించుట కామముతోనైనను క్రోధముతోనైనను కావచ్చును. మృగశీర్షా నక్షత్రము రోహిణిని వెంబడించుట కామహేతుకముగా, ఆర్ద్రా నక్షత్రము మృగమును(మృగశీర్షమును) వెంబడించుట క్రోధహేతుకముగా పూరాణములలో చిత్రింపబడినట్లూహించు కొనవచ్చును. (4) విష్ణు పక్షమున రోహిత్ అనగా లేడి, దాని నుండి పుట్టిన శిశువు (చిన్న జింక) రోహిద్భూ అని చెప్పబడును. రోహిద్భూ యొక్క భావము రోహిద్భూత అనగా చిన్న జింకగా నుండుట. అట్టి స్థితిని గతమ్ అనగా పొందిన వానిని మారీచుని ప్రజానాథునిగా చెప్పుట ప్రజలను నాథుడనగా తపింపజేయువాడు అగుట చేతనే. అభి=చుట్టు, క అనగా శిరస్సులు గలవాడు అను విగ్రహము ననుసరించి అభిక శబ్దము కాముకుడైన రావణుడు అను అర్థము నొసగును. అట్టి బహు శిరములుగల ప్ర అనగా గొప్ప సభ గలవాడగుటచేత ప్రసభుడైన రావణుని రమింప అనగా వినోదింపజేయు వాడగుట చేత లేక క్రీడింపజేయు వాడగుట చేత రిరమయిషుమ్ అనుపదము జింక శరీరముతో (ఋశ్యస్య వపుషా) మారీచుని రావణ వినోదేచ్ఛను లేక రావణుని క్రీడింపజేయు నిచ్ఛను బోధించును. ధనుష్పాణియై రాముడు దానిని



వెంబడించెను. దివమ్ అనగా స్వర్గమునకు యాతమ్ అపి పోయినను మృగవ్యాధరభసః మృగమును హింసింపవచ్చు కిరాతుడుగా భావింపఁబడిన రాముని వలన కలిగిన భయము ఇప్పటికిని (స్వర్గమునందున్నను) న త్యజతి అనగా వదలుట లేదు అని సమన్వయించు కొనవచ్చును. దుష్టుడైనను మారీచుని రామబాణ స్పర్శ స్వర్గమును చేర్చినదనుటచే రామబాణ పవిత్రత వ్యంజిత మగును. స్వర్గము చేరినను భయము మారీచుని విడవలేదనగా రాముని చూచినప్పుడు మారీచునకు కలిగిన భయము సాధారణమని వ్యంజితమగును. (5) బాణము యొక్క వేగము పెఱుగుటకు దానికి పక్షి ఱెక్కలంటించెదరు. అప్పుడు బాణము సపత్రమనబడును. పత్రియను బాణార్థక శబ్దమునకును ఇదియే అర్థము. సపత్రాకృత శబ్దము బాణము గుచ్చుకొనకున్నను గుచ్చు కొన్నట్లు బాధ పడువాడు అను అర్థమునిచ్చును. లేక భయము కలిగినప్పుడు శరీరము పులకాంకితమగును. శరీరమున రోమములు గగుర్పొడుచుట, నిక్కబొడుచుకొనుటయే శరీరము పులకాంకిత మగుట. వింజమాకిడిన యట్లు అని పులకాంకిత శరీరమునకు దృష్టాంతము చెప్పబడుట గలదు. రోమములు ఆకులవలె బయటకు వచ్చుటయే సపత్రాకృత మగుట. (6) రావణునకు స్త్రీ శిశువు (అయోనిజ) లభించుటచే రావణున కా సీత స్వదుహిత యగును. వాని మిత్రుడగుటచే మారీచునకును ఆమె స్వదుహిత యగును. కూతురగు సీతను వినోదింపజేయుటకు మారీచుడు మృగరూపమును ధరించినాడనియు ఋశ్యస్యవపుషా, రిరమయిషుమ్ అను శబ్దములను సమన్వయింపవచ్చును. (7) ప్రథమ పాదమున నాథ శబ్ద ద్విరుక్తి యమకాలంకారము నేర్పఱచును. 'ప్రసభమభికమ్', 'దుహితరమ్ గతం రోహిద్భూతం', 'రిరమయిషుమ్', 'ధనుష్పాణేర్యాతమ్', సపత్రాకృతమ్', 'త్రసన్తం, తేఽద్యాపి త్యజతి న' అను పదబన్ధములు వృత్త్యనుప్రాసాలంకారము నీశ్లోకమున నేర్పఱచును.

**అవతారిక:–** పై శ్లోకమున పరమేశ్వర క్రోధము వర్ణింపబడినది. ఈ శ్లోకమున నిష్కాముడైనను ఆతని లోకవిడంబనార్థస్త్రైణత వర్ణింపబడుచున్నది.

**శ్లో॥ స్వలావణ్యాశంసా ధృతధనుషమహ్నాయ తృణవ**
**త్పురః ప్లుష్టం దృష్ట్వా పురమథన! పుష్పాయుధమపి,**

***యది స్త్రైణం దేవీ యమనిరత! దేహార్ధఘటనా***
***దవైతి త్వామద్ధా బత వరద! ముగ్ధా యువతయః ॥ 23***

స్వలావణ్య-ఆశంసా-ధృతధనుషం-అహ్నాయ-తృణవత్-పురః-ప్లుష్టం-దృష్ట్వా-పురమథన-పుష్పాయుధం-అపి-యది-స్త్రై ణం-దేవీ -యమనిరత-దేహార్ధఘటనాత్-అవైతి-త్వాం-అద్ధా-బత-వరద-ముగ్ధాః-యవతయః.

**ప్రతిపదార్థము:-** పురమథన=ఓ పురమథనా!, యమనిరత=యమమందాసక్తి గలవాడా!, వరదా=ఓ వరదుడా!, స్వలావణ్యాశంసాధృతధనుషమ్=తన లావణ్యముయొక్క ఆధిక్యము చేత ధరించిన ధనువుగల, అహ్నాయ=శీఘ్రముగా, పురః=ఎదుట, తృణవత్=గడ్డివలె, ప్లుష్టమ్=కాల్చబడిన, పుష్పాయుధమ్ అపి= మన్మథుని కూడ, దృష్ట్వా=చూచి, యది=ఒకవేళ, స్త్రైణమ్=స్త్రీలోలునిగా, త్వామ్= నిన్ను, దేహార్ధఘటనాత్=అర్ధదేహమునందు కూర్చుటచేత, అవైతి=తెలిసికొన్నచో, అద్ధా బత=అయ్యయ్యో, యువతయః=స్త్రీలు, ముగ్ధాః=అజ్ఞానులు (అని అనుకొన వలెను).

**తాత్పర్యము:-** తన సౌందర్యాతిశయము హేతువుగా, ధనువు పట్టుకొన్నాడని కాని, పుష్పాయుధుడని కూడ చూడక, తన యమమును భగ్నమొనరించినాడన్న కారణము చేతనే తన యెదుటనే శివునిచే కాల్చబడిన మన్మథుని చూచియు పార్వతి ఆ పిమ్మట తనను అర్ధ దేహమున నిల్పుకొన్న శివుని స్త్రీలోలునిగా భావించినచో దానికి కారణము స్త్రీల అజ్ఞానము అనియే చెప్పవలెను.

**అనువాదము:-**

తన చెలువమ్ము నమ్మి విలుదాల్చు సుమాస్త్రుని గడ్డి చాడ్పునన్
దన యెదుటన్ దహింప గని తాపస ధర్మము బూని యర్ధమౌ
తనువు ఘటించు నిన్నెఱుగు స్త్రైణుని బర్వతరాజపుత్రియే
మనదగు యౌవతమ్ము వరదా! తన ముగ్ధత వీడజాలునే?

**వివరణము:-** (1) శివుడు గొప్ప తపస్వియని యమాదియోగాంగముల పట్ల ఎక్కువ ఆసక్తి కలిగి కామమునకు దూరముగా నుండు వాడని తెలిసియు, పార్వతి సౌందర్యాతిశయము సాయమున పుష్పబాణముల ప్రయోగించి శివుని కాముకుని జేయవచ్చునను ధైర్యముతో ధనువు చేతబట్టిన మన్మథుని, పువ్వులను



వేసి పూజించినాడని కరుణింపక, తనకు పార్వతి యందు కామము కలిగించి తన తపస్సునకు యమాది యోగ సాధనకు భంగము కలిగించినాడని రోసము వహించి, పార్వతితో తనకు వివాహము ఆ తరువాత తారకాసుర సంహారము చేయగల పుత్రుని కలుగునట్లు చేయదలచిన దేవతల కోరిక దీర్చుటకే ఈ పని చేసినాడని తలపక సర్వజ్ఞుడయ్యు మన్మథుని తన యెదుటనే గడ్డివలె కాల్చి వేయగా జూచిన పార్వతి, తరువాత ఎంతో తపమొనరించి శివదయను సంపాదించి ఆ దయచేత తానే తనకు అర్ధశరీరమొసగి మన్నించినాడని తలపక, శివుని స్త్రీలోలునిగా ఒకవేళ ఆమె భావించినచో అది ఆమె తప్పు కాదు. అది ఆమె ఆడతనము అనగా అజ్ఞానము యొక్క తప్పు అని ఈ శ్లోకము నిరూపించుచున్నది. (2) విష్ణు పక్షమున అర్ధఘటనాదవ=అర్ధ ఘటనమును కాల్చిన వాడా! అనగా రామావతారమున సీతతో సగము (కొంత) కాలము మాత్రమే సుఖముగా గడిపి మిగిలిన (సగము) కాలము ఆ సీతకు దుఃఖము అను అగ్నిని కలిగించిన అగ్నీ అని పిలువదగిన ఓ విష్ణూ, యమ నిరతదేహా= యమము అనగా మనస్సును పరపురుషుల వైపు పోనీయని గుణము, దాని యందు నిశితమైన ఆసక్తి గల దేహము గలది అనగా పతివ్రతయగు సీత, పురమథన పుష్పా=శరీరమును పీడించు పూవులు గలది అనగా పుష్ప స్పర్శను గూడ సహించని సౌకుమార్యము గలదియై, త్వామ్=రామ రూపుడవైన నిన్ను, సీతను రావణాసురుని నుండి కాపాడకపోయినచో అపకీర్తి కలుగునని మాత్రమే రావణుని చంపి నిన్ను వాని చెఱనుండి విడిపింపగా, సా=ఆమె, స్వలావణ్యాశం =తన సౌందర్యమునందు ఆశ కలవానినిగా రాముని స్త్రీలోలునిగా తలచుట ఆమె తప్పు కాదు. తృణవత్=గడ్డివలె పురః=పట్టణము యొక్క, ప్లుష్టమ్= దహించుటను, (ఆ) యుధమ్ అపి= యుద్ధమును కూడ చూచియు ఇది యంతయు తన యందలి సౌందర్యాతిశయము ననుభవించుట కొఱకే చేసినాడని భ్రమించుటయే సీతయొక్క ఆడుతనము (అజ్ఞానము) చేసిన తప్పు అని ఈ శ్లోకము నిరూపించును. ఆడువారి కెక్కువ ముగ్ధత (అనగా) అజ్ఞాన ముందునని భావము. (3) రెండవ పాదమున పకార బహువారావృత్తి నాల్గవ పాదమున తకార బహువారావృత్తి వృత్త్యనుప్రాసాలంకారము అను శబ్దాలంకారమును, దేవి ముగ్ధత అను విశేషము యువతి ముగ్ధత అను

సామాన్యముచే సమర్థింపబడినందున అర్థాంతరన్యాసాలంకారమను అర్థాలంకారమును ఈ శ్లోకమున ఏర్పరచుచున్నవి.

**అవతారిక:–** పై శ్లోకమున పరమేశ్వరుని నిష్కామత చెప్పబడినది. ఈ శ్లోకమున పరమేశ్వరుని మంగలామంగల శీలము భక్తులకు అమంగలముల తొలగించు మంగల స్వరూపమే అగునని చెప్పబడుచున్నది.

శ్లో॥ ***శ్మశానేష్వాక్రీడా స్మరహర! పిశాచాః సహచరా***
***శ్చితాభస్మాలేపస్స్రగపి నృకరోటీపరికరః***
***అమఙ్గల్యం శీలం తవ భవతు నామైవమఖిలం***
***తథాపి స్మర్తౄణాం వరద! పరమమ్మఙ్గలమసి॥ 24***

శ్మశానేషు–ఆక్రీడా–స్మరహర–పిశాచాః–సహచారాః–చితా–భస్మ–ఆలేపః –స్రక్–అపి–నృ–కరోటీ–పరికరః–అమంగల్యం–శీలం–తవ–భవతు–నామ– ఏవం–అఖిలం–తథా–అపి–స్మర్తౄణాం–వరద–పరమం–మంగళం–అసి.

**ప్రతిపదార్థము:–**స్మరహర!=మన్మథుని చంపినవాడా!, వరద=వరమునిచ్చువాడా!, శ్మశానేషు=శ్మశానములందు, ఆక్రీడా=ఆట లేక విహారము, పిశాచాః= పిశాచములు, సహచరాః=కలసి తిరుగు వారు, చితాభస్మ=చితిలోని బూడిద, ఆలేపః=మైపూత, స్రక్=హారము, నృ కరోటీ పరికరః=మనుష్యకపాలముల సమూహము, ఏవమ్=ఇట్లు, తవ=నీ యొక్క, అఖిలమ్=మొత్తము, శీలమ్= శీలము, అమఙ్గల్యమ్=అమంగల సంబంధి, భవతు నామ=అగుగాక, తథాఅపి =అట్లయినను, స్మర్తౄణామ్=స్మరించువారికి, పరమమ్=గొప్ప, మఙ్గలమ్= శుభము, అసి=అయి ఉన్నావు.

**తాత్పర్యము:–** శ్మశానములందు విహారము, పిశాచములు సహచరములు, కాటి బూడిద మైపూత, హారము మనుష్యుల పుఱ్ఱెల సమూహము. ఇట్లు నీ శీలము అమంగల సంబంధి అయినను నీవు స్మరించు వారికి మంగల మూర్తివి అగుచున్నావు.

**అనువాదము:–**

క్రీడలు కాడులందు, కదురేగు పిశాచులే తోడు నీడలా
బూడిద పూత హారములు పున్కల పేర్ల శివంపు శీలమున్



వీడకయుండు గాక నిను వీడ కెడందను వేడు వారికిన్
వీడక యుండు మంగళము విశ్వమునందున నీవె గావొకో

**రెండవ ప్రతిపదార్థము:–** శ్మశానేషు=శ్మశానములవంటి ఇండ్ల యందు, ఆక్రీడా= కొంచెము వినోదము లేక సుఖము, స్మరహర పిశాచాః స్మర=వివేకమును, హర= హరించు పిశాచముల వంటి భార్యా పుత్రాదులు, సహచరాః=కలసి చరించు వారు, ఆలేపః=మైపూత, చితాభస్మ=శవము వంటి శరీరమునకు ఏ పూత యైనను చితాభస్మము వంటిదే, స్రక్ అపి=హారము కూడ, నృకరోటీ పరికరః =రక్త మాంసాది యుక్త శరీరమునకు – మనుష్యుల పుఱ్ఱెల దండయే, ఏవమ్= ఇట్లు, తవ=నీ యొక్క, నామ=పేరును, స్మర్తౄణామ్=స్మరించువారి యొక్క, శీలమ్=శీలము, అమంగల్యమ్=అమంగల సంబంధియై, భవతు=అగుగాక, స్మర్తౄణామ్=స్మరించువారికి,అఖిలమ్=సఫలము, పరమమ్=గొప్ప, మంగలమ్ =మంగలమూర్తివి, అసి=అగుదువు.

**తాత్పర్యము:–** నిన్ను స్మరించువారు శ్మశానము వంటి ఇండ్లలో నివసించుచు సుఖమును పొందెదరు, దయ్యముల వంటి భార్యాపుత్రాదులతో కలసి చరించెదరు. కాటిలో శవము వంటి శరీరమునకే పూత పూసినను అది కాటి బూడిద వంటిదే. ఏ రత్న కాంచన హారమైనను రక్త మాంసాదులు గల శరీరమునకు అది మనుష్యుల పుఱ్ఱెల దండ వంటిదే. ఇట్లు వారి శీలము అమంగలమ్మైనను సఫలమే. నీ నామము స్మరించు వారికి నీవు మంగలములనే ఒసగెదవు.

**వివరణము:–** నీ నామము స్మరించువారికే నీవు మంగలమూర్తి వగుచో నిన్ను స్మరించువారికి నీవు మంగలమూర్తివగుటలో వింత యేమున్నది? గృహస్థులకు గృహము అల్పసుఖమును మాత్రమే ఇచ్చును. అది అల్పమైన ఆట వినోదము మాత్రమే. ‘ఆ క్రీడా’ శబ్దములో ‘ఆ’ ఈషదర్థకము కావున పై అర్థము లభించును. పిశాచములు మనుష్యులపై ఆవేశించి వారి జ్ఞానమును అప హరించుట లోకమునందు ప్రసిద్ధము. అట్లే భార్యాపుత్రాదుల భరణమునకై అవివేకవంతములైన కృత్యములు గృహస్థులొనరించుటయు ప్రసిద్ధమే. కావున భార్యాపుత్రాదులు స్మర(వివేక)హర పిశాచ సదృశములని చెప్పుటకు పిశాచములు

అని చెప్పబడినది. ఒక్కొక్కప్పుడు భార్యా పుత్రాదులు గృహస్థుని యందు శత్రుభావము తోడనే వర్తించెదరు. అయినను గృహస్థుని విడచి ఎక్కడకునుపోరు. ఒకవేళ గృహస్థుడు వెడలిపోదలచినను వెడలి పోనీయకుండ కొంతవఱకు ఆటంకములనే కల్పించుచుందురు. అట్లని మిత్రభావము కలవారా అన్నచో ధనము సంపాదించి వారికి సుఖము కలుగజేసినంత కాలము మిత్ర భావమునే ప్రదర్శించెదరు. ఆపత్సమయములలో విడచి వెళ్ళి పోవుటకును వెనుదీయరు. గృహస్థునకు తమను పోషించుట భారమైనప్పుడును వానిని విడచిపెట్టరు. వారు వెంటనే ఉండి మరింత క్రుంగిపోవునట్లు చేయుదురు. ఈ శరీరము దివారాత్రము మలమునే స్రవించుచుండును. చెవులు, కన్నులు, నోరు విషయ సుఖమును ఇచ్చుచున్నను దుర్గంధమును విరజిమ్ము చుండును. కడిగిన కొంతకాలము తరువాత మరల దుర్గంధమునే విరజిమ్మును. చివరకు రోమ మూలముల నుండి వెడలు చెమట కూడ దుర్గంధమును విరజిమ్మును. స్నానము చేసిన కొంతకాలమునకే మరల దుర్గంధభూయిష్ఠ మగును. ఇట్టి శరీరమునకు ఎన్ని సుగంధ లేపములు పూసినను మరల ఆ శరీరము దుర్గంధభూయిష్ఠమే అగును. కావున దీనికి సుగంధపు అంగరాగము (మైపూత) నలదుకొన్నను ఆ సుగంధము తాత్కాలికముగనే ఉండును. కావున దానికి పూత పూసినను అది బూడిదపూతతో సమానమే. కావున ఆ పూత బూడిదయే అని చెప్పబడినది. శరీరమునందు రక్తమాంసములతో పాటు ఎముకలు ఉండును. ఇవి రక్త మాంసముకన్నను గట్టివి.వీనిని మోయకతప్పదు. వీనికి తోడు రత్నాభరణములు, ఆభరణములు (ఎక్కువ మోతలే) కాని వాని వలన నేమి ప్రయోజనము? శవము వంటి శరీరమునకు రత్నములును ఎముకలవంటివే. కావున అవి మనుష్యుల పుఱ్ఱెలమాల. రత్నాలహారమును వేసి కొన్నను మోత ఇష్టమున్న వారికి ఒక్కటియే. ఇట్లు గృహ, భార్యాది ఆలేప హారములు శ్మశాన పిశాచ చితాభస్మ మనుష్య శిరోస్థి బృందములుగా ఆరోపింపబడుటచే వాని ఔపమ్యముల వ్యంజించు రూపకాలంకార మీ శ్లోకమున నేర్పడియున్నది. స, ర, ల, అను వర్ణముల బహువారావృత్తిచే వృత్త్యనుప్రాసాలంకారమేర్పడి యున్నది. పదవ శ్లోకము మొదలు ఈ శ్లోకము వరకు పరమేశ్వరుని పరిమిత గుణ సాకార మహిమ వర్ణింపబడినది.



**అవతారిక:-** పై శ్లోకమున పరమేశ్వరుడు పరమమంగల (సుఖ) స్వరూపుడని చెప్పబడినది. ఈ శ్లోకమున ఆ పరమేశ్వరుని పరమ మంగల స్వరూపము విద్వదనుభవ (ప్రత్యక్ష) గోచరమని చెప్పబడుచున్నది.

**శ్లో॥** ***మనః ప్రత్యక్చిత్తే సవిధమవధాయాత్తమరుతః***
***ప్రహృష్యద్రోమాణః ప్రమదసలిలోత్సఙ్గితదృశః।***
***యదాలోక్యాహ్లాదం హ్రద ఇవ నిమజ్జ్యామృతమయే***
***దధత్యన్తస్తత్త్వం కిమపి యమినస్తత్కిల భవాన్॥*** ***25***

మనః-ప్రత్యక్-చిత్తే-సవిధం-అవధాయ-ఆత్తమరుతః-ప్రహృష్యత్-రోమాణః-ప్రమద-సలిలోత్సంగిత- దృశః-యత్-ఆలోక్య-ఆహ్లాదం-హ్రదే -ఇవ-నిమజ్జ్య-అమృతమయే-దధతి-అంతః-తత్త్వం-కిం-అపి-యమినః -తత్- కిల-భవాన్.

**ప్రతిపదార్థము:-** ప్రత్యక్=అంతర్ముఖమైన, చిత్తే=హృదయమున, మనః= మనస్సును, సవిధమ్=వివిధ సాధనల ననుసరించి, ఆత్తమరుతః=గాలినిస్వాధీన మందుచుకొన్నవారై, అవధాయ=నిరోధించి, ప్రహృష్యద్రోమాణః=నిక్కపొడుచు కొన్న రోమములు గలవారై, ప్రమదసలిలోత్సంగిత దృశః=ఆనందబాష్పము లుప్పొంగిన కన్నులు కలవారై, యమినః=యమము గలవారు (యోగులు), అమృతమయే=అమృతమయమైన, హ్రద ఇవ=మడుగునందువలె, నిమజ్జ్య= మునిగి, కిమపి=ఏదో, అంతస్తత్త్వమ్=లోపలి సత్యమైన, యత్=దేనిని, దధతి= ధరించెదరో, తత్=అది, భవాన్ కిల=నీవు గదా!

**తాత్పర్యము:-** ప్రాణాయామ మొనరించి, మనస్సునంతర్ముఖమొనరించి ప్రత్యాహారాది పూర్వకముగా హృదయమున నిల్పి, రోమాంచము, ఆనంద బాష్పములు గలవారై యోగులు, అమృత హ్రదమున మునిగినట్లు ఏ లోపలి తత్త్వమైన దేనిని ధరించెదరో ఆ తత్త్వము నీవే గదా!

**అనువాదము:-**

వాయు నిరోధమున్ సలిపి స్వాంతము గూరిచి ప్రత్యగాత్మలో
బాయక రోమముల్ నిలువ బాష్పము కన్నుల బొంగుచుండగా
నా యమృత హ్రదాంతరమునందు మునింగినట్లు యోగులున్
హాయిగ గాంచి సంతసము నందెదు తత్త్వము నీవె కావొకో

**వివరణము:-** పరాక్కు అనగా బయటకు పోవునది (ఇంద్రియము) ప్రత్యక్కు అనగా లోపలకు పోవునది. పోగలిగినంత లోపలకు పోయినచో ఇక పోవుటకు లోపల అనునది ఏదియు నుండని చోటు శరీరము లోపలనే ఉండు ఆ ఆత్మను కూడ ప్రత్యక్కు అందురు. అట్లే బయటకు పోగలిగినంత పోయి ఇక బయట అనునది ఏమియు నుండని చోట శరీరము వెలుపల ఉండు పరమాత్మ పరమని చెప్పబడును. బయటి ప్రపంచము మిక్కిలి విశాలము కావున ఆత్మను శరీరము లోపలికి పోయి పొందుట కొంత సులభము. దానికి తగిన సాధనములను పతంజల్యాది మహర్షులు స్వానుభవద్వారమున రూపొందించి గ్రంథస్థముల నొనరించినారు. వానిలో మొదటిది యమము. ఇందు అహింస, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము, అపరిగ్రహము అను ఈ అయిదు గుణములకు యమము అని పేరు పెట్టబడినది. ఇట్టి యమములు గలవాడు యమి అని పిలువబడును. ఇట్టి యమము గలవారు నియమములను అనగా శౌచ సంతోష స్వాధ్యాయేశ్వర ప్రణిధానములు అను వానిని కూర్చుకొనవలెను. వారొకచోట ఏకాంత ప్రదేశమున కూర్చొనవలెను. కూర్చొను విధములు ఆసనములు అని చెప్బబడును. ఆ తరవాత ప్రాణాయామము చేయవలెను. ఇందు నాల్గు విధము లున్నవి. మొదటిది రిక్తకము. ముందుగా లోపలి నుండి గాలిని బయటకు నిశ్వసించవలెను. సాధారణముగా మనము నిశ్వసించిన వెంటనే ఉచ్ఛ్వ సించెదము. గాలిని బయటకు విడచుట నిశ్వాసము అనబడును. ఈ ఉచ్ఛ్వాసము క్రమ పద్ధతిలో మెల్లగా పీల్చుకొనుట పూరకమనబడును. ఇది రెండవది. అట్లు గాలిని పీల్చుటను ముగించిన పిమ్మట కొంతకాలము భ్రూమధ్యమున నిలుపవలెను. మూలాధారాది చక్రములలో నెచటనైన గాలి లేక శరీరమునందలి ఏ భాగమునందైనను గాలిని నిలుపవచ్చును కాని భ్రూ మధ్యమున నిలుపుట శ్రేష్ఠము. 'భ్రువోర్మధ్యే ప్రాణమావేశ్య సమ్యక్' అని భగవద్గీత భ్రూమధ్య ప్రాణావేశమునే పేర్కొనుచున్నది. ఆ తరువాత పూరక కాలమునకు రెండింతలకాలమున మెల్లగా గాలిని బయటకు విడువవలెను. ఇది మూడవ విధము. దీనిని రేచక మందురు. భ్రూమధ్యమున ప్రాణవాయువును నిలుపుట ఈ నాల్గువిధములలో ముఖ్య మైనది. దీనికి కుంభకమను పేరున్నది. రేచకము, రిక్తకము, పూరకము, కుంభకము అను వరుసలో ఇది నాల్గవదియని



చెప్పవచ్చును. యోగశాస్త్ర గ్రంథములలో పెక్కింటిలో రిక్తకము పేర్కొనబడలేదు. వానిలో 'ప్రాణాయామ స్త్రిధామతః' అని చెప్పబడినందున రేచకము, పూరకము, కుంభకము అను మూడును ప్రాణాయామములని చెప్పబడును. కాని ఈ మూడింటిని కలిపి ఒక ప్రాణాయామముగానే సాధారణముగా పేర్కొనబడు చున్నది. వీనిలో కుంభకము ఎంత ముఖ్యమనగా ప్రాణాయామమనగా కుంభక మొక్కటియే అన్నంత ముఖ్యము. ఆత్తమరుతః అను సమాసమీయర్థమునే వ్యంజించును. కుంభక కాలము యొక్క దీర్ఘకాలికత ననుసరించియే యోగసాధన లాభములు ఆధారపడియున్నవనుటయు వ్యవహారమున నున్నది. కాని యమ నియమములు యోగ సాధనమునకు పునాదులని చెప్పవలెను. వానిని విడచి ఆసన ప్రాణాయామములనే సాధన చేయువారు నేడు యోగులుగా పేర్కొనబడు చున్నారు. యోగాభ్యాసము విద్యాలయములలో ఈ మధ్య విద్యార్థులచే చేయింప బడుచున్నది. కాని యమ, నియమములు వారిచే అభ్యసింపజేయబడకుండుటచే దాదాపు అది ఆరోగ్య కార్యక్రమముగా మిగిలిపోవుచున్నది. కాని ఆధ్యాత్మిక కార్యక్రమముగా సాగుట లేదు. (2) ప్రత్యక్శబ్దము ప్రత్యాహారమను ఐదవ యోగసాధనమును సూచించును. ప్రత్యాహారమనగా బయటనున్న విషయముల నుండి ఇంద్రియముల మరల్చుట అనగా మనస్సులో నుండి బయట విషయము లను గ్రహించుటకు మనస్సులో నుండి బయటకు పోయిన ఇంద్రియములను తిరిగి మనస్సులోనికి (మనసు యొక్క సాయముచే) చేర్చుట. (3) చిత్తే యను శబ్దము ప్రత్యాహారానంతరికమైన ధారణను సూచించును. ధారణ అనగా ఒక (చోట) దేశమున మనసును నిల్పుట. దీనికి సమూహావలంబనమను పేరున్నదని మధుసూదన సరస్వతి చెప్పెను. ఒక గదిలోనికి తొంగి చూచినప్పుడు ఆ గదిలోని వస్తువులన్నియు ఒకేసారి కనబడును. ఆ వస్తువుల సమూహము ఆ జ్ఞానమున విషయమగును. కావున అది సమూహా(వ)లంబనమనబడును. వస్తుబాహుల్యము జ్ఞానమున విషయమగుటచే నిది ఏకాగ్రత కాదనియే చెప్పవలెను. అందువలననే ఇది ధ్యానము యొక్క పూర్వాంగమే కాని ఉత్తరాంగమైన సమాధి కాదు. సమాధిలో (సవికల్పసమాధిలో) ఏకవిషయక జ్ఞానమే ఉండును. (4) అవధాయ అను పదము మనస్సు లేక చిత్తము యొక్క వృత్తులలో నేక విషయత్వమును సూచించుచున్నది. ధ్యాన (సవికల్ప) సమాధులలో ప్రత్యయైకతానత సమానమే

యైనను ప్రత్యయైకతానతలో మధ్య మధ్య ధ్యానములో వ్యవచ్ఛేదముండును. సమాధిలో ఉండదు. ఇది ధ్యాన సమాధుల లోని భేదము. నిర్వికల్ప సమాధిలో చిత్తవృత్తుల నిరోధము కలుగును. ఇదియే యోగము. సవికల్ప సమాధ్యంతము లైన ఎనిమిది దీనికంగములగుటచే యోగాంగము లెనిమిది అని యోగశాస్త్రము చెప్పినది. (5) ఇంతవరకు యోగసాధన (కారణము) లు ప్రథమపాదమున సూచింపబడిన వానిని వివరించుట జరిగినది. రెండవ పాదమున దీని ఫలము (కార్యము)లు చెప్పబడినవి. వానిలో పాద పూర్వార్ధమున రోమాంచము పాదోత్తరార్ధమున ఆనందబాష్పములు చెప్పబడినవి. అలంకారశాస్త్రమున రోమాంచ బాష్పములు శృంగార రసానుభావములుగా పేర్కొనబడినవి. అవి ఇట శాంత రసాను భావములుగా గ్రహించవలెను. (6) శ్లోకము యొక్క ఉత్తరార్ధమున అద్వితీయాత్మానుభవము వివరింపబడినది. వాస్తవమున కది మాటలకందనిదే యైనను యథాశక్తి మాటలలో వివరింప బడినది. అప్పుడు అనగా అద్వితీయాత్మానుభవసమయమున అమృత హ్రదమున మునిగినట్లని పించునని చెప్పబడినది. అమృత హ్రదములోని కించిదమృతమును స్పృశించిననే ఎంతో ఆనందము కలుగుననగా ఇక అందు మునిగిన కలుగు ఆనందము నేమని చెప్పగలము? అది అనుభవించ వలసినదే. ఏ తత్త్వము ననుభవించి యోగులు అనిర్వచనీయానందము ననుభవించుచున్నారో ఆ తత్త్వము పరమాత్మ యైన నీవే యని కవి తన అనుభవమును అనుభవస్వరూపుడైన పరమాత్మకే నివేదించుచున్నాడు. నివేదించుటలో పొరపాటో, చేతకాని తనమో ఉన్నను ఆయన సరిగానే గ్రహింపగలడు గదా! దధతి అను శబ్దము అంతకుముందున్న ఆత్మయే ఇప్పుడు ధరింపబడుచున్నది, ఇంతకు ముందు ధరింపబడలేదు అని వ్యంజించును. దీనిని బట్టి ఆత్మ నిత్యత్వము వ్యంగ్య మగును. మూడవ పాదమునందలి పూర్వార్ధోత్తరారంభముల లోని ప్ర శబ్దము ఆత్మానందము లౌకికానందము కాదని వ్యంజించును. (7) ఆత్మకు చైతన్యము గుణము అనగా ఆత్మ జడము కావుననే నిద్రలో జ్ఞాతము గోచరించదు అని చెప్పు పూర్వ మీమాంసకుల యొక్క, తార్కికుల యొక్క వాదము మరియు ఆత్మ చైతన్య స్వరూపమే కాని ఆనందరూపము కాదు అను సాంఖ్యుల వాదమును ఈ శ్లోకము నిరాకరించుచున్నది. యోగులు తమలో ననుభవించు తత్త్వము పరమాత్మయే



అని చెప్పుట చేత, లోని తత్త్వము మనశ్చిత్తాదులకతీతమని చెప్పుటచేతను జీవాత్మ పరమాత్మైక్యము లేక ప్రత్యక్ పరైక్యమునే అనగా అద్వైతమునే సిద్ధాంతముగా కవి భావించుట వ్యంగ్య మగును. (8) 'సవిధమవధాయ, యదాలోక్యాహ్లాదం, హ్రద ఇవ దధతి' అను పదబన్ధములలో వృత్త్యను ప్రాసాలంకారమున్నది. రెండవ పాదమున 'ప్ర' లకు వర్ణమైత్రి మూడవ పాదమున యదా....... హ్రద అను ప్రాస యతియు నున్నవి. (9) శ్రుతి యందు 'మనో హృదయే హృదయమ్మయి' అని ఉండుట చతుర్విధాంతఃకరణమునకు భిన్నమైనది హృదయమని ఆ హృదయము ఈ శ్లోకమునందలి చిత్త శబ్దముచే చెప్పబడినదని, ఈ శ్లోకము నందలి చిత్తము చతుర్విధ అంతఃకరణ భేదమైన చిత్తము కాదనియు గమనింపవలసియున్నది. (10) ఈ శ్లోకమున తత్త్వమసి అను వాక్యములోని త్వమ్ పదము లక్ష్యార్థము శుద్ధ చైతన్యమనునది స్పష్టముగా ప్రత్యక్శబ్దముచే సూచింపబడినది.

**అవతారిక:–** పై శ్లోకమున విద్వదనుభవ (ప్రత్యక్ష) గోచరమాత్మ తత్త్వమని చెప్ప బడినది. ఈ శ్లోకమున సర్వము పరమేశ్వరుడే అను సిద్ధాన్తము (అనుమాన ప్రమాణ సిద్ధము) అని చెప్పబడుచున్నది.

***శ్లో॥ త్వమర్కస్త్వం సోమస్త్వమసి పవనస్త్వం హుతవహ***
***స్త్వమాపస్త్వం వ్యోమ త్వము ధరణిరాత్మా త్వమితి చ।***
***పరిచ్ఛిన్నామేవం త్వయి పరిణతా బిభ్రతు గిరం***
***న విద్మస్తత్త్వం వయమిహ తు యత్త్వం న భవసి॥ 26***

త్వం–అర్కః–త్వం–సోమః–త్వం–అసి–పపనః–త్వం–హుతవహః–త్వం –అపః–త్వం–వ్యోమ్–త్వం–ఉ–ధరణిః–ఆత్మా–త్వం–ఇతి–చ–పరిచ్ఛిన్నాం –ఏవం–త్వయి–పరిణతాః–బిభ్రతు–గిరం–న–విద్మః–తత్–తత్త్వం–వయం –ఇహ–తు–యత్–త్వం– న–భవసి.

**ప్రతిపదార్థము:–** త్వమ్=నీవు, అర్కః=సూర్యుడవు, త్వమ్=నీవు, సోమః= చంద్రుడవు, త్వమ్=నీవు, పవనః అసి=గాలివగుదువు, త్వమ్=నీవు, హుతవహః =అగ్నివి, త్వమ్=నీవు, ఆపః=జలమువు, త్వమ్=నీవు, వ్యోమ=ఆకాశము, త్వమ్ ఉ=నీవే, ధరణిః=భూమివి, ఆత్మా=యజమానుడు (క్షేత్రజ్ఞుడవు), ఇతి=అని,

త్వయి=నీయందు, పరిణతాః=పరిణతబుద్ధిగలవారు (పండితమ్మన్యులు లేక మూర్ఖులు), గిరమ్=వాక్కును, బిభ్రతు=భరింతురు గాక, వయమిహ తు=మేము మాత్రము, యత్=ఏది, త్వమ్ న భవసి=నీవు కావో, తత్=ఆ, తత్త్వమ్= తత్త్వము, నవిద్మః=ఎఱుగము.

**తాత్పర్యము:–** సూర్య చంద్రాగ్ని వాయు జల భూమ్యాకాశ క్షేత్రజ్ఞ రూపములైన అష్టమూర్తులు నీవే అయి యున్నావు అని విద్వాంసులే మాటయైన చెప్పనీ. మేము మాత్రము నీవు తప్ప మరొక తత్త్వమున్నదనుటయే యెఱుగము.

**అనువాదము:–**

ధరణివి వారివగ్నివి సదాగతివర్కుడవంబుజారివం
బరమవు నాత్మవంచు పలుభంగుల నల్పములైన వాక్కులన్
బరముడవైన నిన్నుఁటిచి వాకొననీ పరిణాహబుద్ధు లే
మరయము నీవు కాని దొక యర్థమునేని జగమ్మునంతటన్

**వివరణము:–** శివుని కష్టమూర్తియను పేరున్నది. పంచభూతములు, సూర్య చంద్రులు యజమానుడు లేక క్షేత్రజ్ఞుడు అను నీ యెనిమిదియు శివుని మూర్తులు. అనగా శరీరములు. వానిలో (వానికి) శివుడాత్మయై యున్నాడు. మనలో కూడ ఆత్మ ఉండును. ఆ ఆత్మకు యజమానుడు లేక క్షేత్రజ్ఞుడు అను పేర్లున్నవి. మన అనగా ఆత్మకు జీవాత్మకు కూడా శివుడాత్మ. ఆ శివునకు మన ఆత్మ కూడ ఒక మూర్తియే. అని కొందుఱు విద్వాంసులు చెప్పుదురు. ఈ ప్రపంచమంతయు నీ ఎనిమిది మూర్తులతోనేనిండియున్నది కావున ఈ బ్రహ్మాండ మంతయు ఆ శివునకు శరీరము.మన శరీరమునందు కూడ ఈ మూర్తులున్నవి. ఇవి ఆ బ్రహ్మాండములోని మూర్తుల అంశములే. కావున మన శరీరము పిండాండము లేక పిండము అనబడును. పిండాండములోను పంచభూతముల యొక్కయు సూర్యచంద్రుల యొక్కయు అంశములున్నవి. ఈ అంశములు స్థూలములుగాను, సూక్ష్మములు గాను ఉన్నవి. శివుని స్థూలమూర్తులు బ్రహ్మాండ మనబడు ఆయన స్థూల శరీరము యొక్క అంశములు. తదంశములతో నేర్పడిన మన స్థూల శరీరమున గూడ అవి తదంశములే. ఆ శివునితో ఈ మూర్తుల సూక్ష్మాంశములే దేవతలు అని చెప్పబడును. కావుననే మనమీ శ్లోకమున చెప్ప



బడిన సూర్యచంద్రాగ్న్యాదులను దేవతలని వ్యవహరించెదము. ఈ దేవతలే మన సూక్ష్మ శరీరమున ఇంద్రియములుగా (పంచజ్ఞానేంద్రియములు వాని బుద్ధులుగా) పేర్కొనబడుచున్నవి. మనలోని ఆత్మయు శివుని యొక్క అంశమే. అని ఆ విద్వాంసుల అభిప్రాయము కావచ్చును. ఇంతకు అట్లు చెప్పువారు పరిణత బుద్ధులు అని ఈ శ్లోకమున చెప్పబడినది. పరిణత శబ్దము వ్యతిరేక లక్షణావృత్తితో గాని అపరిణత బుద్ధులు అని కూడ అర్థమునిచ్చును. ఇట్లనుటకు కారణమేమనగా సర్వము పరమాత్మయే అయి ఉండగా భూమి ఆయన మూర్తియని జలమాయన మూర్తియని పరిచ్ఛిన్నమైన వాక్కును భరించువారు అనగా పల్కువారు పరిణత బుద్ధులు, ప్రాజ్ఞులు అని చెప్పుట యెట్లు? కావున వారపరిణత బుద్ధులే. ఇది పూర్వార్ధ వివరణము. (2) ఎవరో ఏమో చెప్పెదరు. అంత మాత్రమున వారపరిణత బుద్ధులని నిందించుట గాని, పరిణత బుద్ధులని స్తుతించుట గాని యెందులకు? ఎవరైన నేమి? వారేమి చెప్పినను చెప్పుదురు గాక. ఆ వాక్కులతో మాకేమి పని? మేము మాత్రము శివుడు తప్ప మిగిలిన దేమియు లేదందుము. అంతయు శివుడే యందుము. శివుడు కాక అష్టమూర్తు లున్నవా? ఉండినను అవి శివునకు భిన్నములా అభిన్నములా? అని ఎన్నో ప్రశ్నలేర్పడును. శివునకు భిన్నములనినచో అవి నిత్యములా? అనిత్యములా? అను ప్రశ్నలేర్పడును. అనిత్యములందురా మీరు? మీరనిత్యములందురేని మేము మీ అనిత్యములను మిథ్య యందుము. నిత్యము, సత్యము అను పదములు పర్యాయములు. కావున మీ అనిత్యములు మా దృష్టిలో మిథ్యలే. అవి నిత్యములైనను శివుని కన్న భిన్నములందురా? 'ఏక మేవా ద్వితీయమ్ బ్రహ్మ' అను ఉపనిషద్వాక్యమునకు విరోధమగును. పరమాత్మ ఏకము, అద్వితీయమని ఆ వాక్యమున చెప్పబడినది. మరొక వాక్యమున 'సత్యం జ్ఞాన మనంతమ్ బ్రహ్మ' ఆ పరమాత్మ సత్యమని చెప్పబడినది. ఆ రెండు వాక్యముల ఏకమైన తాత్పర్యము ఆ పరమాత్మ అద్వితీయ సత్యము. ద్వితీయ సత్యము (నిత్యము) లేదనుటయే. మా అనుభవమున ఈ జగమంతయు మిథ్యగానే తోచినది గావున ఆ పరమాత్మయే సూర్యుడు, చంద్రుడు, అగ్ని ఇత్యాదిగా చెప్పు వాక్యములు పరిచ్ఛిన్నములనెదము. అద్వితీయ నిత్య బ్రహ్మానుభవములేని వారి వాక్యములెట్లున్నను వానిని మేము పట్టించుకొనము. మేము చెప్పునదేమనగా

శివభిన్నమేదియు మేమెఱుగమనియే. ఇది ఉత్తరార్ధ వివరణము. (3) ఓయీ! నీవు సూర్యాద్యష్ట మూర్తులున్నవని అవి శివరూపములని చెప్పుచున్నావు గదా! వానిలో మొదటి అంశము సూర్యాద్యష్ట మూర్తులున్నవనుట. ఆ అంశమున సూర్యాద్యష్టమూర్తులు ఒక భాగము. అవి ఉండుట రెండవ భాగము. ఉండుట అనునది బ్రహ్మ లక్షణము. 'సత్యం జ్ఞానమనంతమ్ బ్రహ్మ' అను వాక్యము నిదివఱకే ఉదహరించితిమి. అందలి సత్య శబ్దమునకు ఉనికి అనియే అర్థము. పగలు సూర్యుడున్నాడు, రాత్రి పూట లేడు (రాత్రి చంద్రుడు వెలుగు చున్నాడు, పగలు వెలుగుట లేదు) ఇత్యాది వాక్యములలో సూర్యునకు వ్యభిచారమున్నది. వ్యభిచారమనగా ఒకప్పుడుండుట, మరొకప్పుడు లేకుండుట. భూమి ఉన్న దందువు, జలమున్నదందువు, అగ్ని ఉన్న దందువు. వీనిలో భూమ్యాదులు (సూర్యాదులు) వ్యభిచరించినవే కాని ఉనికి వ్యభిచరించలేదు. కావున ఉనికి శాశ్వతము భూమ్యాదులు అశాశ్వతములు, అనిత్యములు అనగా అసత్యములు. కావుననే మేము 'బ్రహ్మసత్యమ్ జగన్మిథ్య' యందుము. ఇట్టి స్థితిలో అవి సత్యము లనుటగాని త్వదభిన్నములనుట గాని యెందులకు అని మేమాక్షేపించితిమి. పరిణత బుద్ధులని వ్యాజముగా స్తుతించితిమి. మిథ్య అననేమి? అది బ్రహ్మమా? లేక బ్రహ్మభిన్నమని వికల్పించి మామీద తర్కమును ప్రయోగించి వాదింప జూచెదవేమో? మేము మిథ్యను బ్రహ్మానన్యమందుము. నీవు బ్రహ్మానన్యముగా, బ్రహ్మభిన్నముగా జూచు దానిని మేము మిథ్య యనుచు దాని ఉనికినే తిరస్కరించెదము. నీ దృష్టితో బ్రహ్మానన్యమంటిమి గాని అది ఉన్నచో గదా బ్రహ్మ భిన్నమా, బ్రహ్మానన్యమా అను ప్రశ్నలు పుట్టుట. మిథ్యయను మమ్ములనిట్లు ప్రశ్నించుట మీకనుచితమే అగును.

అంతయు బ్రహ్మమే అన్నచో ఘటజ్ఞానము కూడ బ్రహ్మజ్ఞానమందువా? అని మమ్ము ప్రశ్నించెదవేమో? ఘట జ్ఞానమున గూడ మోక్షము మీ పక్షమున కలుగవలసి వచ్చును గదా అందువేమో? వినుము. ఘట జ్ఞానము, ఘటోపరక్త జ్ఞానము ఇట్లు ఘటాద్యుపరక్తము కాని అనగా అన్యోపరక్తము కాని జ్ఞానమే బ్రహ్మమందుము. అదియే మోక్షమందుము. ఇక నీ ప్రశ్నలకవకాశమేమున్నది? ఇట్లు తర్కము చేత పరమాత్మ అద్వితీయత్వము సాధించవచ్చునని ఈ శ్లోకము సూచించును. (4) విష్ణు పక్షమున అర్కాది శబ్దములు దేవతా వాచకములు.



వారు పరిచ్ఛిన్నులు గావున వారికి బ్రహ్మత్వము లేదు. తదంతర్గత బ్రహ్మ జ్ఞానమునకై, ఆదిత్యాంతర్గతహిరణ్యగర్భాత్మక పరబ్రహ్మోపాసనముపనిషత్తులలో నుపదేశించబడు అంశమును ప్రతిపాదించుటకై నీవే సూర్యుడవు, చంద్రుడవు ఇత్యాది వాక్యములు పరిచ్ఛిన్న దేవతలనపరిచ్ఛిన్న బ్రహ్మముగా పేర్కొన అపరిణత బుద్ధుల వాక్కులు అని చెప్పవలెననుట విశేషము. (5) ఇట్లు విద్వదనుభవ(ప్రత్యక్ష)ము (సదాకారముగా అన్ని వస్తువులు కనబడుట) అభేద వ్యవహార హేతువుగా, అభేదానుమానము 'ఏకమేవాద్వితీయ' మను శ్రుతి జగత్సత్యము నంగీకరించుటచే అనుపపన్నమగుట, అర్థాపత్తి అను మూడు ప్రమాణములచే బ్రహ్మ సిద్ధించునని చెప్పుట ఈ శ్లోకముయొక్క నిరూప్యాంశము. (6) పూర్వార్ధమున త్వమ్ పదము యొక్క ఆవృత్తి ఈ శ్లోక వాక్యముల కలంకారమై ఉన్నది. మూడవ పాదమున 1-9 వర్ణములకు మైత్రి, ఆది మధ్యానుప్రాసములునున్నవి.

**అవతారిక:-** పై శ్లోకమున తత్పదార్థశోధనము చేయబడినది. ఈ శ్లోకమున అఖండ వాక్యార్థము శుద్ధ చైతన్యమని అది ఓంకారమున ప్రతిపాద్యమని చెప్ప బడుచున్నది.

**శ్లో॥** ***త్రయీం తిస్రో వృత్తీ స్త్రిభువనమథో త్రీనపి సురా***
***నకారాద్యైర్వర్ణైస్త్రిభిరభిదధత్తీర్ణవికృతి।***
***తురీయం తే ధామ ధ్వనిభిరవరుంధానమణుభిః***
***సమస్తం వ్యస్తం త్వాం శరణద! గృణాత్యోమితి పదమ్॥ 27***

త్రయీం-తిస్రః-వృత్తీః-త్రిభువనం-అథో-త్రీన్-అపి-సురాన్-అకారాద్యైః -వర్ణైః-త్రిభిః-అభిదధత్-తీర్ణవికృతి-తురీయం-తే-ధామ-ధ్వనిభిః-అవ రుంధానం-అణుభిః-సమస్తం-వ్యస్తం-త్వాం-శరణద-గృణాతి-ఓం-ఇతి- పదమ్.

**ప్రతిపదార్థము:-** శరణద!=ఓ శరణాగత రక్షకా! త్రయీమ్=ఋగ్యజుస్సామ వేదములను, తిస్రః=మూడు, వృత్తీః=అవస్థలను, త్రిభువనమ్=ముజ్జగమును, అథో=మరియు, త్రీన్ సురాన్=ముప్పురు దేవతలను, అకారాద్యైః=ఆకారము

మొదలైన, త్రిభిః=మూడు, వర్ణైః=వర్ణములతో, అభిదధత్=చెప్పుచు, తీర్ణ వికృతి=వికారముల దాటిన, తురీయమ్=నాల్గవదైన, తే=నీయొక్క అణుభిః =సూక్ష్మములైన, ధ్వనిభిః=ధ్వనులతో, ధామ=స్వరూపమును, అవరున్ధానమ్= ప్రతిపాదించు, సమస్తమ్= మొత్తముగా, వ్యస్తమ్=విడిగా, ఓమితి పదమ్=ఓం అను పదము, త్వామ్= నిన్ను, గృణాతి=స్తుతించుచున్నది.

**తాత్పర్యము:–** ఋగ్యజుస్సామవేదములను జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలను భూర్భువస్వర్లోకములను బ్రహ్మవిష్ణుమహేశ్వరులను అకారోకార మకారములతో విడిగా బోధించు ఓంకారమే వికారాతీతమైన ఈ తురీయరూపమును సూక్ష్మ ధ్వనులతో ప్రతిపాదించుచు మొత్తముగా విడిగా ఓంకారము నిన్ను స్తుతించు చున్నది.

**అనువాదము:–**

మూడు జగమ్ములన్ శ్రుతుల మూర్తుల వృత్తుల మూడువ్రాలచే
నాడుచు నీ వికారములనన్నిటి దాటి తురీయమైన నీ
వీడు నణుస్వనమ్ములను వీడక రుద్ధము సేయుచోంపద
మ్మాడును నిన్ సమస్తముగ వ్యస్తముగా శరణప్రదాయకా.

**వివరణము:–** ఓం కారమున అ, ఉ, మ, అను మూడు వర్ణములున్నవి. అవర్ణము ఋగ్వేదమును, జాగ్రదవస్థను, దాని నభిమానించు వ్యష్టి విశ్వుని, సమష్టివైశ్వానరుని, భూర్లోకమును, బ్రహ్మను బోధించును. ఉవర్ణము యజుర్వేదమును, స్వప్నావస్థను, దానినభిమానించు వ్యష్టి తైజసుని, సమష్టి హిరణ్యగర్భుని, భువర్లోకమును, విష్ణువును బోధించును. మ వర్ణము సామవేదమును, నిద్రావస్థను, దానినభిమానించు వ్యష్టి ప్రాజ్ఞుని, సమష్టి అవ్యాకృతుని, స్వర్లోకమును మహేశ్వరుని బోధించును. వ్యస్తముగా ఓంకారము నామరూపాతీతముగానున్న పరమాత్మను బోధించునని మధుసూదనసరస్వతుతి అభిప్రాయపడినాడు. వ్యస్తముగా నున్న అనగా విభిన్న నామరూపాత్మకముగా నున్న పరమాత్మను సమస్తముగా అనగా సర్వాత్మక పరమాత్మను చెప్పును. అభి దధత్ అను పదము అభిధా వృత్తితో చెప్పునని సూచించును. శబ్దము, అర్థమును చెప్పుటకు ఆవశ్యక మైన వృత్తులలో అభిధ ఒకటి, మొదటిది కూడ. ఈ అభిధా



వృత్తివలన లభించు అర్థము వాచ్యము అనబడును. ఇది శబ్దగతమైన ఒక శక్తిగా శాస్త్రకారులభిప్రాయ పడినారు. తత్త్వమసి అను వాక్యములోని తత్పదము అభిధా వృత్తితో పరమేశ్వరుని చెప్పును. అనగా తత్పదము యొక్క వాచ్యార్థము ఈశ్వరుడు (పరమేశ్వరుడు). అట్లే త్వం పద వాచ్యార్థము జీవుడు. ఈశ్వరుడు సర్వజ్ఞత్వాది లక్షణములు గలవాడు. జీవుడు కించిద్‌జ్ఞత్వాది లక్షణములు గలవాడు. అసి అను పదము వీరి ఇరువురి అభేదము చెప్పును. సర్వజ్ఞుడు, కించిద్‌జ్ఞుడు విరుద్ధ విభిన్న లక్షణములుగలవారు. వీరిరువురు వ్యావహారికముగ విభిన్నులుగనే వ్యవహరింప బడుచున్నారు. జీవుడు సేవకుడు ఈశ్వరుడు సేవ్యుడు. ఈశ్వరుడు సర్వ శక్తియుక్తుడు. జీవుడు అల్పశక్తి యుక్తుడు. ఈశ్వరుడు స్రష్ట. జీవుడు సృష్టుడు. ఇట్టి విరుద్ధ, విభిన్న లక్షణములు గల జీవేశ్వరుల వాచ్యార్థముల అభేదము కుదరకపోవుటచే, అనగా అన్వయించకపోవుటచే, తత్త్వం పదవాచ్యులైన జీవేశ్వరులకు అభేదము అనుపపన్నమగుటచే ఆ శబ్దములు లక్షణావృత్తితో జీవేశ్వరైక్యమును బోధించును. తత్ పదము యొక్క వాచ్యార్థమైన సర్వజ్ఞత్వాది యుక్త చైతన్య స్వరూపుడైన ఈశ్వరునిలోని సర్వజ్ఞత్వాదులను విడిచి, చైతన్యము లక్షణావృత్తితో బోధించును. అట్లే త్వం పదము యొక్క వాచ్యార్థమైన కించిద్‌జ్ఞత్వాది యుక్త స్వరూపుడైన జీవునిలోని కించిద్‌జ్ఞత్వాదులను విడచి, చైతన్యత్వమును బోధించును. ఇట్లు ఈ రెండు పదములు విశేషణాంశములను విడచి, విశేష్యమైన (విశిష్టమైన) చైతన్య స్వరూపమును విడువకపోవుటచే ఈ లక్షణావృత్తి 'జహదజహల్లక్షణావృత్తి' యని చెప్పబడును. ఇట్లీ **'తత్త్వమసి'** అను వాక్యములోని పదముల వాచ్యార్థములు (జీవేశ్వరులు) భిన్నములు అయినను మొత్తము వాక్యము అఖండచైతన్యమునే బోధించుటచే నీ వాక్యము యొక్క అర్థము 'అఖండచైతన్యము'. పైన చెప్పబడిన 'తత్త్వమసి' వాక్యము, గురువుచే చెప్పబడినందున ఉపదేశవాక్యము అనబడును. శిష్యునకు ఈ ఉపదేశము విన్న తరువాత 'నేను బ్రహ్మ నను' అనుభూతి కల్గును. ఆ అనుభవమును బోధించు 'అహం బ్రహ్మాస్మి' అను వాక్యము అనుభవ వాక్యము అనబడును. పైన చెప్పబడిన తత్త్వమసి వాక్యములోని తత్ పదార్థ విచారము, తత్ పదార్థ శోధనమని, త్వం పదార్థ విచారము త్వం పదార్థ శోధనమని చెప్పబడును. ఇట్లు తత్, త్వం పదార్థముల శోధనముచే పైన

చెప్పబడిన అనుభవము కల్గును. అందుచేతనే పూర్వ శ్లోక ద్వయమున తత్, త్వం పదార్థ శోధనము చేయబడినది. (2) వాక్యములోని పదములలోని అర్థములను గ్రహించిన పిమ్మట మొత్తము వాక్యము యొక్క మొత్తం అర్థమును గ్రహించుటకు అవకాశము ఏర్పడును. ఈ అవకాశము ముఖ్యముగా వాక్యము ప్రయోగించు వక్త యొక్క ఇచ్ఛ ననుసరించియే గ్రహింపబడవలెను. గ్రహింప బడును కూడ. ఒక్కొక్కప్పుడు పదార్థములు కుదరని వాక్యములు కవిచే ప్రత్యేకముగా ఒక పరమార్థమును తెలుపుటకు ప్రయోగింపబడుచుండును. అట్టి వాక్యముల అర్థములు పదార్థములపై అనగా పదముల యొక్క వాచ్యార్థము లపై ఆధారపడి అన్వయించుట కుదరదు. అట్టి సందర్భమున వక్త యొక్క ఇచ్ఛ ఏమియో గ్రహించి, ఆ వాక్యముల శ్రోత పదముల యొక్క వాచ్యార్థములు అన్వయింపక పోవుట గమనించి, ఆ పదములకు అన్యార్థము గ్రహించుట జరుగును. ఇట్లు అన్యార్థము లక్షణావృత్తి ద్వారమున లభించుటకు వక్త యొక్క అర్థమును గ్రహించుటలో చెప్పితిని. అదియే వాక్యము యొక్క అర్థమును గ్రహించుటలో ముఖ్యము అని చెప్పితిని. అట్లు కానిచో వక్త చెప్పదలచిన అర్థమును గాక శ్రోత మరొక అర్థమును గ్రహించుట జరుగును. భోజన సమయమున 'సైంధవ మానయ' అని వక్త ప్రయోగించగా, సైంధవ శబ్దమున కున్న ఉప్పు, గుఱ్ఱము అను రెండర్థములలో గుఱ్ఱము అను అర్థము గ్రహించి, గుఱ్ఱమును తెచ్చిన అపహాసమునకు పాలగును. అట్లే యుద్ధమునకు పోవు సమయమున ఉప్పును తెచ్చియు పరిహాసము పొందును. కావుననే శ్రోత, వక్త యొక్క ఇచ్ఛ ననుసరించియే పదములకున్న అర్థములలో ఉచితమైన అర్థమును గ్రహింపవలెను. ఇట్లు గ్రహించిన అర్థము 'తాత్పర్యార్థము' అనబడును. ఈ తాత్పర్యమునే ఆలంకారికులు వ్యంజనావృత్తిగా గ్రహించెదరు. తాత్పర్యార్థమును వ్యంగ్యార్థముగా పేర్కొందురు. ఇట్లు పదార్థ, వాక్యార్థముల గ్రహణము అభిద, లక్షణ, వ్యంజన (తాత్పర్య) వృత్తులతో శ్రోతచే గ్రహింపబడును. (3) మూడవదైన వ్యంజనావృత్తిని ఆలంకారికులు, వైయాకరణులు తప్ప మిగిలిన శాస్త్రకారు లంగీకరింపరు. కాని వారు తాత్పర్యార్థము నంగీకరించెదరు. లక్షణావృత్తి అక్కఱలేని వాక్యముల ప్రయోగించుటలో కూడ వక్తకు తాత్పర్య ముండును. ఆహా! ఆ పనసపండు ఎంత చక్కగా పండినది అని ప్రయోగించిన వక్త యొక్క



ఇచ్ఛ (తాత్పర్యము) ఆ పండు అనుటలో ఆ పండును కోసి ఈయుమనునది. ఆ వాక్యమునుండి అర్థమును గ్రహించి శ్రోత కోసి ఇచ్చినప్పుడు గాని ఇంకను పండలేదని సమాధానము చెప్పి కోసి ఈయనప్పుడుగాని శ్రోత వక్త యొక్క ఇచ్ఛ (తాత్పర్యమును) ఊహించినట్లే. పదమునకు అభిద ద్వారా వచ్చిన అర్థము వాచ్యము. లక్షణద్వారా వచ్చిన అర్థము లక్ష్యము అని చెప్పబడును. వాచ్యార్థము నిచ్చు పదము వాచకము, లక్ష్యార్థమునిచ్చు పదము లక్షకమని చెప్పబడును. వాచ్యము, లక్ష్యము అను రెండు విధములైన అర్థములు, పదార్థములు. ఇవియన్నియు కలసిన వాక్యమున వక్త యొక్క ఇచ్ఛ ననుసరించి శ్రోతచే గ్రహించబడు అర్థము వాక్యార్థము అనబడును. వేద వాక్యములకు వక్త లేకపోయినను షడ్విధ లింగము తాత్పర్య లింగముగా మీమాంసా శాస్త్రజ్ఞులచే అంగీకరింపబడినది. జీవేశ్వర భేదమునంగీకరించు వారును ఏదో ఒక విధముగా 'తత్త్వమసి' అర్థము జీవేశ్వర భేదమే అని చెప్పుటకు యత్నించెదరు. అది (జీవేశ్వర భేదము) వారి దృష్టిలో తాత్పర్యార్థముగ భావింపబడినను షడ్విధలింగ మందు లేదు. కావున అది తాత్పర్యార్థమనుట అనుచితము. షడ్విధలింగములలో అపూర్వత ఒకటి. జీవేశ్వర భేదము లోకమున అపూర్వ విషయము కాదు. అవిద్వత్ప్రత్యక్షాది ప్రమాణ సిద్ధమే. జీవేశ్వరుల కభేదము మాత్రము అపూర్వము కావున జీవేశ్వరుల భేదము తాత్పర్యార్థము కాదు. ఇట్లే ఉపక్రమోపసంహారములు, అభ్యాసము, ఫలము, అర్థవాదోపపత్తులు అను మిగిలిన లింగములీ జీవేశ్వరాభేదమే తాత్పర్యార్థము అని నిరూపించుటకు తోడు పడును. ప్రస్తుతము వానినన్నింటినీ వివరించుట గ్రంథ విస్తరణ హేతువు అగుటచే వివరింపలేదు. (4) 'తత్త్వమసి' అను వాక్యము యొక్క ఉపదేశము వలన శిష్యునకు 'సోఽహమ్' అను అనుభవము కలుగును. 'తత్త్వమసి' వాక్యములోని తత్పదార్థ మీశ్వరుడని చెప్పియుంటిని. అట్లే 'సోఽహమ్' అను వాక్యమున సః అను తత్పదము (యొక్క పుంలింగ ప్రథమా విభక్తి ఏకవచనము) నకు ఈశ్వరుడు అనునదే వాచ్యార్థము. 'అహమ్' పదమునకు 'తత్త్వమసి' అను వాక్యములోని త్వమ్ పదమునకు వలె జీవుడనియే వాచ్యార్థము. అసి, అస్మి, అను క్రియ ఆవాక్యములలో లేకపోయినను ఉన్నట్లే భావించుకొనవచ్చును. భావించుకొన వలెను కూడ. ప్రతి దినము ఇరువది యొక్క వేల ఆరువందల ఉచ్ఛ్వాస నిశ్వాస

ద్వయములలో మనప్రాణము సోऽహమ్ పదములనుచ్చరించుచునేయుండును. ఉచ్ఛ్వాసమున 'సో' అను ధ్వని నిశ్వాసమున 'హం' అను ధ్వని గమనించువారికి వినబడును. ఈ సోऽహమ్ మంత్రము అజపా గాయత్రి అనియు చెప్పబడును. గాయత్రీమంత్రములోని **'తత్సవితుర్వరేణ్యం'** మొదటి పాదము తత్పదార్థేశ్వరుని; **'భర్గోదేవస్య ధీమహి'** అను ద్వితీయ పాదము అహం పదార్థ జీవుని; **'ధియో యోనః ప్రచోదయాత్'** అను మూడవ పాదము వారిరువురి అభేదమును అసధాతుజమైన అస్మి క్రియాధ్యాహారము ద్వారా **'సోऽహమ్'** అను మంత్రము యొక్క అర్థమునే బోధించును. ఇట్లు గాయత్రీ మంత్రార్థము, సోహం మంత్రార్థమును విభిన్నములగుటచేత 'సోऽహం' మంత్రము కూడ గాయత్రీ మంత్రము వలె గానము చేయుచుండు వారిని కాపాడునదగుట చేత దానికిని (అజపా) గాయత్రి అని పేరున్నది. ఉచ్ఛ్వాస నిశ్వాసములు ఇచ్ఛ (జ్ఞాన క్రియల) మీద అనగా కర్తృత్వము మీద నాధారపడు క్రియలు కావు. కావున జప కర్తృత్వము లేకయే సహజముగా నేర్పడు క్రియ గాన 'అజపా' అని 'సోऽహం' మంత్రజపమునకు పేరేర్పడినది. తేలినదేమనగా గాయత్రీ మంత్ర సంగ్రహ రూపమే 'సోऽహమ్' మంత్రము. 'సోऽహం' మంత్రము లోని హల్లులను తొలగించుటచే ఏర్పడు ఓం కారము 'సోऽహం' మంత్ర సంగ్రహ రూపము. తొలగించిన లేక లోపించిన సకార. హకారములు లేని ఓంకారము యొక్క అర్థము మాత్రము వాని(సకార, హకారములు)తో కూడిన 'సోऽహమ్' మంత్రము యొక్క అర్థమునే బోధించుననుట వ్యాకరణాది శాస్త్ర సంప్రదాయ బద్ధము. ఈ వివరణమునకు ప్రయోజనమేమనగా 'తత్త్వమసి', 'సోऽహమ్' వాక్యముల అర్థమే ఓంకారార్థము అని నిరూపించుట. (5) అకారము తత్పదార్థమును మకారము త్వమ్ (లేక అహమ్) పదార్థమును మధ్యలోని ఉకారము అసి (అస్మి) అను పదము యొక్క అర్థమును బోధించును.

శ్రీ శంకర భగవత్పాదులు తమ విష్ణుసహస్రనామ భాష్యమున ఓమ్ విశ్వం విష్ణుః అను పదములను వివరించుచు సమస్త విశ్వము ఓంకారమే అని ఆ విశ్వము విష్ణువే అని చెప్పెను. విశ్వమందంతట జీవేశ్వర వ్యావహారిక భేదమే ప్రతీయమానమగును. అట్లే జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థా భేదమే ప్రతీయమాన మగును. అందఱకు కనపడు జీవుని శరీరము బ్రహ్మాండములోని ఒక చిన్న



భాగము. బ్రహ్మాండము ఈశ్వరుని శరీరము. జీవుని శరీర మందఱకును కనబడును. దానికి పిండమని పేరు గలదు. పిండాండమని అనుటయు కలదు. ఈ కనపడు శరీరమున కనపడని మరొక శరీరమున్నది. ఆ రెంటికి కారణమైన మరొక శరీరమున్నది. కనబడు శరీరము స్థూల శరీరము, కనబడని శరీరము సూక్ష్మ శరీరము, ఈ రెంటికీ కారణము అయిన అజ్ఞానము కారణ శరీరము అనబడును. స్థూల శరీరము జాగ్రదవస్థకు సంబంధించినది. సూక్ష్మ శరీరము స్వప్నావస్థకు సంబంధించినది. కారణ శరీరము నిద్రావస్థకు సంబంధించినది. జీవునకు వ్యష్టి, ఈశ్వరునకు సమష్టి అను పేర్లున్నవి.

ఈ జీవుని వ్యష్టి శరీరమునభిమానించు వారు ముగ్గురు.

వ్యష్టి – జాగ్రదవస్థాభిమాని విశ్వుడు
వ్యష్టి – స్వప్నావస్థాభిమాని తైజసుడు
వ్యష్టి – నిద్రావస్థాభిమాని ప్రాజ్ఞుడు

ఈశ్వరుని సమష్టి శరీరాభిమానులు ముగ్గురు.

సమష్టి – జాగ్రదవస్థాభిమాని వైశ్వానరుడు
సమష్టి – స్వప్నావస్థాభిమాని హిరణ్యగర్భుడు
సమష్టి – నిద్రావస్థాభిమాని అవ్యాకృతుడు

జీవేశ్వరులకు ఆయా అవస్థలలో ఆయా పేర్లు శాస్త్ర వ్యవహారమున కనబడు చున్నవి. ప్రాజ్ఞుని శరీరమైన అవిద్యనుండియే వ్యష్టి సూక్ష్మ శరీరమేర్పడును. అది స్థూల శరీరపిండముగ పరిణమించును. అట్లే అవ్యాకృతిక శరీరమైన మాయ నుండియే సమష్టి సూక్ష్మ శరీరమేర్పడును. అది సమష్టి స్థూల శరీరమైన బ్రహ్మాండముగ పరిణమించును. ఈశ్వర శరీరమే జీవ శరీర కారణము. జీవేశ్వర శరీరములలో జీవేశ్వరులుందురు. వారి శరీరములలో స్థూల శరీరము లకు పుట్టుక, చావును కలవు. సూక్ష్మ, కారణ శరీరములకు బ్రహ్మజ్ఞాన నాశ్యత గలదు. బ్రహ్మజ్ఞానముచే ఈ అన్ని శరీరముల ఆత్యంతిక నాశ మేర్పడును. ప్రళయ నిద్రావస్థలలో దానికి లీనంత (తాత్కాలిక నాశము) మాత్ర ముండును. అకారము వైశ్వానర, హిరణ్యగర్భావ్యాకృతులను, మకారము విశ్వ తైజస ప్రాజ్ఞులను, ఉకారము విశ్వవైశ్వానరుల యొక్క, తైజస–హిరణ్య గర్భుల యొక్క, ప్రాజ్ఞ – అవ్యాకృతుల యొక్కయు అభేదమును బోధించును. ఈ ప్రతి

పాదనము తొలుత చెప్పబడిన ప్రతిపాదనము కన్న కొంత భిన్నమైనదని గ్రహించ వలెను. జీవునకే విశ్వ తైజస ప్రాజ్ఞ వ్యవహారము, ఈశ్వరునకే వైశ్వానర హిరణ్య గర్భావ్యాకృత వ్యవహారము అవస్థాభేదముననేర్పడియున్నది. అయినను ముఖ్యముగా, జీవుడనగా ప్రాజ్ఞుడే. తైజస విశ్వులు తదంతర్గతులు అట్లే ఈశ్వరుడనగా అవ్యాకృతుడే, తదంర్గతులు హిరణ్యగర్భ వైశ్వానరులు. కారణ శరీరమునుండియే సూక్ష్మ, స్థూల శరీరములుత్పన్నమగునని ఈవరకు చెప్పబడినది. కావున ప్రాజ్ఞుని శరీరమైన అవిద్య నుండి (నిద్ర నుండి) స్వప్న, జాగ్రచ్ఛరీరములు పుట్టుటచే తదభిమానులైన తైజస, విశ్వులును పుట్టినారని చెప్పవచ్చును. అట్లే అవ్యాకృతుని శరీరమైన మాయ నుండి సమష్టి స్వప్న, జాగ్రత్ శరీరములు, హిరణ్యగర్భ, వైశ్వానరులు పుట్టినారనియు చెప్ప వచ్చును. జాగ్రత్ దశలో జీవేశ్వర భేద స్పష్ట వ్యవహారము, స్వప్నావస్థలో జీవేశ్వర భేదాస్పష్టాభాసము ఉండును. నిద్రావస్థలో జీవేశ్వర భేదవ్యవహారమే ఉండదు. వారి అభేద స్థితియే ఉండును. కానీ జాగ్రద్ దశలో 'జీవేశ్వరైక్యరూప బ్రహ్మజ్ఞానము' కలిగిననే పై మూడు దశలు నశించును. ఈ వివరణమంతయూ వ్యస్తమైన ఓంకారములోని వ్యస్తములైన అకారోకారమకారములను పరముల అర్థము అభిధావృత్తితో బోధింపబడును. ఇదియంతయూ వ్యస్త బ్రహ్మ నిరూపణము. వ్యస్తముగా ఓంకారమను వాచకశబ్దము రూపించిన వ్యస్త బ్రహ్మ మను వాచ్యార్థము వ్యస్త బ్రహ్మ స్తుతి. (6) పై మూడు దశలు బ్రహ్మజ్ఞానమున నశించి, వికారరహితమైన (తీర్ణా వికృతి) సత్యమైన, తురీయస్థితి ఏర్పడును. ఆ తురీయ (బ్రహ్మ) స్వరూపము ఓం కారములోని మకారము తరువాత అర్ధమాత్రాది సూక్ష్మధ్వనులచే బోధింపఁబడును. అర్ధమాత్రలో బిందువు అర్ధచంద్రరోధిని, నాదనాదాంతశక్తి వ్యాపిక సమాన ఉన్మన అను సూక్ష్మ ధ్వనులుండును. వానిలో మొదటి మూడు సూక్ష్మములు. తరువాతి మూడు సూక్ష్మతరములు. ఆతరువాతి మూడు సూక్ష్మ తమములు అని చెప్పబడును. అయినను అన్నియు శ్లోకమున 'అణుభిః' అను పదము చేతనే చెప్పఁబడినవి. ఇదియంతయు సమస్తమైన ఓంకారము, సమస్తమైన బ్రహ్మను స్తుతించుట. (7) అవ్యాకృతుడైన ఈశ్వరుడు స్వాధీనమాయుడు. కావున తన తురీయ స్థితిని వీడకయే అనగా మాయలోని త్రిగుణములచేత నేర్పడు సృష్టి, స్థితి, లయములకు



సాక్షిభావము వీడకయే యుండుటచే, అవ్యాకృత, తురీయ భేదము పాటింపకయే జీవేశ్వరైక్యము, జీవబ్రహ్మైక్యము, ప్రత్యక్పరైక్యము అను వ్యవహారములు శాస్త్ర గ్రంథములలో చేయఁబడినవి. శైవ-వైష్ణవాభిమానమును, శైవ-వైష్ణవ పారమ్యమును పురస్కరించుకొని, ఈశ్వరుని విష్ణువనుట గానీ, శివుడనుటగానీ పౌరాణిక వ్యవహారము. చతుర్ముఖబ్రహ్మకు ఈశ్వర వ్యవహారము పురాణము లలో అల్పముగానే ఉన్నది. శైవ పురాణములలో విష్ణువునకు జీవత, వైష్ణవ పురాణములలో శివునకు (రుద్రునకు) జీవత చెప్పఁబడినవి. ఈ స్తోత్రము నందును, 'తవైశ్వర్యం యత్నాద్యదుపరి విరించిర్హరి రథః' అను శ్లోకమున శివ పక్షార్థమున బ్రహ్మ విష్ణువులకు జీవత చెప్పఁబడినది. కాళిదాసాది విజ్ఞులు మాత్రము చతుర్ముఖ బ్రహ్మను స్తుతించు సందర్భముననూ ఆతని ఈశ్వరతనే ప్రతిపాదించినారు. పై పురాణముల (శైవ-వైష్ణవముల) లో బ్రహ్మను హిరణ్య గర్భుడుగా వ్యవహరించుట గలదు. ఉత్తర మీమాంసా (వేదాంతశాస్త్రము) శాస్త్రమున హిరణ్యగర్భుడు కార్యబ్రహ్మముగా, అపరబ్రహ్మగా వ్యవహరింపఁ బడినాడు. **'హిరణ్యగర్భస్సమవర్తతాగ్రే భూతస్యజాతః పతిరేక ఆసీత్'** ఇత్యాది మంత్రమున జాతః అను శబ్దము కార్యబ్రహ్మమును, (బ్రహ్మయొక్క కార్యతను అనగా పుట్టుకను) చెప్పును. హిరణ్యగర్భ శబ్దము సశరీరులైన శివ, విష్ణువులను బోధించుట కూడ కలదు. అవ్యాకృతుడు ఈశ్వరుడు, హిరణ్యగర్భ, వైశ్వానరులకు ఈశ్వరత్వ, జీవత్వములు రెండునూ కలవని చెప్పుట కలదు. విష్ణువు (నారాయణుడు) అవ్యాకృతుడైనచో ఆయన నాభికమలమున పుట్టిన బ్రహ్మ హిరణ్యగర్భుడు. ఆ బ్రహ్మ ఫాలమున జనించిన శివుడు (రుద్రుడు) వైశ్వానరుడని చెప్పవలెను. అట్లు గాక శివుడు అవ్యాకృతుడైనచో ఆయన వామ భాగమునుండి పుట్టిన విష్ణువు హిరణ్యగర్భుడు, అతని దక్షిణభాగము నుండి పుట్టిన బ్రహ్మ వైశ్వానరుడని చెప్పవలెను. ఇట్లు దార్శనిక అవ్యాకృత, హిరణ్యగర్భ, వైశ్వానరులతో పౌరాణిక బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులను ఏదో విధమున సమన్వయించుకొనవలెను. (8) ఓంకారము ఈశ్వర వాచకము. శైవ వైష్ణవాది పారమ్యభేదము ననుసరించి శివుడో, విష్ణువో మరొకరో ఎవరు ఈశ్వర శబ్దవాచ్యుడైనను ఆతనికి ఓంకారమే వాచకము. ఓంకారము యొక్క ఈశ్వర వాచకత్వమున శైవవైష్ణవాదుల్వెరును విరోధింపరు. వివాదింపరు కూడ. కాని

వాచ్య వాచకముల అభేదమున వివాదము కలదు. అద్వైతమున బ్రహ్మకన్న భిన్నమేదియునులేనందున వాచ్యవాచకాభేదమంగీకరింపబడును. **'ఓమిత్యేకా క్షరమ్ బ్రహ్మ'** అని ఆరంభింపబడిన మాండూక్యోపనిషత్తునందు వెనుక వివరింపబడిన విధముగా ఓంకారములోని అకారాదులు వైశ్వానరాదులను (వ్యష్టిలోని విశ్వాదులను)బోధించును. వీరందరు కార్యబ్రహ్మలో, కారణబ్రహ్మలో అగుటచే ఓంకారము గూడ బ్రహ్మబోధకమగుటచే బ్రహ్మమని చెప్పబడినది. (9) పై ఉపనిషత్తుననుసరించి అకారము స్థూల ప్రపంచోపహిత (వైశ్వానరుని) చైతన్యము. ఉకారము సూక్ష్మప్రపంచోపహిత (హిరణ్యగర్భుని) చైతన్యము. ఆ రెంటికి కారణమైన మాయోపహిత చైతన్యమును (అవ్యాకృతుని) అభిదా వృత్తితో బోధించును. స్థూల ప్రపంచమును విడచిన కేవలచైతన్యమును అకారము, సూక్ష్మ ప్రపంచమును విడచిన చైతన్యమును ఉకారము, మాయను విడచిన చైతన్యమును మకారము లక్షణావృత్తితో బోధించును. అన్నింటి చైతన్యమొక్కటే ఆ మూడు వర్ణముల చేత బోధింపబడును. ఇట్లు ఓం అను వాక్యము యొక్క అర్థము అఖండచైతన్యమును బోధించును. అర్ధమాత్ర తురీయస్థితిని బోధించును. ఆ తురీయమే అకారోకారమకారములను పదములచేతను లక్ష్యమగును. ఓం కారము వాక్యము. అకారోకారమకారములు పదములు. వీనితో కూడినది వాక్యము. ఆ వాక్యము యొక్క తాత్పర్యార్థము అఖండ తురీయ చైతన్యమే. (10) అకారోకారమకారములు మూడు పదములు. వీని యొక్క సమాసము చేయబడగా ఓమ్ సమస్త పదమగును. వ్యస్తములైన ఆ మూడు పదములు కలసి వాక్యమగును. లోకమునను పదముల సమూహమే వాక్యము గదా! పై మూడు పదములు, పదార్థములు వ్యస్తములయినను లక్షణావృత్తిననుసరించి తాత్పర్యార్థ మైన అఖండ చైతన్యమును తెలుపుటలో సహకరించుట ఆవశ్యకమే అగును. సమస్తమైనను అవ్యయీభావము నందిన త్రివిధ చైతన్యములను వ్యస్తము గాను, సమాహార ద్వంద్వనువ్యస్తముగాను, లేక కర్మధారయముగా సమస్తము అఖండ చైతన్యమును లక్షణావృత్తితో బోధించును. శ్లోకములోని 'ఓమితి పదమ్' అను భాగము ఓంకారమునకు, అఖండమైన ఏకపదము పదసమూహము, వాక్యము అను మూడు విధములుగా అర్థము చెప్పవచ్చును. ఓం అనునది ఏకపదమైనను అవయవశక్తితో వ్యస్తమును, సముదాయశక్తితో సమస్తమునైన బ్రహ్మను



బోధించును. ఓంకారము వాక్యమైనప్పుడు అర్థముగల శబ్దము పదము అను నిర్వచనము ననుసరించి వర్ణైః శబ్దము పదములచేత అను అర్థమునిచ్చును. మరియు సమస్తముగ సర్వాత్మక బ్రహ్మమును, వ్యస్తముగ ఆధ్యాత్మిక, ఆధిదైవిక, ఆధిభౌతికభేద భిన్నమైన బ్రహ్మను బోధించుననుట ఈ శ్లోకమున ప్రతీయమాన మగుచున్నది. (11) అవరుంధాన శబ్దము నవరోధార్థకముగా గ్రహించినప్పుడు ఓ పరమేశ్వరా నీ తురీయస్వరూపమును గ్రహించుటకు అజ్ఞానము లేక మాయ అవరోధముగా నుండుటచే నీ సగుణ సమస్త రూపమును గాని, నీ నిర్గుణ వ్యస్తస్వరూపమును గాని స్తుతించుట ఉచితమా? కాదా? అన్న మీమాంసను విడచి నాచే పలుకబడిన ఓంకారము నిన్ను స్తుతించుచున్నది అని వివరించ వలసియుండును. దానివలన పాపక్షయమై నీ అనుగ్రహము కలిగి నా అజ్ఞానమును తొలగించు **అహం బ్రహ్మాస్మి** అను చరమ వృత్తి ద్వారమున అఖండైకరసైక బ్రహ్మమును పొందుట కవకాశమీ ఓంకారము ద్వారా స్తుతించుటచే నాకు కలుగును. 'యతో వచోనివర్తంతే అప్రాప్యమనసాసహ' అను శ్రుతి ఓంకారము కూడ పరమాత్మను సమస్తముగా గాని, వ్యస్తముగా గాని చెప్పలేకున్నను నాకున్న స్తుత్యుపకరణములలో ఓంకారమును మించినది లేనందున దానినే పలికిన అది స్తుతియగును. వాక్పర్యాయమైన 'గీర్' శబ్దమునకు మూలమైన గృధాతుజ క్రియ ఈ శ్లోకమున నుపయోగించుటచే స్తుతియే ప్రయోజనవంతమైన వాక్కుఅనీ, మిగిలిన వాక్కులు దాదాపు నిష్ప్రయోజనములు అని వ్యంజింపజేయబడినది. విశ్వవాచక మైన ఓం కారము యొక్క అర్థమున నేను చేరుటచే ఓంకారము స్తుతించుచునన్నను నేను స్తుతింతునన్నను ఒక్కటే గదా! **'యో వేదాదే స్వర'** ఇత్యాది శ్రుతి ఓంకారము వేదాదియందును, వేదాంతము నందును సాంప్రదాయికముగ నుచ్చరించ బడుటచే ఓంకారము నుండి పుట్టిన వేదము ఓంకారమునందే లీనమగునని ఆ ఓంకారము ప్రకృతి యందు అనగా అజ్ఞానమునందు లేక మాయయందు లీనమగుటకు ముందు నాకు 'అహం బ్రహ్మాస్మి' అను చరమవృత్తి ననుగ్రహించి లీనము కాగా నేను మహేశ్వరుడుగ మిగిలెదను అని 'ఓంకారము స్తుతించు ననుట చేత' వ్యంగ్య మగుచున్నది. (12) ఓంకారము పరమేశ్వరుని పదము, ఆయన ఉండుచోటు, ఆయన ఇల్లు. శరణద అను సంబోధనము శరణము నిచ్చువాడా! అను అర్థమునిచ్చును గావున

నీ శరణమైన ఓంకారమునందు చోటు ననుగ్రహించినచో నేను నీ అంతవాడనై ఇతరులకు శరణము నీయజాలుదును అని వ్యంజించును. నీవు దయతో సద్గురు స్వరూపమున ఓంకారము నుపదేశించినచో నేనొక ఇంటి వాడనగుదును. నీ ఇంటి వాడనగుదును. లేక నాయిల్లైన అజ్ఞానమును 'ద' అనగా కూల్చువాడా అను అర్థమును జెప్పిన బ్రహ్మజ్ఞానము ననుగ్రహించుటను వ్యంజించును. (13) వర్ణ శబ్దము ఆవరణార్థకము. వస్తువును కప్పిఉంచునది వర్ణము. లోకమున దాదాపు అన్ని వస్తువులకును ఉన్న వర్ణములు అనగా వస్తువును అనగా ఆత్మను కప్పి ఉంచునవే. ధ్వని శబ్దము ధ్వనించుట, తెలుపుట అని అర్థము నిచ్చును. ఆత్మ వస్తువును కప్పునవి వర్ణములు. ధ్వనించునవి శబ్దములు. ఇవియే నామ రూపములు, సచ్చిదానందములు అను ఆత్మ యొక్క అంశ త్రయమును నామ రూపములు అను అంగ ద్వయము కప్పియే యున్నది. విశ్వ మంతయు నామ రూపాత్మకమే. నామరూపములు మాయా మయములు కావున ఆత్మను కప్పిఉంచు నామరూపములు తొలగినప్పుడే సచ్చిదానందాత్మ ప్రకాశించును. వస్తు స్థితి ఇట్లుండగా ఈ శ్లోకమున ఓంకార(విశ్వ)ము తన వర్ణములతో సమస్తమును 'అభిదధత్' అనగా చెప్పుచు ధ్వనులతో 'అవరుం ధానమ్' అనగా ఆత్మ(జ్ఞానము)ను అవరోధించుచున్నదనుట ఈ శ్లోకములోని వైచిత్ర్యము. లోకమున ధ్వని వస్తువుల ఉనికిని తెలుపుట వాస్తవమే. తెలుపు చున్నట్లే ఉండి, జ్ఞానమునిచ్చుచున్నట్లే ఉండి శబ్దము లాత్మను మాత్రము తెలుప లేకుండుట గొప్ప వైచిత్ర్యమే. మరియు ఆవరించు వర్ణములు చెప్పుట కూడ వైచిత్ర్యమే. వాఙ్మయమంతయు పరమేశ్వర ప్రతిపాదకమే అయినను ఉపహితము (ఆత్మ) ను చెప్పుటచే తురీయధామము అనఁబడు శుద్ధస్వరూపమును చెప్పలేక పోయినది. అట్లే ఓంకారము ధ్వనులతో కూడినదై తెలుపు అంశముల(ధ్వనుల) తోనే దాని (శుద్ధస్వరూపము) నవరోధించుచునే యున్నది. ఇట్లు ఆత్మ ఓంకార రూపమున సమస్తముగా వ్యస్తముగా మనతో ఆడుకొనుచునే యున్నది. అభిదతో తెలుప లేక లక్షణతో తెలుపుచున్నదనుట వ్యంగ్యము.

స్వయంప్రకాశమైన తురీయ ధామమును వర్ణములు (కప్పునవి) అను పేరు కలవై చెప్పుటకు యత్నించుట ధ్వనులు (ప్రకాశములు) అను పేరు తెలిసియుండిన ఓంకారము నందలి అర్ధమాత్ర యందలి సూక్ష్మధ్వనులు



తురీయధామమును పూర్తిగా తెలుపుటకు ప్రయత్నించుచునే తెలుపలేకుండుట పరమాత్మ యొక్క సర్వ వాఙ్మయ ప్రతిపాద్యతను, సర్వ వాఙ్మయము యొక్క తెలుపలేకపోవుట అను అవరోధమును ప్రకటించుచునే సచ్చిదానందాత్మను తెలుపలేకపోవుట అను ఓంకార (విశ్వ) ము యొక్క అనిర్వచనీయత ఆత్మను తెలుపునది, తెలుపలేనిది అను విరోధము కలిగియుండుటను అభిదధత్ అవరుంధానమను శబ్దములు ఓంకారమాత్మను తెలుపునని కానీ, తెలుపదని కాని స్పష్టీకరింపలేకున్నవి.

లోకమున వస్తుప్రకాశకము వర్ణమే. ఈ వర్ణములెచటి నుండి వచ్చినవి? శబ్దము నుండియే. **'వేదే శబ్దేభ్య ఏవేదం జగన్నిర్మమే'** అను సూక్తి ఈ విషయమును తెలుపును. శబ్దము వర్ణాత్మకముగా, ధ్వన్యాత్మకముగా ద్వివిధము అనుట శాస్త్రవ్యవహారమున నున్నది. అయినను శబ్దము నుండి పుట్టిన (వర్ణములు) అర్థములు శబ్ద భిన్నములు కావు. వర్ణములను తనలోనే దాచు కొనుట, ప్రకాశింపచేయుట (ధ్వనించుట) అను రెండు పనులు అనగా ఉత్పత్తి నాశములొనర్చుట శబ్దాధీనమగుటచే శబ్దము కారణము, అర్థ(రూప)ము కార్యము అనీ కార్యకారణములు అభిన్నములని గమనింపవలెను. కావున ఈ శ్లోకమున ఓం కారమే వర్ణాత్మకము, ధ్వన్యాత్మకము అని చెప్పఁబడినది.

ప్రకృతి వికారమైన ఓంకారము నాట్యకత్తె వలె ముసుగు వేయుచు, తీయుచు చివఱకు తన నాట్యమునుపసంహరించును. ప్రకృతిలో లీనమగును. ఆ లీనమగుట చరమ వృత్తిని గలిగించి ఆ చరమవృత్తితో సహా ప్రకృతిలో లీనము కాగా పరమాత్మయే మిగులును. ఆ ఓంకారము సాంఖ్యులు ప్రకృతి విషయమున చెప్పిన నాట్యకత్తె భోగిని అనుట ఈ శ్లోకము ప్రకృతి వికారమైన ఓంకారము ఆ భోగిని యొక్క ముసుగువలె ప్రకృతిచేత వేయబడుచు తీయబడుచుచునే యున్నది. ఆ ముసుగుతో సహా మొత్తము ప్రకృతి జీవునకు తురీయధామము యొక్క అనుభూతి కలిగిన పిమ్మట మరల వాని ముందుకు రాకుండ నివృత్తమగును. అభిదధత్ అవరుంధానమ్ అను శబ్దములు ప్రకృతి యైన నాట్యగత్తె యొక్క అవకుంఠనమే ఓంకారము అని స్ఫురింజేయును. వాస్తవముగా ప్రకృతి యొక్క స్వరూపము ఆత్మయే కావున స్వరూపమునే వర్ణముగా కప్పుట విచిత్రముగా చూపించుట అనగా అభిదధత్(చెప్పుట)

ధ్వనించుట ప్రకాశింపజేయుచునే 'అవరున్ధానమ్' కప్పుట అను రెండు పనులను ఆత్మజ్ఞాన పర్యంతము చేయుచునే యుండును. స్వరూపమును వర్ణము కప్పకుండా గాక! ధ్వని ప్రకాశింపజేయు గాక! అని ఓంకార రూపమును స్తుతించుటయే సాధకుల కర్తవ్యము. వేదములోని వాక్యాక్రమములోని ఒక మంత్రము తనను రక్షించువానికి తన స్వరూపమును వివరించుట ఇతరునకు వివరింపకపోవుట అను అర్థము ఇట అనుసన్ధేయము. **'యమేవైషవృణుతే తేనలభ్యః'** అట్లే ఆత్మ కూడ తస్యైష ఆత్మావివృణుతే తనూస్వాం (తన శరీరము) ను అనగా తన మాయ (ప్రకృతి) ని వివరించును. తన ఈ కనబడు, కనబడని లక్షణమును విడచి తన జ్ఞానమును ప్రసాదించును. అదియే ఈ స్థితికి ఫలము. ఓంకారము యొక్క సర్వార్థము, పరమార్థము వివరించుట ఏ వ్యాఖ్యాతకునూ సాధ్యము కాని పని. ఎంత వివరించిననూ ఆ ముసుగును తొలగించి అనుగ్రహించుటకా పరమాత్ముడు తన ముసుగును(నామరూపములు) తొలగించు కొని అనుగ్రహించుగాక, అని ప్రార్థించుట తప్ప నాబోటి వారు చేయగల్గినదే మున్నది? ఇది అంతయూ 'తీర్ణవికృతి' అను సమాసపదము వలన లభించిన ధ్వని. ఓంకారము శబ్దబ్రహ్మాత్మకము. కావున తన అర్థమయిన సమస్తమైన, వ్యస్తమైన ఆత్మను తన స్వరూపమును తానే వివరించు గాక! అని ఆ శబ్ద (బ్రహ్మ, ఓంకార) మును కూడ ప్రార్థించెదను. దానితో శబ్దబ్రహ్మాభిన్న పరబ్రహ్మమును స్తుతించెదను. వ్యస్తుడనయిన నేను సమస్త పరమాత్మునకు సమస్తముగా (సశిరస్కముగా) మ్రొక్కెదను. పాతంజల యోగసూత్రము **'సమాధిసిద్ధిరీశ్వర ప్రణిధానాత్'** అనునది సమాధి ఈశ్వర ప్రణిధానము వలన సిద్ధించునని చెప్పును. **'ఈశ్వర ప్రణిధానాద్వా'** అను మరొక పాంతజల యోగ సూత్రము చిత్తవృత్తి నిరోధమునకు ఈశ్వర ప్రణిధానము అభ్యాసవైరాగ్యములతో పాటు హేతువని చెప్పును. **'తజ్జపస్తదర్థభావనమ్'** అను పాతంజల యోగ సూత్రము ప్రణవజపము, ప్రణవార్థభావనమును యోగసిద్ధిహేతువులుగా చెప్పుచున్నది. ప్రణిధానమనగా జపమే అనుట మధుసూదనసరస్వతికి సమ్మతమైన అర్థము. కాని ప్రణవ గానము, ప్రణవార్థ భావనము, ప్రణవార్థ చింతనము దీర్ఘ ప్రణవోచ్చారణము మొదలగునవన్నియూ యోగసహకారులే. కావుననే విష్ణుసహస్రనామములు ఓంకార పూర్వకముగా జపించవలెనని శ్రీశంకరులు చెప్పిరి. ఓం నమశ్శివాయ, ఓం నమోనారాయణాయ ఇత్యాది మంత్రములు ప్రణవపూర్వకముగానే జపించ బడుచున్నవి.



**అవతారిక:-** ప్రణవ ప్రాముఖ్యము పై శ్లోకమున చెప్పబడినది. ప్రణవ పూర్వకముగ కాకపోయినను భగవన్నామముల జప్యత, భగవన్నామముల కన్నిటికి ప్రణవతుల్యత, ముఖ్యముగ వేదమందు పేర్కొనబడిన ఎనిమిది నామముల జప్యత, తదర్థభావన ప్రాముఖ్యము ఈ శ్లోకమున చెప్పబడుచున్నది.

**శ్లో॥** ***భవశ్శర్వో రుద్రః పశుపతిరథోగ్రః సహమహాం***
***స్తథా భీమేశానావితి యదభిధానాష్టకమిదమ్।***
***అముష్మిన్ ప్రత్యేకమ్ ప్రవిచరతి దేవ శ్రుతిరపి***
***ప్రియాయాస్మై ధామ్నే ప్రణిహిత నమస్యోఽస్మి భవతే॥ 28***

భవః-శర్వః-రుద్రః-పశుపతిః-అథ-ఉగ్రః-సహమహాన్-తథా-భీమేశానౌ-ఇతి-యత్-అభిధానాష్టకం-ఇదమ్-అముష్మిన్-ప్రత్యేకం-ప్రవిచరతి-దేవ-శ్రుతిః-అపి-ప్రియాయ-అస్మై-ధామ్నే-ప్రణిహిత-నమస్యః-అస్మి-భవతే.

**ప్రతిపదార్థము:-** భవః=భవుడు, శర్వః=శర్వుడు, రుద్రః=రుద్రుడు, పశుపతిః=పశుపతి, సహమహాన్=మహాశబ్దముతో కూడిన, ఉగ్రః=ఉగ్రుడు, తథా=అట్లే, భీమేశానౌ=భీమేశానులు, ఇతి=అను, యత్=ఏ, అభిధానాష్టకమ్=ఎనిమిది నామములు (ఉన్నవో), అముష్మిన్=వీనిలో, ప్రత్యేకం=ఒక్కొక్కదానిని, దేవ=ఓ పరమేశ్వర, శ్రుతిః అపి=వేదము కూడా, చరతి=ఉచ్చరించుచున్నది, అస్మై=ఈ, ప్రియాయా=ప్రియమైన,ధామ్నే=స్వరూపమునయిన, భవతే=నీ కొఱకు, ప్రణిహిత నమస్యః=చేయబడిన నమస్య కలవాడను, అస్మి=అగుచున్నాను.

**తాత్పర్యము:-** భవ, శర్వ, రుద్ర, పశుపతి, ఉగ్ర, మహత్, భీమ, ఈశానా అను నీ ఎనిమిది నామములను వేదము (దేవత) లును ఉచ్చరించుచుండగా నీ గొప్పతనము చెప్పవలసినదేమున్నది? ప్రియమైన స్వరూపమునయిన నీకు నమస్కరించుచున్నాను.

**అనువాదము:-**

అభవ! భవాదినామములయష్టకమందు నొకొక్కదానినే
విభవముమీర పేర్కొనెడు వేదము కూడ ననేకరీతులన్
సుభగమతి ప్రియమ్ము నతిసుందరధామమమైన నీ యెడన్
సుభగతి నెల్లవేళల విశుద్ధముగా నతిసేయుచుండెదన్.

**వివరణము:**–భవాయదేవాయనమః ఇత్యాది ఈశానాయదేవాయనమః అనునంత వరకు వేదమంత్రమున భవ ఇత్యాది నామము లెనిమిది దేవ శబ్దమునకు విశేషణములుగా చేసి భవుడైన దేవునికి నమస్కారము ఇత్యాదిగా ఎనిమిది నమస్కారములు విధింపబడినవి. శివుని అష్టమూర్తుల ఈ నమస్కారములు కూడ అష్ట సంఖ్యాకమే. భవ శబ్దము జలమూర్తిని, శర్వ శబ్దము భూమూర్తిని, రుద్ర శబ్దము సూర్యమూర్తిని, పశుపతి శబ్దము అగ్నిమూర్తిని, ఉగ్ర శబ్దము యజమాన (అహంకార/ఆత్మ) మూర్తిని, మహచ్ఛబ్దము చంద్రమూర్తిని, భీమశబ్దము ఆకాశమూర్తిని, ఈశాన శబ్దము వాయుమూర్తిని ప్రతిపాదించును. ఓంకారమెట్లు సమస్త విశ్వమును ప్రతి పాదించునో పై ఎనిమిది నామములు సమస్త విశ్వమును ప్రతిపాదించును. ఓంకారమువలె విశ్వేశ్వరుని గూడ ప్రతిపాదించును. మకార ప్రతిపాద్యుడైన జీవుని విశ్వతైజసప్రాజ్ఞ మూర్తులను మూడింటిని, అకార ప్రతిపాద్యుడైన ఈశ్వరుని వైశ్వానర హిరణ్యగర్భ అవ్యాకృతుల మూర్తులను మూడింటిని, వ్యష్టి సమష్టి వ్యస్త సమస్త రూపులైన వీరి పరస్పరాభేదము నొకదానిని ఉకారమున అర్ధమాత్ర ద్వారమున నిర్విశేష చిన్మాత్ర తురీయాత్మను అను ఎనిమిదింటిని ప్రతిపాదించునని చెప్పవచ్చును. భవ శబ్దము విశ్వుని, శర్వ శబ్దము తైజసుని, రుద్ర శబ్దము ప్రాజ్ఞుని, పశుపతి శబ్దము వైశ్వానరుని, ఉగ్ర శబ్దము హిరణ్యగర్భుని, మహత్ శబ్దము అవ్యాకృతుని, భీమ శబ్దము వీరి పరస్పరా భేదమును, ఈశాన శబ్దము నిర్విశేష చిన్మాత్ర తురీయమును చెప్పును. కావుననే ఓంకారము వేదాది వేదాన్తమున ప్రతిష్ఠితమైనట్లు ఈ నామములు మధ్యమున వేదముచే ఉచ్చరింపబడినవి. శ్రుతిరపి ప్రవిచరతి అని శ్లోకమున పేర్కొనుట ఓంకార సాదృశ్యమును ప్రతిపాదించుటకే అని నా అభిప్రాయము. (బ్రహ్మాది) దేవ శ్రుతి రపి అని అన్వయించి, బ్రహ్మాది దేవతల శ్రవణేంద్రియములును నీ నామములలో విచరించునని అనగా వినుటలో ప్రవర్తించుననియు చెప్పవచ్చును. దేవశ్రుతి శబ్దము భవాది నామము లెనిమిదింటిని దేవశబ్దమును విశేష్యముగా చేసి భవాయ దేవాయనమః ఇత్యాదిగా వేదము వినబడుట కలదనియు చెప్పును. అస్మై ధామ్నే అనగా పూర్వశ్లోకమైన తురీయ స్వరూపము కొఱకు అని అర్థము. ప్రియాయ అను విశేషణము ఆ ధామము స్వాత్మరూపమే యని



చెప్పును. **'ఆత్మనః కామాయ సర్వమ్ ప్రియమ్'** అను శ్రుతి ననుసరించి పై యర్థమునకు ప్రామాణ్యమేర్పడియున్నది. భవాది నామములు వేదాధికారము లేనివారలకై ముఖ్యముగా పేర్కొనబడినవని వ్యాఖ్యాత మధుసూదన సరస్వతి చెప్పెను. విష్ణు పక్షమున భవాది నామములు షష్ఠ్యంతములై దేవశబ్దముతో సమసించువిధముగా షష్ఠీ తత్పురుష కర్మధారయ సమాసములుగా భవదేవ శర్వదేవ ఇత్యాదిగా రూపొందించుకొని భవునకు దేవుడు, శర్వునకు దేవుడు ఇత్యాది రూపమున విష్ణువునకు భవాది వంద్యత కలదని చెప్పవచ్చును. పరమేశ్వరునిమహిమనుస్తుతించుచుండగా భక్తి ఉద్రేకించును. ఏదైనా భావముద్రే కించునపుడు మాటలాగిపోవుట సహజము. అది గాక ఓంకారోచ్చారణముతో వేదపాఠమే ముగియుచుండగా స్తోత్ర(పాఠ)మెట్లు కొన సాగును. ఇక నీకు నమస్కరించకుండ నుండలేకపోవుచున్నానని కవి నాల్గవ పాదమున ప్రణిహిత నమస్యోస్మి అని చెప్పుచున్నాడు. పై శ్లోకమున శరణద అని సంబోధించి నీవు శరణమునిచ్చినచో శరణాగతుడనయ్యెదనని సూచించి ఈ శ్లోకమున నమస్య అనగా శరణాగతిచేయుదునని కవిచెప్పుచున్నాడు. శరణాగతి 'ముముక్షుర్వైశరణ మహమ్ ప్రపద్యే' ఇత్యాది శ్రుతుల చేతను శిష్టాచారము చేతను విహితము కావున చేయుచున్నారననుట వ్యంగ్యమగుచున్నది. పూర్వార్ధమున దాక్షిణాత్య వర్ణమైత్రి ఉన్నది. ఉత్తరార్ధమున ప్రత్యేకం, ప్రవిచరతి, ప్రియాయ, ప్రణిహిత అను పదములలో పదాద్యను ప్రాసమున్నది.

**అవ:**– పై శ్లోకమున నమస్య తనకు విహితమని చెప్పబడినది. ఈ శ్లోకమున పరస్పరవిరుద్ధ లక్షణముల నర్థము చేసికొనజాలని తనకు గత్యంతరము లేకపోవుటచే భక్త్యుద్రేకమున బహునమస్కారములు చెప్పబడు చున్నవి.

*శ్లో॥ నమో నేదిష్ఠాయ ప్రియదవ! దవిష్ఠాయ చ నమో*
*నమః క్షోదిష్ఠాయ స్మరహర! మహిష్ఠాయ చ నమో।*
*నమః వర్షిష్ఠాయ త్రినయన! యవిష్ఠాయ చ నమో*
*నమః సర్వస్మై తే తదిదమితి సర్వాయ చ నమః॥* ***29***

నమః–నేదిష్ఠాయ–ప్రియదవ–దవిష్ఠాయ–చ–నమః–నమః–క్షోదిష్ఠాయ–స్మరహర–మహిష్ఠాయ–చ–నమః–నమః–వర్షిష్ఠాయ–త్రినయన–యవిష్ఠాయ–చ–నమః–నమః–సర్వస్మై–తే–తత్–ఇదమ్–ఇతి–సర్వాయ–చ–నమః.

**ప్రతిపదార్థము:–** ప్రియదవ=ప్రియమైన అడవి గలవాడా!, నేదిష్ఠాయ=మిక్కిలి దగ్గఱగా నుండు వాడవైన, తే=నీకు, నమః=నమస్సు, దవిష్ఠాయ చ=అయినను దూరముగా నుండు వాడవైన (తే=నీకు), నమః=నమస్సు, స్మరహర=మన్మథుని చంపినవాడా! క్షోదిష్ఠాయ=మిక్కిలి సూక్ష్మమైన వాడవైన (నీకు), నమః=నమస్సు, మహిష్ఠాయచ=అయినను మిక్కిలి స్థూలమైనవాడవైన (తే=నీకు), నమః=నమస్సు, వర్షిష్ఠాయ=మిక్కిలి పెద్దవాడవైన (తే=నీకు) నమః=నమస్సు, త్రినయన=ఓ ముక్కంటీ! యవిష్ఠాయ=గొప్పయువకుడవైన, తే=నీకు, నమః=నమస్సు, సర్వస్మైచ=సర్వమును ఐనవాడవైన (తే=నీకు), నమః=నమస్సు!, తత్–ఇదం–ఇతి =ఆ పరతత్త్వమును, సర్వాయ=అంతయు తానేయగు, తే=నీకు, నమః=నమస్సు.

**తాత్పర్యము:–** ప్రియమైన అడవి గలవాడా! మన్మథుని చంపిన వాడా! ముక్కంటీ! మిక్కిలి దగ్గరగా నున్నను మిక్కిలి దూరముగానున్న, మిక్కిలి చిన్నవాడవయ్యు మిక్కిలి పెద్దవాడవైన, మిక్కిలి వృద్ధుడవైనను యువకుడవుగా నున్న సర్వమునై యుండి ఇది అది అను సర్వముగల నీకు మాటి మాటికి నమస్సులు!

**అనువాదము:–**

> కాష్ఠగతిన్ ప్రణామములు కామహరా! నను బ్రోచు నీకు నే
> దిష్ఠునకున్ దవిష్ఠునకు దీప్త హుతాశన నేత్ర శోభి క్షో
> దిష్ఠునకున్ మహిష్ఠునకు దివ్యకలామయ చంద్రచూడ వ
> ర్షిష్ఠునకున్ యవిష్ఠునకశేష సమస్తమునైన వానికిన్.

**వివరణము:–** (1) దూరముగనున్న అన్నిటి కన్నను అందఱికన్నను, దూరముగ నుండియు దగ్గఱనున్న వానినన్నిటిలో నందఱిలో దగ్గరగా నున్నవాడు, ఇట్లుండుట సర్వ వ్యాపకునకే సాధ్యము. పరమేశ్వరుడు సర్వవ్యాపియని ప్రథమపాదము బోధించును. చిన్నవారిలోకెల్ల చిన్నవాడయ్యు, పెద్దవారిలోకెల్ల మిక్కిలి పెద్దవాడు ఇట్లుండుట, చిన్న పెద్దలను కొలతలు లేని అనగా అమేయునకే సాధ్యము. కావున పరమేశ్వరుడు అమేయుడని ద్వితీయపాదము బోధించును. మిక్కిలి ముసలి వాడయ్యు, యువకులలో మిక్కిలి చిన్నవాడు, ఇట్లుండుట సర్వ కాలములలో నుండు వానికే సాధ్యము. కావున పరమేశ్వరుడు నిత్యుడని మూడవపాదము బోధించును. అంతయునయినవాడు ఇట్లుండుట



పరోక్షాపరోక్ష వస్తు స్వరూపుడైననే సాధ్యము. కావున పరమేశ్వరుడు అనంతుడని బోధించును. (2) మూడుపాదములలో మూడు సంబోధనములున్నవి. శివునకు అడవిలో నుండుట ఇష్టమని మొదటి సంబోధనము తెలుపును. సాధారణముగా తనలో తాను ఆనందించు వాడేకాంతమున సుఖముగ నుండగలడు. ఇతరుల వలన, ఇతరుల వస్తువులను పొంది ఆనందించువాడు తనలో తానానందింప నెఱుగని వాడు. ఇతరుల సంగమునభిలషించును. ముఖ్యముగా స్త్రీ సంగమున సుఖ మభిలషించును. మన్మథుడు స్త్రీయందు అభిలష కలిగించును. ఆ మన్మథునే చంపినవాడా! అను రెండవ సంబోధనము, స్త్రీయందభిలాష లేకపోవుటచే అడవి యందుండుట నీకిష్టమైనది, అని మొదటి సంబోధనములోని అడవిలో నెందు కిష్టముగా నుండునో దానికి కారణమును తెలుపును. కామమును సంహరింప వలెనన్న అజ్ఞానమును తొలగించు బ్రహ్మజ్ఞాన ముండవలెను. అజ్ఞానమే సర్వకామముల పుట్టుకకు కారణము. కావున శివుడు బ్రహ్మజ్ఞానియగుటచేతనే కామసంహారము చేయగలిగినాడని కామసంహారహేతు బ్రహ్మజ్ఞానము గలవాడని మూడవ పాదములోని సంబోధనము త్రినయన అనునది తెలుపును. అందఱకు రెండు కన్నులేయుండును, శివునకు ఫాలమున నేత్రమున్నది. అది జ్ఞాన నేత్రము. మూడు కన్నులలో అదియే ముఖ్యము. రెండు కన్నులు గలిగియు వివేకము లేనివాడు గ్రుడ్డివాడే! లౌకిక సుఖములనాశించువాడు తత్త్వమునెఱుగని వాడు రెండు కన్నులున్న గ్రుడ్డివాడు. వివేక (జ్ఞాన) నేత్రమున్నవాడు కన్నులు లేకున్నను కన్నులున్న వానికన్న బాగుగ మంచిచెడులనెఱిగి సంసార సుఖము నశించు ననుటెఱిగి తత్సుఖవిముఖుడై స్వాత్మానందియైయుండును. ఇట్లే మూడు సంబోధనములు పరస్పరానుగుణ్యములైయున్నవి. (3) నాల్గవ పాదమున సర్వనామప్రథమ సర్వశబ్దము ప్రయోగింపబడినది. శివునకన్న భిన్నమైనదేమియు లేదని సర్వస్మై అనుపదము తెలుపును. రెండవ సారి సర్వశబ్దము ప్రయోగింప బడినది కాని, యందు సర్వనామ లక్షణముగా అకారాంత చతుర్థ ప్రథమైక వచనమున 'స్మై' అను విభక్తి ప్రత్యయముగా కూర్పబడక సాధారణాకారాంత చతుర్థప్రథమైక వచనాంతముగానే 'సర్వాయ' అని ప్రయోగింపబడినది. అది బహు వ్రీహిసమాసాంతర్గతమగుట చేత సర్వనామత్వము లేక సాధారాణా కారాంతముగా ప్రయోగింపబడినదని వ్యాఖ్యాత మధుసూదన సరస్వతి చెప్పెను.

సహస్రనామములలో సర్వనామ శబ్దములు అసర్వ నామములుగా ప్రయోగింప బడుట సాధారణ విషయమే. కావున కస్మైనమః=కాయనమః, యస్మైనమః= యదేనమః, తస్మైనమః=తదేనమః, ఇత్యాదిగా సహస్రనామములలో చతుర్థంతముల చూడగలము. తద్ శబ్దము సర్వనామమే కాని అది పరోక్ష (సర్వ)మునే బోధించును. పదార్థములు పరోక్షములో, ప్రత్యక్షములో అయి యుండును. అవియన్నియు పరమేశ్వరున కధీనములై యుండును. కాని పరోక్షా పరోక్ష సర్వము కలవాడని, బహువ్రీహి సమాసము చేసినచో, అది, ఇది అను సర్వము తనలోనే కల్గియున్నవాడని 'తదిదమితి సర్వాయ' సమాసపదము బోధించును. సహస్రనామములలో అసర్వనామముగ ప్రయోగింపబడు సంప్రదాయము ననుసరించి సమాసము చేయకపోయినను అది ఇది అను నంతయు నైనవానికి నమస్సు అని అర్థము చెప్పవలెను. లేక (అవ) గత్యర్థక సృధాతు నిష్పన్నముగా భావించి జ్ఞానస్వరూపియను నర్థము చెప్పుకొనవచ్చును. (4) మూడు పాదములలో పరస్పర విరుద్ధార్థక ఙస్ ప్రత్యయాంత పదద్వయ ప్రయోగము చేత వృత్త్యనుప్రాసాలంకార, విరోధాలంకారము లేర్పడియున్నవి. పూర్వార్ధమున చతుర్థప్రాసమున్నది. 1-3 పాదములలో ద్వాదశాక్షర ప్రాస మున్నది. 'ఆసీనోదూరం వ్రజతి శయ్యానోయాతి సర్వతః' ఇత్యేతాదృశ మంత్రార్థ తాత్పర్యభూత భగవన్మహిమ ప్రతిపాదన మత్యంత మనోహరముగా నీ శ్లోకమున చేయబడినది. ఇట్టి శ్లోకము బహుశః ఏ ఇతర స్తోత్రములలో అనుసరింపబడ లేదనుకొందును. నమకమునందువలె చతుర్థ్యంత నామద్వయ పూర్వపదము లందు 'నమః' పదము ప్రయోగింప బడినది.

**అవతారిక:-** పై శ్లోకమున పరస్పర విరుద్ధ గుణ సామీప్యమీశ్వరునందు చెప్పబడినది. ఈ శ్లోకమున పరస్పరోపమర్ద స్వభావ త్రిగుణ సామీప్యము ద్వారా భగవన్మహిమ యొక్క సగుణత్వము, వేదాంత తాత్పర్య భూత నిర్గుణత్వమును చెప్పబడుచున్నవి.

**శ్లో॥** ***బహులరజసే విశ్వోత్పత్తౌ భవాయ నమోనమః***
***ప్రబలతమసే తత్సంహారే హరాయ నమోనమః।***
***జనసుఖకృతే సత్త్వోద్రిక్తౌ మృడాయ నమోనమః***
***ప్రమహసి పదే నిస్త్రైగుణ్యే శివాయ నమోనమః॥*** **30**



బహుల-రజసే-విశ్వోత్పత్తౌ-భవాయ-నమః-నమః-ప్రబల-తమసే - తత్సంహారే-హరాయ-నమః-నమః-జనసుఖకృతే-సత్త్వోద్రిక్తౌ-మృడాయ- నమః-నమః-ప్రమహసి-పదే-నిస్త్రైగుణ్యే-శివాయ-నమః-నమః.

**ప్రతిపదార్థము:-** విశ్వోత్పత్తౌ=విశ్వము యొక్క సృష్ట్యారమ్భమునందు, బహుల రజసే=అధిక రజస్సుగల, భవాయ=బ్రహ్మమూర్తియైన లేక భవనామకుడైన వానికి, నమః=నమస్సు, నమః=నమస్సు, తత్సంహారే=దాని (విశ్వము) యొక్క సంహారమునందు, ప్రబలతమసే=అధికతమస్సుగల, హరాయ=రుద్రమూర్తియైన లేక రుద్ర నామకుడైన వానికి, నమః=నమస్సు, నమః=నమస్సు, జన సుఖకృతే= జనుల యొక్క సుఖము నొనరించుట యందు, సత్త్వోద్రిక్తౌ=సత్త్వగుణము యొక్క ఉద్రేకమున, మృడాయ=విష్ణుమూర్తియైన లేక మృడనామధారియైన, ప్రమహసి= గొప్పతేజము గల, నిస్త్రైగుణ్యే=త్రిగుణములు లేని, పదే=పదమునందు, శివాయ =శివనామధారియైన శివుని కొఱకు, నమః=నమస్సు, నమః=నమస్సు.

**తా :-** విశ్వమును సృజించుటకు రజోగుణాధిక్యమును భవనామమును, దానిని సంహరించుటకు తమోగుణాధిక్యమును హరనామమును, దానిని సుఖింప జేయుటకు సత్త్వగుణాధిక్యమును మృడ నామమును పొందిన గొప్పతేజోమయ స్వరూపము. త్రిగుణాతీత తత్త్వము గల శివునకు మాటి మాటికి నమస్సులు.

**అనువాదము:-**

జగముల సృష్టికై బహు రజమ్మును దాల్చు భవాఖ్యమించు నా
జగముల సంహరింపహర సంజ్ఞను దాల్చు దమమ్ము నందు నా
జగముల బ్రోవ సౌఖ్యముల సత్త్వగుణమ్ము మృడాఖ్య దాల్చు నీ
త్రిగుణము దాటినట్టి శివతేజము గైకొను గాక నా నతుల్

**వివరణము:-** (1) త్రిగుణములైన రజస్తమస్సత్త్వముల సామ్యావస్థ మూల ప్రకృతి అనబడును. ఈ గుణములలో శుద్ధసత్త్వము ప్రధానమై మాయ అనబడును. అది ఉపాధిగా గలవాడీశ్వరుడని మలినసత్త్వము ప్రధానమై అవిద్య అనబడును. అది ఉపాధిగా గల చైతన్యము జీవుడని చెప్ప బడును. ఈశ్వరుడు మాయోపాధికుడై పూర్వకల్పీయ జీవుల సమష్టి కర్మ ఫలోన్ముఖ మైనప్పుడు త్రిగుణములలోని రజోగుణము అధికమైనప్పుడు ఈశ్వరుడు జగత్సృష్టి

యొనర్చును. సత్త్వగుణ మధికమైనప్పుడు జగములలోని జీవులు జనులు సుఖముగా బ్రతుకుచుందురు. తమోగుణమధికమైనప్పుడు జగములు, జీవులు అన్నియు నశించును. పురాణములలో జగత్సృష్టి రజోగుణాధిక్యము గల బ్రహ్మచేయునని, తమోగుణాధిక్యము గల రుద్రుడు జగత్సంహార మొనర్చునని, సత్త్వగుణాధిక్యము గల విష్ణువు జగద్రక్షణ మొనరించునని చెప్పబడియున్నది. అంతమాత్రమున అనగా నామగుణక్రియల భేదమున బ్రహ్మ, విష్ణు రుద్రులు భిన్నులని భావించగూడదు. (2)ఉపనిషత్తులలో 'యతోవా ఇమాని భూతాని జాయన్తే' ఇత్యాది శ్రుతి జగత్ సృష్టి స్థితి లయములే బ్రహ్మకృత్యములని చెప్పును. జగత్ సృష్టి స్థితి లయముల నొనర్చుటయే ఐశ్వర్యము. ఇది ఈశ్వరుని శక్తి లేక సామర్థ్యము లేక మాయయని పిలువ బడును. ఇట్టి మాయ ఉపాధిగా గల బ్రహ్మ ఈశ్వరుడని (పిలువబడును) చెప్పబడును. త్రిగుణాతీతుడైన బ్రహ్మ శివుడని మాండూక్యోపనిషత్తులోని 'శివమద్వైతం చతుర్థమ్మన్యన్తే' అను వాక్యము పేర్కొనును. దానిననుసరించి శివ శబ్దము నిర్గుణ బ్రహ్మవాచకముగా శైవులచే భావింపబడుచున్నది. విష్ణు పారమ్యము నంగీకరించు అద్వైతివైష్ణవులు త్రిగుణసహిత/ త్రిగుణాతీత బ్రహ్మను వాసుదేవ శబ్దమున పేర్కొందురు. శైవులలో కొందరు విష్ణునామముచ్చరించుట పాపహేతువందురు. విష్ణువు నవమానించెదరు. నిందించెదరు. విష్ణు విగ్రహముల ధ్వంసమొనరించెదరు. విష్ణ్వాలయములలో విష్ణు విగ్రహముల ధ్వంసమొనరించి శివ లింగముల స్థాపించెదరు. విష్ణునామముల వినవలసి వచ్చిన చెవులు మూసి కొందురు. ఇట్టి వారాగమముల ననుసరించి శివుడు భవహరమృడ నామరూపముల ధరించి మహేశ్వరుడే జగత్సృష్టి స్థితి లయముల నొనరించునని చెప్పెదరు. అట్లే శివ ద్వేషము కలిగిన వైష్ణవాగమముల ననుసరించి అనిరుద్ధ ప్రద్యుమ్న సంకర్షణ నామ(రూప)ముల ధరించి విష్ణువే (వాసుదేవుడే) జగత్సృష్టి లయముల నొనరించునని చెప్పెదరు. వ్యాఖ్యాత మధుసూదన సరస్వతి భవ శబ్దము బ్రహ్మను, హర శబ్దము రుద్రుని, మృడ శబ్దము విష్ణువును బోధించునని పురాణముల ననుసరించి చెప్పెను. (3) సృష్టి స్థితి లయముల క్రమమును పాటింపక శ్లోకమున సృష్టిలయ స్థితు లొనరించు భవ హర మృడులు పేర్కొన బడినారు. (4) 2-4 పాదములు ప్ర శబ్దముతో ఆరంభింపబడుట ప్రథమ



పాదమున వర్ణమైత్రి పాటింపబడుట శ్లోకమున అక్షరరమ్యతను పెంచును. (5) ఒక వృత్తమున నిబంధింపబడిన కావ్య భాగ (సర్గ) ము యొక్క లేక లఘుకావ్యము యొక్క అంతమున సమాప్తి సూచకముగ అన్యవృత్తమున శ్లోకము రచించు సంస్కృత కావ్య సంప్రదాయము ననుసరించి శిఖరిణీ వృత్తమున నిబన్ధింపబడిన ఈ స్తోత్రము యొక్క అంతము నందున్న ఈ శ్లోకము శిఖరిణీచ్ఛన్దమున గాక హరిణీచ్ఛన్దమున నిబన్ధింప బడినది. దీనికి ప్రతిపాదమున 'న స మ ర స ల గ' అను గణములుండును. (6) పరమేశ్వరుని అస్తుత్యుడని స్తుతించుట మహాపండితుడైన ఈ కవి యొక్క గడుసుతనమును తెలుపును. త్రిదశుల కందఱకు స్తుత్యుడైన పరమేశ్వరుడే త్రిదశ (3×10=30) మహిమ్నః స్తోత్ర ప్రతిపాద్యుడు.

నాలుగు పదముల చివఱ రెండేసి నమః పదములు గల ఈ ఎనిమిది నమః పదముల శ్లోకము సాష్టాంగ ప్రణామ మొనరించు ఎనిమిది గిట్టల వృషభేశ్వరుని ప్రతిరూపమా యన్నట్లున్నది.

**అవ:-** పై శ్లోకమున స్తోత్రాంత సంప్రదాయము ననుసరించి నమో నమో అను ఆమ్రేడనము చేయబడినది. ఈ శ్లోకమున స్తోత్రోపసంహారమొనరింప బడినది.

**శ్లో॥** ***కృశపరిణతి చేతః క్లేశవశ్యం క్వ చేదం***
***క్వ చ తవ గుణసీమోల్లఙ్ఘినీ శశ్వదృద్ధిః।***
***ఇతి చకితమమన్దీకృత్య మామ్ భక్తిరాధా***
***ద్వరద! చరణయోస్తే వాక్యపుష్పోపహారమ్॥*** ***31***

కృశపరిణతి-చేతః-క్లేశవశ్యం-క్వ-చ-ఇదం-క్వ-చ-తవ-గుణసీమో ల్లంఘినీ-శశ్వత్-ఋద్ధిః-ఇతి-చకితం-అమన్దీ కృత్య-మామ్-భక్తిః-ఆధాత్-వరద-చరణయోః-తే-వాక్యపుష్పోపహారమ్.

**ప్రతిపదార్థము:-** కృశపరిణతి=అల్ప పరిణామము గల, క్లేశవశ్యమ్ చ=అతి కష్టమున వశమొనరింపదగినదియునైన, ఇదమ్=ఈ, చేతః=మనస్సు, క్వ= ఎక్కడ, తవ=నీ యొక్క, గుణసీమోల్లంఘినీ=గుణముల సంఖ్యా పరిమాణము లను దాటిన, శశ్వదృద్ధిః చ=శాశ్వతమైన ఐశ్వర్యమును, క్వ=ఎక్కడ, ఇతి=అని, చకితమ్=భయపడిన, మామ్=నన్ను, భక్తిః=భక్తి, అమన్దీకృత్య=ప్రోత్సహించి,

వరద=ఓ వరముల నొసగు వాడా, తే=నీ యొక్క, చరణయోః=పాదములందు, వాక్యపుష్పోపహారమ్=వాక్యములను పూవుల కానుకను, ఆధాత్=ఉంచినది.

**తాత్పర్యము:-** అల్ప పరిణామముగల అతి కష్టమున వశమొనర్చుకొనదగిన నా మనస్సెక్కడ? గుణముల సంఖ్యా పరిమాణముల దాటిన నీ ఐశ్వర్యమెక్కడ? అని భయపడిన నన్ను నీ యందలి భక్తి ఈ వాక్యములను పూవుల కానుకయైన స్తోత్రమును నీ చరణములందుంచినది.

**అనువాదము:-**

కృశ పరిణతి క్లేశవశమీ హృదయమెచట
నెచట నీ గుణ సీమ లంఘించు బుద్ధి
యంచు భ్రాన్పడు నన్ బ్రోత్సహించి భక్తి
నీ పదముల గూర్చె వచస్సుమోపహృతిన్

**వివరణము:-** ప్రథమ శ్లోకమున స్వమతి పరిణామము ననుసరించి స్తుతించుట దోషము కాదని చెప్పిన ఈ కవి ఈ చివఱి శ్లోకమున తన చిత్తమున కృశ పరిణతి అని చెప్పుట మతి యొక్కయు చేతము యొక్కయు ఆంతరంగిక భేదమును పెద్దగ పాటింపని కవి అంతరంగమును తెలుపును. తన చిత్తము క్లేశవశము అనుట అవిద్యా(అ)స్మితారాగద్వేషాభినివేశములను పంచక్లేశములను దోషములచే మలినమని చెప్పి అట్లు క్లేశవశముగా నొనర్చిన దోషము నీదే గాని నాది గాదని వ్యంజించును. దోషరహిత బ్రహ్మాదులును అందుకోజాలని నీ గుణముల సీమనుల్లంఘించిన నీ యైశ్వర్యమునకు చెందినదే ఆ దోషము అనియు, **'కవీనాం కో దోషస్తవ గుణగణా నామవ గుణః'** అన్నట్లు నీవిన్ని లెక్కింపరాని గుణగణముల గలిగియుండుట నీ దోషము వలననే. నా వంటి కవులు నీ అన్ని గుణముల చెప్పలేకపోవుట జరిగినది అనియు పూర్వార్ధము వ్యంజించును. నీ భక్తి నన్ను నిలువనీయక ఈ స్తోత్రము నాచే రచింపజేసి నీ పాదము లందు సమర్పించినది. ఇది నాయందు నీయెడ గల భక్తిదే దోషము కాని నా దోషము కాదని, పూవులను దెచ్చి నీ పాదములందర్పింపజాలని అసమర్థుడను కావున ఈ వాక్యపుష్పములనే గ్రహించి సంతసింపుము అనియు ఉత్తరార్ధము వ్యంజించును.



ప్రథమపాదమున వర్ణమైత్రి ఉన్నది. పూర్వార్ధమున విషమాలంకార మున్నది. ఈ శ్లోకము మాలినీ వృత్త నిబన్ధనము.

**అవతారిక:-** పై శ్లోకమున తన స్తోత్రము యొక్క అసమీచీనత చెప్పబడినది. ఈ శ్లోకమున ఒకవేళ శారద యత్నించినను అది అసమగ్రముగానే ఉండునని చెప్పబడుచున్నది.

శ్లో॥ ***అసితగిరిసమం స్యాత్కజ్జలం సిన్ధుపాత్రే***
***సురతరువరశాఖాలేఖినీ పత్రముర్వీ।***
***లిఖతి యది గృహీత్వా శారదా సర్వకాలం***
***తదపి తవ గుణానామీశ! పారం న యాతి॥ 32***

అసితగిరి-సమం-స్యాత్-కజ్జలం-సింధుపాత్రే-సురతరువర-శాఖా-లేఖినీ-పత్రం-ఉర్వీ-లిఖతి-యది-గృహీత్వా-శారదా-సర్వకాలం-తదపి-తవ-గుణానాం-ఈశ-పారం-న-యాతి.

**ప్రతిపదార్థము:-** యది=ఒకవేళ, సింధుపాత్రే=సముద్రమను పాత్ర యందు, కజ్జలమ్=కాటుక (సిర), అసితగిరిసమమ్=నల్లని కొండతో సమానమైనను, సురతరువర శాఖా=కల్ప వృక్షము యొక్క గొప్ప కొమ్మ, లేఖినీ=కలము ఐనను, ఉర్వీ=భూమి, పత్రమ్=ఆకుఐనను, శారదా=సరస్వతి, సర్వకాలమ్=ఎల్లకాలము, లిఖతి తదపి=వ్రాయుచున్నను, ఈశ=ఈశ్వరుడా, తవ=నీ యొక్క, గుణానామ్=గుణముల యొక్క, పారమ్=అంతమును, న యాతి=పొందదు.

**తాత్పర్యము:-** ఓ ఈశా! సరస్వతి సముద్రమంత పాత్రలో కొండంత నల్లని సిరాను పోసి కల్పవృక్షపు గొప్ప కొమ్మతో భూమి యంత పెద్ద కాగితముపై ఎల్లకాలము వ్రాసినను నీ గుణముల అంతము దాక వ్రాయుట సాధ్యము కాదు.

**అనువాదము:-**

అసితగిరి సమమగు మసి అబ్ధి పాత్ర
కలము కల్పక శాఖయే యిలయె యాకు
కొనియు భారతి వ్రాయగ గనునె దరిని
త్వన్మహానంత గుణగణాబ్ధి న్మునుంగు

**వివరణము:-** సకార రేఫావృత్తి వృత్త్యనుప్రాస శోభను కలిగించుచున్నది. అతిశయోక్తి అను అర్థాలంకారము కూడ ఈ శ్లోకమున నున్నది.

**అవతారిక:-** పై శ్లోకమున శివుని స్తోత్రము వ్రాయుట శారదకును అసాధ్యమని చెప్పబడినది. ఈ శ్లోకమున సగుణుడు నిర్గుణుడునైన ఈశ్వరుని స్తోత్రము రచించిన కవి పుష్పదన్తుడను పేరు గలవాడని చెప్పబడుచున్నది.

**శ్లో॥ *అసురసురమునీన్ద్రైరర్చితస్యేన్దుమౌళే***
***గ్రథితగుణమహిమ్నో నిర్గుణస్యేశ్వరస్య।***
***సకలగుణవరిష్ఠః పుష్పదన్తాభిధానో***
***రుచిరమలఘువృత్తైః స్తోత్రమేతచ్చకార॥ 33***

అసుర సుర మునీన్ద్రైః-అర్చితస్య-ఇన్దుమౌళేః-గ్రథిత-గుణమహిమ్నః-నిర్గుణస్య-ఈశ్వరస్య-సకల గుణ వరిష్ఠః-పుష్పదన్తాభిధానః-రుచిరం-అలఘువృత్తైః-స్తోత్రం-ఏతత్-చకార.

**ప్రతిపదార్థము:-**అసురసురమునీన్ద్రైః=అసురుల చేత, అమరులచేత, మునీంద్రుల చేత, అర్చితస్య=పూజింపబడిన, ఇన్దుమౌళేః=చంద్రశేఖరుడైన, గ్రథిత గుణ మహిమ్నః=గ్రుచ్చబడిన గుణముల గొప్పతనముగల, నిర్గుణస్య=నిర్గుణుడైన, ఈశ్వరస్య=ఈశ్వరుని యొక్క, రుచిరమ్=అందమైన, ఏతత్=ఈ, స్తోత్రమ్=స్తోత్రమును, సకలగుణవరిష్ఠః=అన్ని గుణముల శ్రేష్ఠుడైన, పుష్పదన్తాభిధానః=పుష్పదన్తుడను పేరు గలవాడు, అలఘువృత్తైః=గొప్ప (పెద్ద) వృత్తములలో, చకార=చేసెను.

**తాత్పర్యము:-** అసురులు, అమరులు, మనీంద్రులు పూజించు చంద్రశేఖరుడు గొప్ప గుణముల కూర్పు గలవాడు అయినను ఆతడు నిర్గుణుడు. అట్టి ఈశ్వరుని అందమైన ఈ స్తోత్రము నీ గొప్పవృత్తములతో పుష్పదన్తుడను పేరు గల సకలోత్తమ గుణవంతుడు రచించెను.

**అనువాదము:-**

అసుర సుర మునీన్ద్రార్చ్య మహాగుణేన్దు
మౌళి నిర్గుణ మహిమను మహిత గుణుడు



పుష్పదన్తాభిధాను డద్భుతము గాగ
అలఘు వృత్తములన్ స్తోత్రమల్లినాడు

**వివరణము:-** ఇంతకు ముందు శ్లోకమున తన చిత్తము కృశపరిణతి యని చెప్పిన ఈ కవి తనను సకల గుణవరిష్ఠః అని చెప్పుకొనుటకు కవులు తనతో పోటీ పడలేరని వ్యంజించునేమో?

ఈ శ్లోకమును మాలినీ వృత్త నిబన్ధనమే.

**అవతారిక:-** పై శ్లోకమున గొప్పదేవుని స్తోత్రము గొప్పకవి చేత రచింప బడినదని చెప్పబడినది. ఈ శ్లోకమున స్తోత్రము నిర్దోషమని సభక్తి తత్పఠన ఫలము చెప్పబడుచున్నది.

**శ్లో॥ *అహరహరనవద్యం ధూర్జటేః స్తోత్రమేతత్***
***పఠతి పరమభక్త్యా శుద్ధచిత్తః పుమాన్ యః।***
***స భవతి శివలోకే రుద్రతుల్యస్తథాత్ర***
***ప్రచురతరధనాయుః పుత్రవాన్కీర్తిమాంశ్చ॥ 34***

అహః-అహః-అనవద్యం-ధూర్జటేః-స్తోత్రం-ఏతత్-పఠతి-పరమ భక్త్యా -శుద్ధచిత్తః-పుమాన్-యః-స భవతి-శివలోకే-రుద్రతుల్యః-తథా-అత్ర-ప్రచుర తరధనాయుః-పుత్రవాన్-కీర్తిమాన్-చ.

**ప్రతిపదార్థము:-** అహరహః=ప్రతిదినము, అనవద్యమ్=నిర్దోషమైన, ఏతత్=ఈ, ధూర్జటేః=శివుని యొక్క, స్తోత్రమ్=స్తోత్రమును, శుద్ధ చిత్తః=పవిత్రమనస్కుడైన, యః=ఏ, పుమాన్=పురుషుడు, పరమభక్త్యా=గొప్పభక్తితో, పఠతి=చదువునో, సః=వాడు, శివలోకే=కైలాసమున, రుద్రతుల్యః=రుద్రునితో సముడు, తథా=అట్లు, అత్ర=ఈ లోకమున, ప్రచురతరధనాయుః పుత్రవాన్=పుష్కల ధనము, ఆయువు, పుత్రులు గలవాడు, కీర్తిమాన్ చ=కీర్తిమంతుడును. (భవతి=అగును)

**తాత్పర్యము:-** ప్రతిదినము నిర్దోషమైన ఈ శివుని స్తోత్రమును పరమ భక్తి శుద్ధ చిత్తుడై ఏ పురుషుడు పఠించునో వాడు మరణానన్తరము శివలోకమున రుద్రతుల్యుడు కాగలడు. ఈ జన్మమున అధిక ధనము, అధికాయువు, అధిక పుత్రవంతుడును కాగలడు.

**అనువాదము:-**

అహరహమ్మనవద్య మీ హరుని స్తుతిని
బరమ భక్తిని బఠియించు భవ్యబుద్ధి
ప్రచురతరధనాయుపుత్రవంతు డిచట
అచట శివలోకమందు శివాభుడగును

**వివరణము:-** (1) ముందీ స్తోత్రము చదవవలెను. గొప్ప భక్తి కలుగును. దానివలన చిత్తశుద్ధి యేర్పడును. అప్పుడు ప్రతిదినము చదువు నాసక్తి కలుగును. అట్లు చదివిన వానికిహలోకమున ధనాయుః పుత్రాధిక్యము కలుగును. కీర్తి కలుగును. బ్రతికియున్నప్పుడే లోకమున ఆతడు కొనియాడబడును. మరణించు సమయమున శివ భావముకలుగును. మరణము పిమ్మట అర్చిరాది మార్గమున శివలోకము చేరి అట రుద్రునితో కూడి రుద్రుని వలెనే ఇతరులచే తానే స్తుతింప బడుచు సుఖముగా నుండును. (2) ధూర్జటి శబ్దము బరువైన జడలు గలవాడు అనునర్థమిచ్చును. అహరహరనవద్యమ్ అను ప్రథమ పాదారంభపదములలో హర శబ్దావృత్తి లేక అహర అను శబ్దము యొక్క ఆవృత్తి శ్లోకమున ఛేకాను ప్రాస శోభను కలిగించును. ఈ శ్లోకమును మాలినీ వృత్త నిబన్ధనమే.

**అవతారిక:-** పై శ్లోకమున స్తోత్రపాఠఫలము చెప్పబడినది. ఈ శ్లోకమున అసదృశీ దేవుడైన శివుని (పరమేశ్వరుని) స్తుతించుటచే ఈ స్తోత్రమునకు అసదృశత్వము కలిగినదని చెప్పబడుచున్నది.

***శ్లో॥ మహేశాన్నాపరో దేవో మహిమ్నో నాపరా స్తుతిః।***
***అఘోరాన్నాపరో మన్త్రో నాస్తి తత్త్వం గురోః పరమ్॥ 35***

మహేశాత్–న–అపరః–దేవః–మహిమ్నః–న–అపరా–స్తుతిః–అఘోరాత్–న–అపరః–మంత్రః–న–అస్తి–తత్త్వమ్–గురోః–పరమ్.

**ప్రతిపదార్థము:-** మహేశాత్=మహేశున కన్న, అపరః=మరొక, దేవః న=దేవుడు లేడు, మహిమ్నః=మహిమ్న (స్తోత్రమున) కన్న, అపరా=మరొక, స్తుతిః=స్తుతి, న=లేదు, అఘోరాత్=అఘోర (మంత్రము) కన్న, అపరః=మరొక, మంత్రః =మంత్రము, న=లేదు, గురోః=గురువున కన్న, పరమ్=శ్రేష్ఠమైన, తత్త్వమ్ =తత్త్వము, న అస్తి=లేదు.



**తాత్పర్యము:-** మహేశున కన్న గొప్పదేవుడు కాని, మహిమ్నమున కన్న గొప్ప స్తోత్రము గాని, అఘోర మంత్రమున కన్న గొప్ప మంత్రము కాని, గురువును మించిన శ్రేష్ఠమైన తత్త్వము గాని లేదు.

**అనువాదము:-**

భువనముల మహేశాన్య దేవుండు లేడు
ఇమ్మహిమ్నము మించు స్తోత్రమ్ము లేదు
మనువులందఘోరము మించు మనువు లేదు
తత్త్వముల గురుమించు తత్త్వమ్ము లేదు

**వివరణము:-** ఈ శ్లోకము యథాతథముగ పరశంభుమహిమ్న స్తోత్రమున నున్నది. అది దూర్వాసోముని విరచితము. అందు దూర్వాసుడు గురువుగా తనను ప్రకటించుకొనినాడు. ఆ స్తోత్రమున ఆ దూర్వాసుడే అఘోర మంత్రమును ప్రకాశించుట యున్నది. ఈ పుష్పదన్త మహిమ్నః స్తోత్రమున పుష్పదన్తుడు తనను గురువుగా ప్రకాశించుకొనుట గాని, అఘోరమంత్రమును ప్రశంసించుట గాని లేదు. ఇచట అఘోర మంత్ర ప్రశంస పూర్తిగా అప్రస్తుతము. కావున ఈ శ్లోకము ప్రక్షిప్తమేమో? మధుసూదన సరస్వతి కన్న ముందే ప్రక్షిప్తమైయుండుటచే ఈతని పాఠమున నీ శ్లోకము చేర్చబడియుండవచ్చును. ఈ శ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

**అవతారిక:-** పై శ్లోకము వలె ఈ శ్లోకమును ప్రక్షిప్తమని భావించవచ్చును.

***శ్లో॥ దీక్షా దానం తపస్తీర్థం జ్ఞానం యాగాదికాః క్రియాః।***
***మహిమ్నస్తవపాఠస్య కలాం నార్హన్తి షోడశీమ్॥ 36***

దీక్షా–దానం–తపః–తీర్థం–జ్ఞానం–యాగాదికాః–క్రియాః–మహిమ్నః–స్తవపాఠస్య–కలాం–న–అర్హంతి–షోడశీమ్.

**ప్రతిపదార్థము:-** దీక్షా=దీక్ష, దానమ్=దానము, తపః=తపము, తీర్థమ్=తీర్థము, జ్ఞానమ్=జ్ఞానము, యాగాదికాః=యాగాదికములైన, క్రియాః=క్రియలు, మహిమ్నః స్తవపాఠస్య=మహిమ్నః స్తోత్రపాఠము యొక్క, షోడశీమ్=పదునాఱవ, కలామ్=అంశమును, నార్హంతి=పొందవు.

**తాత్పర్యము:-** దీక్షాదాన తపస్తీర్థములు యాగాది క్రియలు మహిమ్నః స్తుతి పాఠము వలన కలిగిన పుణ్యము యొక్క పదునాఱవ భాగ పుణ్యమును కలిగింపజాలవు.

**వివరణము:-** ఈ శ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

**శ్రీః**



## శ్లోకానుక్రమణికా





## దోర్బల విశ్వనాథశర్మ గారి

### వ్యాఖ్యాన గ్రంథములు

| | | | |
|---|---|---|---|
| 1. | మూకపంచశతి | | |
| | a) ఆర్యాశతకమ్-సారోల్లాసినీ వ్యాఖ్యా | - | రూ. 25-00 |
| | b) కటాక్షశతకమ్-సారోల్లాసినీ వ్యాఖ్యా | - | 15-00 |
| | c) మందస్మితశతకమ్-సారోల్లాసినీ వ్యాఖ్యా | - | 15-00 |
| | d) స్తుతి శతకమ్-సారోల్లాసినీ వ్యాఖ్యా | - | 30-00 |
| | e) పాదారవిన్దశతకమ్-సారోల్లాసినీ వ్యాఖ్యా | - | 25-00 |
| 2. | శివమీడేస్తవః-హర్షిణీ వ్యాఖ్యా | - | 8-00 |
| 3. | శ్రీహలాయుధ శివస్తోత్రమ్-డమరుక వ్యాఖ్యా | - | 20-00 |
| 4. | చణ్డీశతకమ్-ప్రసాదినీ వ్యాఖ్యా | - | 30-00 |
| 5. | హరిమీడేస్తవః-మచర్చికా వ్యాఖ్యా | - | 20-00 |
| 6. | పరశమ్భుమహిమ్నః స్తోత్రమ్-శివప్రియ వ్యాఖ్యా | - | 40-00 |
| 7. | అమరుక శతకము-మనసిజ వ్యాఖ్యా | - | 20-00 |
| 8. | శ్రీ సోమనాథ భాష్యమ్-పరిష్కరణ | - | 25-00 |
| 9. | శ్రీ శివకర్ణామృతస్తోత్రమ్-1వ భాగము ఆస్వాదినీ వ్యాఖ్యా | - | 30-00 |
| | శ్రీ శివకర్ణామృతస్తోత్రమ్-2వ భాగము ఆస్వాదినీ వ్యాఖ్యా | - | 30-00 |
| | శ్రీ శివకర్ణామృతస్తోత్రమ్-3వ భాగము ఆస్వాదినీ వ్యాఖ్యా | - | 30-00 |
| 10. | ఏకశ్లోకరామాయణమ్ - మోహనరూపావ్యాఖ్యా | - | 20-00 |
| 11. | భాగవత చతుఃశ్లోకీ - మన్త్రవ్యాఖ్యా | - | 20-00 |
| 12. | చిద్గగనచన్ద్రికా - శివానందినీ వ్యాఖ్యా | - | త్వరలో |



ప్రతులకు

**సాధన గ్రంథ మండలి,** తెనాలి - 522 201

**శ్రీః**

**ఓం నమశ్శివాయ**

**శ్రీ పుష్పదన్తకృత**

# శ్రీ శివమహిమ్న స్తోత్రమ్

**విభూతీవ్యాఖ్య**

(ప్రతిపదార్థ-తాత్పర్య-అనువాద పద్య-వివరణములు)

**దోర్బల విశ్వనాథశర్మ**

ప్రకాశకులు

**శ్రీ విశ్వేశ్వరాశ్రమము**

**రామాయంపేట** - 502 101, మెదక్ జిల్లా



వెల : రూ. 15-00